# మూడు నవలలు

(మీకోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## నిన్ను చంపేస్తా

రచన : వసుంధర

## నీట మునిగిన మనిషి

రచన : సికిందర్

## వెంటాడే మృత్యువు

రచన : ఎమ్. వి. వి. సత్యనారాయణ

రక్తం త్రాగే పిశాచం - నాల్గవ భాగం

# నిన్ను చంపేస్తా!

## వసుంధర

రిసీవర్ ఎత్తి — "హల్లో!" అన్నాడు డిటెక్టివ్ వెంకన్న.

"వెంకన్న గారూ! మీరోసారి మా ఇంటికి రావాలి?"

"ఎవరు మీరు?"

"నా పేరు సూర్యారావు. మీతో నాకు చాలా అర్జంటు పనివుంది. వెంటనే మీరోసారి మా యింటికి రావాలి...." అంటూ అవతలి వ్యక్తి తన ఇంటి చిరునామా చెప్పాడు.

"ఏమిటూ పని?" అన్నాడు వెంకన్న.

"అది మీకు ఫోన్‌లో చెప్పలేను...." అంది అవతలి కంఠం.

"సరే—వస్తున్నాను...." అని ఫోన్ పెట్టేశాడు వెంకన్న.

వెంకన్నతోపాటే—ఫోన్ కాల్ విన్న అతని అసిస్టెంట్సు సీతమ్మ, రాజమ్మ అతనివంక ప్రశ్నార్థకంగా

చూశారు. సీతమ్మ—"బాస్—యిప్పుడు పదిన్నరయింది. అక్కడ ఎంత సేపు పడుతుందో ఏమో-భోంచేసి వెళ్ళండి" అంది.

"పదిన్నరకే భోజనమా? అందులోనూ నా దేవి చేసిన టిఫిన్ తిన్నాక!" అన్నాడు వెంకన్న.

"కానీ మీరు ఒంటిగంటకల్లా భోంచేయకుండా ఉండలేరేమోగదా!" అంది రాజమ్మ.

"ఈ విషయాలన్నీ చూసుకునేందుకు నాకు భార్య ఉంది. మీ పని వేరేవుంది. ఎవరైనా క్లయంట్స్ వస్తే పాయింట్స్ నోట్ చేసుకుని వుంచండి. అదీ మీ డ్యూటీ" అంటూ వెంకన్న లోపలకు వెళ్ళాడు.

అప్పుడు పద్మావతీదేవి వంకాయలు తరుగుతోంది.

"ఓహ్—ఈ వేళ దేవిగారు వంకాయకూర చెయ్యనున్నారా? చచ్చాను. ఒంటిగంటదాకా ఆగలేనే!" అన్నాడు.

"ఒంటిగంటదాకా కాకపోయినా కనీసం ఇంకో గంట ఆగితేకానీ కూర తయారవదు-" అంది పద్మావతీదేవి నవ్వుతూ.

"ఒక్క క్షణంకూడా ఆగనవసరంలేనిది మరోటుంది" అంటూ వెంకన్న చటుక్కున వంగి ఆమె నుదిటిని పెదవులతో స్పృశించి-"పనిమీద బయటకు వెళుతున్నాను. వంకాయకూర కోసమైనా ఒంటిగంటలోగా వచ్చేయడానికి ప్రయత్నిస్తాను—" అన్నాడు.

"రాత్రయితే ఏమోగానీ — పగలైతే మీరొచ్చేది వంకాయకూర కోసమేలెండి!" అంది పద్మావతీదేవి.

"దేవిగారి జోక్‌కి అప్పీలులేదు—" అంటూ వెంకన్న అక్కణ్ణించి కదిలాడు.

# 2

వెంకన్న ఆ యింటిముందు ఆగాడు.

అది చిన్న డాబా యిల్లు. ఇల్లు సెపరేట్ గా వుంది. చుట్టూ ప్రహారీగోడ. ఓ గేటు. గేటుతీసి లోపలకు వెడితే ఇంటి చుట్టూ తోట.

వెంకన్న వెళ్ళి కాలింగ్ బెల్ మ్రోగించాడు.

లోపల్నుంచి యే విధమైన చప్పుడూ కాకుండా నే తలుపులు తెరుచుకున్నాయి. తనను పిలిచిన ఆ సూర్యారావు ఎలా ఉంటాడోనని వెంకన్నకు చూడాలని ఉంది. అయితే తలుపుతీసింది సూర్యారావు కాదు. అందమైన ఓ పాతికేళ్ళ యువతి. అందమంటే సామాన్యమైన అందంకాదు. కళ్ళు జిగేల్ మనిపించే సౌందర్యం ఆమెది.

"నమస్కారమండి — సూర్యారావుగారున్నారా?" అన్నాడు వెంకన్న.

"లేరండి—" అందామె. అందానికి ఏమాత్రమూ తీసిపోదు ఆమె గొంతు.

వెంకన్న వాచీ చూసుకుని—"ఆశ్చర్యంగా వుందే! నన్ను రమ్మనమని సరిగ్గా ఇరవై నిమిషాల క్రితం ఫోన్ చేశాడాయన. ఇప్పట్లో ఎక్కడికి వెళ్ళాడు?"అన్నాడు.

ఆమె చటుక్కున తలుపులు బార్లా తెరిచి-"లోపలకు రండి!" అంటూ ఆహ్వానించింది.

వెంకన్న ఆశ్చర్యంగా — "ఆయన లేరన్నారు!" అన్నాడు.

"ఆయనింట్లో లేరు. ఫోన్ చేసి మిమ్మల్ని రమ్మన్నారంటే కొద్ది సేపట్లో ఆయనిక్కడికి వస్తారన్న మాట. మా యింట్లో ఫోన్ లేదు...." అందామె.

వెంకన్న లోపలకు అడుగుపెడుతూ — "మీరు సూర్యారావుగారి...." అని ఆర్థోక్తిలో ఆగిపోయాడు.

"భార్యను ..." అంటూ అతణ్ని హాల్లో కూర్చోబెట్టి తను లోపలకు వెళ్ళిందామె.

వెంకన్న కుర్చీలో కూర్చుని హాలుని పరీక్షించాడు. మంచి అభిరుచికి ఉదాహరణగా ఉన్నది హాల్లోని అలంకరణ! అతను ఆలోచనల్లో ఉండగానే కప్పులో కాఫీతో వచ్చిందామె.

వెంకన్న ఆశ్చర్యంగా—"అప్పుడే మీరు కాఫీ కలిపి తెచ్చారా?" అన్నాడు.

"లేదు. మా యింట్లో కాఫీ ఎప్పుడూ సిద్ధంగానే ఉంటుంది. ఆయన కాఫీగత ప్రాణి. అందుకని ఎప్పుడూ ఓ ఫ్లాస్కు నిండా కాఫీపోసి ఉంచుతాను—" అందామె.

"ఫ్లాస్కులో కాఫీ వుంటే చూస్తూ మీరూరుకో గలరా?" అన్నాడు వెంకన్న నవ్వుతూ.

"ఎందుకూరుకోలేను? నాకు కాఫీ వాసన కూడా కిట్టదుకదా—" అందామె.

"మీరు కాఫీ తాగరా?" అన్నాడు వెంకన్న.

"పాలు తాగుతాను. అదీ రోజు కొక్కసారి...." అందామె.

"మీరేనా కాఫీ అలవాటు చేసుకోవాల్సింది. ఆయన చేతైనా ఆ అలవాటు మానిపించాల్సింది—" అన్నాడు వెంకన్న.

"లేకపోతే చేసుకోవాల్సినంత మంచి అలవాటు కాదని. అలవాటైతే మానుకోవడమూ అంత సులభం కాదు. అలాగని అది ప్రమాదకరమూ కాదు. ఎందుకంటే ప్రపంచంలో కాఫీతాగని వాళ్ళ సంఖ్య బహు స్వల్పం.

అందుకని మేము దానిగురించి పెద్దగా పట్టించుకోలేదు. ఆమాటకొస్తే ఆయన అలవాటు చూసి నేనే డబ్బు నిలవేసి నూటయాభై పెట్టి ఆ ఫ్లాస్కు కొన్నాను—" అందామె.

"మీవారు ఏం చేస్తూంటారు?" అడిగాడు వెంకన్న.

"ఆయనకుద్యోగంలేదు. పెద్దలిచ్చిన ఈ ఇల్లూ ఓ పదెకరాల భూమీ ఉన్నాయి. పోతే ఏదో కమిషన్ వ్యాపారంలాంటిది చేస్తున్నారు. ఆయన బుర్ర చాలా గట్టిది. సలహాకోసం చాలామంది వ్యాపారస్థులాయన దగ్గరకు వచ్చి వెడుతుంటారు. ఆ విధంగా బాగా డబ్బు సంపాదిస్తున్నారు...." అందామె.

"అలాంటప్పుడు మీ యింట్లో ఫోనెందుకు పెట్టుకోలేదు?" అనడిగాడు వెంకన్న.

ఆమె ఒక్క క్షణం సిగ్గుపడ్డట్లు కనబడింది "నేనే వద్దన్నాను—" అంది.

"ఎందుకు?"

"మాది ప్రేమ వివాహంకాదు—కానీ జన్మజన్మల అనుబంధం అనుకుంటాను. ఇంటికి వచ్చేపోయే వాళ్ళెలాగూ ఉంటూనే వుంటారు. ఫోన్ ఉంటే ఆ బాధ చెప్పక్కర్లేదు. క్షణమాయన్ని నిమిత్తంగా వుండనివ్వరు. ధన సంపాదన మాకు ముఖ్యంకాదు. నాకసలు డబ్బు మీద ఆసక్తిలేదు...." అందామె.

"అదృష్టవంతుణ్ని. ఆయనుండగా వచ్చివుంటే మీరు విసుక్కుని ఉండేవారేమో-" అని వెంకన్న ఉలిక్కిపడి- "అవును.... అన్నట్లు నేనొచ్చింది ఆయన కోసంకదా— ఆయనింకా రాలేదేం?" అన్నాడు.

ఆమె కూడా సాలోచనగా-"మీకు ఏ సూర్యారావు

ఫోన్ చేశాడో ఏమో—" అంది.

"లేదు. ఈ ఇంటి చిరునామా ఆయనిచ్చిందే!" అన్నాడు వెంకన్న.

"ఆయనకు లక్ష పనులు. మీకిలా ఫోన్ చేయగానే ఎవరో పార్టీ తగిలుంటారు. మీకు ఫోన్ చేసి చెప్పడానికి తీలుపడ లేదేమో...." అందామె.

వెంకన్న లేచి నిలబడి—"మీ ఆయన్ను కలుసుకో లేకపోయినా మీ పరిచయం కలిగినందుకు చాలా సంతోషంగా వుంది. ఉన్న కాసేపటిలోనూ మీరొక ఆదర్శ మహిళ అని నాకు తోచింది...." అన్నాడు.

"కాసేపు కూర్చోండి—" అందామె.

"అవతల నాకు చాలా పనులున్నాయి. మీ ఆయనతో నేను వచ్చివెళ్ళినట్లు చెప్పండి...." అన్నాడు వెంకన్న.

ఆమె గుమ్మందాకా వచ్చి అతణ్ని సాగనంపి—అతడు గుమ్మం దాటగానే తలుపులు వేసుకుంది.

## 3

వెంకన్న తోట దాటుకుని గేటుతీసి బయటకు రాగానే ఓ యువకుడతన్ని పలకరించి — "మీరు వెంకన్నగారుకదూ!" అన్నాడు.

"అవును—మీ రెవరు?" అన్నాడు వెంకన్న.

"నా పేరు సూర్యారావు...." అన్నాడతను.

"అరే—మీకోసమే అరగంటనుంచి నేను ఎదురు చూస్తున్నది....పదండి లోపలకు వెడదామా!" అన్నాడు వెంకన్న మరోసారి వాచీ చూసుకుంటూ.

"వద్దులెండి, మీరు లోపలకు వెళ్ళినప్పట్నించీ నేనిక్కడే వున్నాను. మీరు వెళ్ళడం, రావడం నేను చూస్తూనే ఉన్నాను...." అన్నాడు సూర్యారావు.

వెంకన్న ఆశ్చర్యంగా-"అయితే మీరు నన్నెందుకు పిల్చినట్లు?" అన్నాడు.

"నేను లేకుండా మీరు నా యింట్లోకి వెళ్ళడమూ, నా భార్యతో కాసేపు మాట్లాడడమూ మాత్రమే నా క్కావలసింది...." అన్నాడు సూర్యారావు.

వెంకన్నకు కోపం వచ్చింది—"ఈ విషయం ముందే చెప్పచ్చుగా...." అన్నాడు.

"ముందు చెబితే నా భార్యతో మీ ప్రవర్తన మరోకలా వుంటుంది. అందుకే చెప్పలేదు...." అన్నాడు సూర్యారావు వెంకన్నవంక అదోలా చూస్తూ.

"మిస్టర్ సూర్యారావ్! యూ ఆర్ అప్టూ వాట్!" అడిగాడు వెంకన్న.

"కోపగించుకోకండి. ఇప్పుడు మీతో నేను చాలా మాట్లాడాలి. పదండి—అలా వెడదాం...." అంటూ సూర్యారావు రెండడుగులు ముందుకువేసి వెంకన్న కారును సమీపించాడు.

ఇద్దరూ కారులో కూర్చున్నారు.

వెంకన్న కారు స్టార్టుచేయగానే—"నా భార్యమీద మీకు కలిగిన అభిప్రాయమేమిటి?" అనడిగాడు సూర్యారావు.

వెంకన్న కాస్త కోపంగా వుందేమో "మిమ్మల్నిద్దర్నీ పక్కక్క చూసిన ప్రతివాడూ ఆమె నీకు భార్య అని తెలియగానే ఆమె దురదృష్టానికి విచారిస్తాడు...." అన్నాడు.

సూర్యారావు కోపగించుకోలేదు. నవ్వేసి—"సరిగ్గా చెప్పారు. అయితే నేను పెస్సిమిస్టునికాదు. ఆప్టిమిస్టుని. అందువల్ల నా అదృష్టానికి సంతోషిస్తాను. అదలాగుంచి

నురి కాస్త వివరంగా చెప్పండి....” అన్నాడు.

వెంకన్న చిరాగ్గా—“అంగాంగవర్ణన చేయాలా?” అన్నాడు.

“అసాధ్యం. ఆమెను చూడగానే భర్తనైన నాకే పవిత్ర భావాలు కలుగుతాయి. ఏ మగవాడూ—అందులోనూ మీవంటి సచ్ఛీలురు ఆమెనా దృష్టిలో చూడ గలరని అనుకోను—” అన్నాడు సూర్యారావు.

“సరిగ్గా చెప్పారు. ఆమె పవిత్రమూర్తి. ఆదర్శ మహిళ....” అన్నాడు వెంకన్న.

“జానకిని చూసిన ప్రతి మగవాడూ ఇదే ముక్క అంటున్నాడు....” అంటూ నిట్టూర్చాడు సూర్యారావు.

“ఏం? అది నిజంకాదా?” అనడిగాడు వెంకన్న.

“వెంకన్నగారూ... మీరు పేరు పొందిన డిటెక్టివ్‌లు. అరగంట ఆమెతో మాట్లాడివచ్చారు. నాకు భార్యగా ఆమె ఏ విధంగా వుంటున్నదో ఏమాత్రమైనా ఊహించ గలరా?” అన్నాడు సూర్యారావు.

వెంకన్న తమ మధ్య జరిగిన సంభాషణ చెప్పాడు.

సూర్యారావు అదోలా నవ్వి—“నలుగురిలోనూ ఆమె నా గురించి చాలా గొప్పగా చెబుతుంది. నిజానికి నేను ఎందుకూ కొరగానివాణ్ని. బియ్యే ఫెయిలయ్యాను. మా యింట్లో నన్నంతా పనికిరానివాడినని అన్నారు. వారసత్వపు ఆస్తి ఇచ్చేటంత గొప్పవాడుకాదు మా నాన్న. నాకు ఇద్దరు చెల్లెళ్ళు కూడా వున్నారు. వాళ్ళ బాధ్యత కూడా నాకు లేదు. ఇంట్లోంచి బైటకుపోయి నా కాళ్ళ మీద నేను నిలబడగలిగితే చాలునని నాన్న అన్నాడు. ఎక్కడా నా వుద్యోగాలు దొరకలేదు. అలాంటి సమయంలో జానకి తండ్రి నన్ను పిలిచాడు. ఏదో మారపు

వరుసలో బంధువవుతాడాయన నాకు. జానకిని పెళ్ళి చేసుకుంటావా అనడిగాడు. ఆమెను చూడగానే ఒప్పు కున్నాను. ఇల్లరికం వస్తావా అనడిగాడు. వస్తానన్నాను! అంతకుమించి గత్యంతరంలేదు నాకు. ఓ ఏడాది వాళ్ళింట్లో వున్నాను— పెళ్ళిచేసుకుని. ఆ యింట్లో నాకు గౌరవం లేదు. జానకి మాత్రం నన్ను ప్రాణానికి ప్రాణంగా చూసుకునేది. ఏడాది గడిచాక ఆమె నాతో—"ఈ యింట్లో మీకు గౌరవంలేదు. ఇలాంటిచోట మన ముండలేం. వేరేపోదాం—" అంది. నేను అంగీక రించాను. ఏర్పాట్లన్నీ ఆమే చేసింది. ఇక్కడుంటున్న బంగళా ఆమెది. ఆమె పేరున పదెకరాల భూమివుంది. లక్షో, రెండో డిపాజిట్లున్నాయి. ఆమెకు షేర్ మార్కెట్ గురించి చాలా తెలుసు. ఎంత చెప్పినా అది నాకర్థంకాదు. పేపర్లు చూసి చదివి ఆమె నాకేవేవో చెబుతుంది. ఆమె చెప్పిన ప్రకారం చేస్తాను. లాభాలు బాగానే వస్తాయి. నేను మగవాడినే కావచ్చు. కానీ ఆమె నాకు భర్త. నేనామెకు భార్యను...." అన్నాడు.

"చాలా విచిత్రంగా వుంది మీ కథ!" అన్నాడు వెంకన్న.

"అసలు విశేషం అది కానేకాదు. ఆమెకు ఏమాత్రం అతిశయంలేదు. అన్నింటికీ నన్నే పొగుడుతుంది. అందరితోనూ ఈ ఆస్తి అంతా తన భర్తదేనని చెబు తుంది. తన విజయాలన్నీ నా గొప్పలుగా చెబుతుంది. ఆమె చెప్పిన పనుల గురించి బయట తిరగడం తప్పితే వేరే నాకు పనేమీలేదు. నేను ఎందుకు పనికిరానివాణ్ణి. ఏమీ చేతకానివాణ్ణి. కానీ నాకు ఆమె మూలంగా నలుగురిలో అపురూపమైన గౌరవస్థానం లభిస్తోంది...."

అన్నాడు సూర్యారావు.

"మీరు చాలా అదృష్టవంతులు...." అన్నాడు వెంకన్న.

"చూస్తూ చూస్తూ ఇలాంటి అదృష్టం ఎవరైనా వదులుకోవాలనుకుంటారా? ఒకవేళ వదులుకోవాలనుకుంటే అందుకేదైనా బలమైన కారణముండదంటారా?"

వెంకన్న క్షణం ఆలోచించి—"ఇలాంటి పరిస్థితుల్లో ఒకరకం మన సత్వం ఏర్పడుతుంది. మీలో ఇన్ఫీరియారిటీ కాంప్లెక్స్ ఏర్పడి, క్రమంగా బలపడి మీరామెను ద్వేషించవచ్చు—"

సూర్యారావు నవ్వి — "నాకలాంటి కాంప్లెక్సులు ఏమీ లేవు. ఆమె నాకు దేవత. నన్నభిమానించి గౌరవించే ఆమెను నేను ఏవో మానసిక బలహీనతలతో ద్వేషించలేను....కానీ...." అని ఆగాడు.

"కానీ...." అన్నాడు వెంకన్న.

"నేనామెను చంపాలనుకుంటున్నాను..." అన్నాడు సూర్యారావు.

అప్రయత్నంగా సడన్ బ్రేక్ వేశాడు వెంకన్న. కారు ఆగింది.

"ఏమైంది? ఆశ్చర్యపడుతూ షాక్ తిన్నారా?" అన్నాడు సూర్యారావు.

"లేదు. కబుర్ల సందడిలో మా యిల్లు రావడం చూసుకోలేదు. అందుకే సడన్ బ్రేక్ వేసి ఆపాల్సి వచ్చింది—" అన్నాడు వెంకన్న.

## 4

ఇద్దరూ ఆఫీసులో కూర్చున్నాక-"ఇప్పుడు చెప్పండి!" అన్నాడు వెంకన్న.

"నేను నా భార్యను చంపాలనుకుంటున్నాను...." అన్నాడు సూర్యారావు.

"అయితే నన్నెందుకు పిలిచారు? హత్యలు చేయడానికి సాయపడను నేను...." అన్నాడు వెంకన్న చిరాగ్గా.

"ఆ సంగతి నాకు తెలుసు. అందుకే మిమ్మల్ని ముందుగా యింటికి వెళ్ళమన్నది "

"వెళ్ళి నేను సాధించినదేమిటి?"

"నా భార్య గురించి మీకు కొంత అయిడియా వస్తుందని...."

"అయిడియా అంటే...."

"నా భార్య ఆదర్శమహిళ అని మీరే గ్రహించారు. అలాంటి ఆమెను చంపాలనుకున్నానంటే అందుకు బలమైన కారణమే ఉండివుంటుంటుందని మీరూహించ గలరు. నన్ను సానుభూతితో అర్థం చేసుకోగలరు...." అన్నాడు సూర్యారావు.

"ఎంత బలమైన కారణమున్నా హత్యలపట్ల నాకు సానుభూతి వుండదు. మీమీద సానుభూతి కలిగినప్పటికీ సులభంగా హత్య చేసే విధానాలు సూచించలేను...." అన్నాడు వెంకన్న.

"నేనందుకు కాదు మీ దగ్గరకు వస్తే! నేను చేయబోయే హత్యను ఎవరైనా ఆపగలిగితే సంతోషిస్తాను."

వెంకన్న ఆశ్చర్యంగా—"మీరు చేయబోయే హత్యను ఆపాలని మీరు అనుకుంటే—అందుకు అందరి కంటే సర్వ సమర్థులు మీరే అవుతారు...." అన్నాడు.

"కావచ్చు. కానీ.... నేను కాదు...." అన్నాడు

సూర్యారావు.

"అంటే?"

"కొన్ని పరిస్థితుల్లో నా మనసు నా వశం తప్పుతోంది. నన్ను నేను నిగ్రహించుకోవడం కష్టమవుతోంది. ఏ క్షణాన్నయినా నేనామెను చంపవచ్చు. ఆమెను చంపడం నిజానికి నాకిష్టంలేదు. హత్యంటూ జరిగితే అది క్షణికావేశంలో నే జరగాలి ...."

"క్షణికావేశామా? అదీ మీ యింటిలో!" అన్నాడు వెంకన్న—అది అసాధ్యమన్న ధ్వనితో.

"మా యింట్లో ప్రతిరోజూ నాకు ఆవేశం కలుగుతోంది—ఆమె నోటివెంట కిషోర్ అన్న పదం వినిపించినపుడల్లా నన్ను నేనే మరిచిపోతాను...." అన్నాడు సూర్యారావు.

"కిషోర్ ఎవరు?" వెంగన్న అడిగాడు.

"అది నా భార్య ముద్దుగా నన్ను పిలిచే పేరు...."

"చిత్రంగా వుందే!" అన్నాడు వెంకన్న.

"మీకది చిత్రంగా వుండవచ్చు, కానీ నన్నది చిత్రవధ చేయిస్తోంది. మే మిద్దరమూ ఒకరికొకరు ఎంతో దగ్గరగా వున్నప్పుడు ఆమె—"ఓహ్—కిషోర్!" అంటూ పరవశిస్తుంది...." అన్నాడు సూర్యారావు.

"కిషోర్ అన్నది మీకామె పెట్టుకున్న పేరని మీరేకదా—అన్నారు ..." అన్నాడు వెంకన్న.

"అవును. వివాహమైన తొలిరోజుల్లో ఆమె నాతో మిమ్మల్ని ముద్దుగా కిషోర్ అని పిల్చుకుంటాను మీకు అభ్యంతరమా? అనడిగింది. నన్ను కూడా తన్ను తన కిష్టమైన పేరుతో పిల్చుకోమంది. కానీ నేనామె పేరు మార్చలేను. నన్నామె కిషోర్ అని పిలిస్తే అభ్యంతర

పెట్టలేను....” అన్నాడు సూర్యారావు.

“ఇప్పుడు మాత్రం మీకు అభ్యంతరమెందుకు?” అన్నాడు వెంకన్న.

“నాకు సూర్యారావని పేరుండగా ఆమె నన్ను కిషోర్ అని ఎందుకు పిలవాలి?”

“ఆడాళ్ళ విషయంలో ఇది కొత్తేమో కానీ— మగాళ్ళకిది మామూలే. పెళ్ళికాగానే పళ్ళమాంచిక పద్మావతి, సుబ్బాయమ్మ అనూరాధ, రామలక్ష్మి వసుంధర.... కావడం నాకు తెలుసు. మీ యింట్లో మీ ఆవిడే మీకు భర్తని మీరే చెప్పారుగదా—అందుకని ఆవిడకూ అలాంటి సరదాలుండి ఉంటాయి....” అన్నాడు వెంకన్న.

“అలాగే నేనూ అనుకున్నాను. కానీ అది నిజంకాదు. ఆమె కిషోర్ అనేవాణ్ని ప్రేమించింది. ఆమె మనసు నిండా వాడే వున్నాడు. నిర్భయంగా నా ఎదుట వాడి నామోచ్చారణ చేసే అవకాశం కోసం ఆమె నన్నా కోరిక కోరింది. నేను తెలివి తక్కువగా అంగీకరించాను....”

“అలాగని మీరనుకుంటున్నారా?”

“అనుకోవడంకాదు. అది నిజం. అందుకు తిరుగులేని సాక్ష్యాలున్నాయి....” అన్నాడు సూర్యారావు.

“భార్యాభర్తల మధ్య వ్యవహారాల్లో సాక్ష్యంగా రావడానికి సిద్ధపడ్డ ఆ వెధవలెవరు?” అన్నాడు వెంకన్న తీవ్రంగా.

“మీరు కోప్పడకండి. ఇందులో బయటివారి ప్రమేయం లేదు. సాక్ష్యాలన్నీ నా భార్య దగ్గరే ఉన్నాయి....”

"అంటే?"

"రాత్రి నిద్రలో ఆమె కిషోర్ గురించి కలవరిస్తుంది...."

"ఆ కిషోర్ మీరేనేమో!"

"నేనెలాగౌతాను. ఈ జన్మకిలాగూ ఒకటికాలేక పోయాం. వచ్చే జన్మలోనైనా ఒకటవుదాం కిషోర్.... అంటూ కలవరిస్తుందామె...." అన్నాడు సూర్యారావు దిగులుగా.

"మీ ఆవిడికి సినిమాల పిచ్చి వుందా?" అడిగాడు వెంకన్న.

"పిచ్చిలేదు కానీ సి ని మా లు చూస్తుంది..." అన్నాడు సూర్యారావు.

"మీకు తెలియదు. నేటి సమాజంపై సినిమాల ప్రభావం చాలావుంది. చాలామంది కలలు సినిమాలవల్ల ప్రభావితమైనవే! మీ ఆవిడ కూడా ఏ సినిమాలో సీక్వెన్సు అయినా కలగంటూంటే మీ రింకో విధంగా భావిస్తున్నారేమో! ఆమె కలలో హీరో మీరే అయి ఉంటారు...." అన్నాడు వెంకన్న.

"హీరోని నేనే అయితే సూర్యారావు పేరు తల్చుకోక ఆ కిషోర్ పేరు తల్చుకోవడమెందుకు?"

"అది ఆమె మీకు పెట్టుకున్న పేరు..."

"అసలామె నాకు వేరే పేరెందుకు పెట్టాలి? పెట్టినా కిషోర్ అనే ఎందుకు పెట్టాలి?"

"పేరెందుకు పెట్టాలి అంటే చెప్పవచ్చునుగానీ— కిషోర్ అనే ఎందుకు పెట్టాలంటే చెప్పడం కష్టం. ఎందుకంటే ఏ పేరు పెట్టినా ఆ పేరు గురించి అదే సందేహం కలుగుతుంది...."

"కానీ నాకలాంటి సందేహాలేమీ లేవు. కిషోర్ అన్న పేరు ఆమె నాకెందుకు పెట్టిందో—నాకు తెలుసు!"

"ఆమె కిషోర్ అనే వాణ్ని ప్రేమించిందంటారు. అంతేగా!"

"అనడానికి తిరుగులేని సాక్ష్యమున్నప్పుడు అనడానికేం?" అన్నాడు సూర్యారావు.

"ఏమిటా తిరుగులేని సాక్ష్యం?" వెటకారంగా అన్నాడు వెంకన్న.

"ఆమె స్వహస్తాలలో రాసుకునే డైరీ!"

ఆశ్చర్యంతో వెంకన్నకు నోట మాటరాలేదు. సూర్యారావు చెప్పే విషయాలు విని నోట్సు ప్రిపేరు చేస్తున్న రాజమ్మ, సీతమ్మల కలాలు కూడా ఒక్క క్షణం స్తంభించిపోయాయి.

## 5

డిటెక్టివ్ వెంకన్న కుర్చీలో వెనక్కు జారగిలబడి సూర్యారావు కథకు మనసులో మెరుగులు దిద్దుకుంటున్నాడు.

సూర్యారావు అనామకుడు. అప్రయోజకుడు. అతణ్ని జానకి కోరి వివాహమాడింది. నలుగురిలో అతణ్ని ప్రయోజకుడిగా తీర్చి దిద్దడానికి ప్రయత్నిస్తోంది. భర్తను కంటికి రెప్పలా చూసుకుంటూ సమాజంలో అతడికి స్థానం లభించేలా కృషి చేస్తోంది. కానీ ఆమె మనసులో కిషోర్ అనే మనిషి వున్నాడు. అతడు పొడగరి. అందగాడు. ప్రయోజకుడు. సర్వ సమర్థుడు. ఏ కారణాలవల్లనో జానకి అతణ్ని వివాహం చేసుకోలేకపోయింది. అయినా అతణ్ని మరిచిపోలేకపోతోంది. ఆ మమకారంతో భర్తకు

కిషోర్ అని పేరు పెట్టుకుంది. అతడిలో కిషోర్‌ను ఊహించుకుంటూ బ్రతుకుతోంది. అయితే భర్తపట్ల ఆమెకు అసంతృప్తివుంది. అందుకే మానసికంగా ఆమె కిషోర్‌తోనే వుంది. ఆమె కల్లోకి కిషోర్ మాత్రమే వస్తున్నాడు.

ఈ విషయాలన్నీ ఆమె డైరిలో రాసుకుంది. అది తిరుగులేని సాక్ష్యం.

ఏ భర్తయినా సహించలేని దారుణం ఇది. కానీ సూర్యారావు మంచివాడు. ఇది సహించి ఆమెను క్షమించా అనుకుంటున్నాడు. కానీ ఎలా? ఆమె అతడి కౌగిలిలో కరిగిపోతూ—"ఓహ్, కిషోర్!" అంటుంది. అతడి రక్తం మరిగిందంటే మరగదూ!

ఇప్పటికీ సూర్యారావు ఆమెను చంపాలనుకోవడం లేదు. చంపుతానేమోనని భయపడుతున్నాడు. తనీ ఆవేశంనుంచి బైటపడేమార్గం చూపించమని వెంకన్నను వేడుకుంటున్నాడు.

సూర్యారావు కోరిక ఏమిటంటే ఆ కిషోర్ ఎవరో తెలుసుకోవాలి. అతడికీ, జానకికీ మధ్య ఏమైనా కథ నడిచిందేమో కనిపెట్టాలి. ఆ కిషోర్ ఇప్పుడేం చేస్తున్నాడో ఆచూకీ తీసి అతడికీ ఇంకా జానకిపై మోజుందేమో తెలుసుకోవాలి. ఈ వివరాలన్నీ సూర్యారావుకి కావాలి.

జానకి కిషోర్‌ని ప్రేమించిందనడంలో సందేహంలేదు. అది మామూలు ప్రేమకాదు—ఆరాధన! అయితే ఆమె డైరీలో ఆరాధన తప్ప గత స్మృతులు లేవు. గతించిన మధురానుభూతుల్ని మళ్ళీ మళ్ళీ తల్చుకోవడంలేదు. సూర్యారావు ఇప్పుడు ఆమెకు అటువంటి అనుభూతులు

కూడా ఉన్నాయేమోనని తెలుసుకోగోరుతున్నాడు.

ఒకప్పుడామె కిషోర్‌ని ప్రేమించి ఉండవచ్చు. మన సాకరితో—మను వొకరితో—లాంటి సంఘటనలు మన దేశంలో కోకొల్లలు. కానీ సూర్యారావు పట్టింపు తనువు గురించి. ఆమె శారీరకంగా కలుషితమైనదా లేదా అన్నది అతడి నిప్పుడు వేధిస్తున్న సమస్య! ఆమె శారీరకంగా కలుషితం కాని పక్షంలో సూర్యారావు తన ఆవేశా న్నణచుకుందుకు ప్రయత్నిస్తాడు.

వెంకన్నకు సూర్యారావును చూస్తే జాలివేసింది. పెళ్ళికి ముందు భార్య చెడిందన్న విషయంలో అతడికి సందేహంలేదు. అయితే జానకిని చంపడం అతనికిష్టంలేదు. తన ఆవేశాన్ని అదుపులో పెట్టుకోవడంకోసం అతను చేస్తున్న అనేక ప్రయత్నాల్లో తనవద్దకు రావడం ఒకటి!

కోపం వస్తే వరుసగా అంకెలు లెక్క పెట్టమని పెద్దలు చెబుతారు. సూర్యార్యావు తనవద్దకు వచ్చాడు. తన పరిశోధనకు కొంతకాలం పడుతుంది. ఈలోగా అతడి ఆవేశం అదుపులోకి రావొచ్చును.

తన పరిశోధనలో కిషోర్‌కూ, జానకికీ శారీరక సంబంధం ఉందని బైటపడితే సూర్యారావు ఏంచేస్తాడు? జానకిని చంపేస్తాడా?

చంపడు. ఆ విషయం ఆమెకు చెప్పి ఆమె రహస్యం తనకు తెలిసిపోయిందని గర్వపడి ఆమెపై తన ఆధిక్యత బుజావుచేసుకుంటాడు. ఇంతకాలం అతడామె అదుపులో ఉంటూ వచ్చాడు. ఆమె తనకు భర్త అనీ, తనామె భార్య అనీ అతను చెప్పనే చెప్పాడు. బహుశా తనూ ఆమెకు భర్తలా జీవించాలని అతడి అంతరాంతరాల్లో ఉంది. అందుకోసం ఆమె బలహీనతలు తెలుసుకోవా

లనుకుంటున్నాడు. పెళ్ళికిముందు పర పురుషుడితో శారీరకసంబంధం ఉన్నదంటే—ఆడదానికి అంతకన్న బలహీనత ఏమున్నది? భర్తకావిషయం తెలిస్తే ఆమె ఆతడికి దాసోహం అనదూ?

వెంకన్న తన మనసులోని ఆలోచనన్నీ అసిస్టెంట్సుతో చర్చించాడు. సీతమ్మ, రాజమ్మ ఇద్దరూ నోట్సు ప్రిపేరుచేశారు. వెంకన్న ఇద్దర్నీ చదవమన్నాడు. రెండింట్లోనూ ఒకే విశేషాలున్నాయి.

"అయితే ఇప్పుడు నేనేం చేయాలి?" అన్నాడు వెంకన్న.

"మనం సూర్యారావు అత్తగారి ఊరు చేరాలి!" అంది సీతమ్మ.

"సూర్యారావు ఎంతగా భార్య చెప్పు చేతల్లో వున్నా—అతన్ని మరీ అంత తీసిపారేయనవసరంలేదు. అత్తగారితో తప్ప మాట్లాడనంత అసమర్థుడు కాడతను. అందుకని సూర్యారావు మామగారి ఊరని అందాం—" అన్నాడు వెంకన్న.

"భార్య చెప్పు చేతల్లోవుండే మగవాళ్ళను మీరెలాగూ సమర్థిస్తారని నాకు తెలుసు—" అంది రాజమ్మ నవ్వుతూ.

ఆమె మాటల్లోని ధ్వని వెంకన్నకు అర్థమయేలోగా "అన్నట్లు నా ప్రయాణం విషయం శ్రీమతికి చెప్పి రావాలి—" అనేసి నాలిక్కరుచుకున్నాడు.

"మేము మీ కూడా వస్తున్నామని చెప్పారంటే మీ శ్రీమతిగారు కూడా వస్తానంటారు. ఆలోచించుకుని మరీ వివరాలు చెప్పండి—" అంది సీతమ్మ నవ్వుతూ.

"మీరు నాకూడా వస్తున్నారని ఎవరన్నారు? నేను,

పద్మావతి మాత్రమే ఊరెరుగుతున్నాం!" అన్నాడు వెంకన్న.

"ఆహా — క్లయింట్‌కు తగ్గ డిటెక్టివ్!" అంది రాజమ్మ.

## 6

ఆ ఊళ్ళో డిటెక్టివ్ వెంకన్న రకరకాలుగా వాకబు చేశాడు. కిషోర్ ప్రసక్తి ఎక్కడా రాలేదు. జానకి ఇంట్లో కిషోర్ అన్న పేరుగల వారెవ్వరూ లేరు. ఆమె బంధువుల్లో కూడా కిషోర్ అన్న పేరుగల వారులేరు. వెంకన్న ఎంతో తెలివిగా జానకి తలిదండ్రుల్నీ, అన్న దమ్ముల్నీ, దగ్గర బంధువుల్నీ ప్రశ్నలువేసి కిషోర్ గురించి తెలుసుకోవాలని ప్రయత్నించి విఫలుడయ్యాడు.

అయితే ఎవరా కిషోర్?

ఒకరోజంతా భార్యతో చర్చించాడు వెంకన్న. దాన్నిబట్టి అతడనుకున్నదేమిటంటే జానకి చాలా తెలివైనది. ఆమెకు కిషోర్‌తో వ్యవహారం నడిచినట్లు ఇంట్లో ఎవ్వరికీ తెలియదు. కన్నెతనపు తొలిరోజుల్లో అతడంటే మోజుపడి తన్ను తనే అతడికి అర్పించుకుని ఉంటుంది. ఏ కారణంవల్లనో ఆమెకు అతడు అందలేదు.

అలాంటి కిషోర్ ఎవరై వుంటాడు?

జానకి స్నేహితురాండ్రయితే ఈ విషయంలో ఏమైనా చెప్పగలుగుతారు. ఎందుకంటే తలిదండ్రులకు తెలియకుండా ఆమె పరపురుషుడితో ఏర్పరుచుకున్న సంబంధం—తప్పక మరో ఆడపిల్ల మద్దతుతో ఏర్పడి ఉండాలి. ఆ ఆడపిల్ల ఇంట్లో మనిషై ఉండదు.

జానకికి ఆ ఊళ్ళో నలుగురు ముఖ్యమైన స్నేహితు రాండ్రున్నారు. వాళ్ళలో ఒకామెకు మాత్రం వివాహ

మొంది. మిగతా ముగ్గురూ ఇంకా ఊళ్లోనే వున్నారు.

వెంకన్న, పద్మావతి దేశంలోని సాంఘికపరిస్థితులపై పరిశోధనలు చేస్తున్నామని చెప్పుకుని సమాచారం కోసమన్నట్లు అందరిళ్ళకూ వెళ్లారు.

వారి శ్రమ ఫలించింది.

కిషోర్ ఆచూకీ దొరికింది. అతడు జానకి స్నేహితురాలు లలితకు అన్న!

కిషోర్ ఆ ఊళ్ళో చిన్న సైజు కాంట్రాక్టరు.

కిషోర్, లలిత—ఈ ఇద్దరికి తలిదండ్రులు చిన్నతనంలోనే పోయారు. మేనమామ యింట ఆ ఇద్దరూ కొంతకాలం వున్నారు. అక్కడ వాళ్ళను పనిమనుషులకన్నా హీనంగా చూసేవారు. కిషోర్ అక్కడ వుండలేకపోయాడు. కిషోర్ తనకు తానై ఎన్ని కష్టాలైనా భరించగలడు. కానీ చెల్లెలు అతడి ఆరో ప్రాణం. ఆమె కష్టపడుతూంటే అతను చూడలేడు. అందుకే చెల్లెల్ని తీసుకుని ఓ రాత్రి ఇల్లు వదిలిపెట్టి ఈ వూరొచ్చాడు. అప్పుడు కిషోర్‌కు పదేళ్ళు. చెల్లెలికి ఆరేళ్లు. ఏం చేసేవాడో ఎలా సంపాదించేవాడో లలితకు తెలియదు. కానీ లలిత అందరాడపిల్లలాగే దర్జాగా పెరిగింది. బజారులో పేపర్లు అమ్మేవాడనీ, సైకిల్ షాపులో మెకానిక్కు పని నేర్చుకుంటున్నాడనీ, సినిమా పోస్టర్లు అంటించేవాడనీ—ఇలా అతడి గురించి రకరకాల వింది లలిత. కానీ ఆమెకు అవసరమైనవన్నీ అమరేవి. తిండికి, గుడ్డకు ఎన్నడూ లోటులేదు. తలిదండ్రులున్నా అంత గొప్పగా ఉండేది కాదేమోననుకుంటోంది లలిత.

చిన్నప్పట్నించీ లలితకూ జానకికీ స్నేహముంది. లలిత జానకికి కిషోర్ గురించి తెగ చెప్పేది. జానకి అతడి

కథ విని ఆశ్చర్యపోతుండేది. ఆమెకు కిషోర్ అంటే ఎంతో గౌరవభావ మేర్పడింది. ఆ అన్నా చెల్లెళ్ళకు సాయపడాలని ఆమె అనుకునేది. అయితే కిషోర్ అయా చితంగా ఎవరి సాయాన్నీ స్వీకరించేవాడు కాదు. అతను కష్టపడి పనిచేస్తూనే ప్రయివేటుగా మెట్రిక్ కట్టి చెల్లెలుకంటే ముందుగానే అది పూర్తిచేశాడు. అలాగే బియ్యేవరకూ చదివాడు. నెమ్మదిగా అతడి సంపాదన పెరిగింది. చిల్లర వ్యాపారాలు, చిన్న కంట్రాక్టులు చేస్తూ అతనిప్పుడు ఈ స్థితికి ఎదిగాడు. చెల్లెలి పెళ్ళి ఘనంగా చేయాలన్నది అతడి ఆలోచన.

"జానకి కిషోర్ని ప్రేమించిందా?"

ఈ ప్రశ్నకు లలిత ఆశ్చర్యపడింది. అసలా విషయమే ఆ యింట ఎన్నడూ స్ఫురించలేదు. జానకి గొప్పింటి బిడ్డ. స్నేహితురాలు లలితకూ, కిషోర్కూ సంబంధించి నంతవరకూ ఆమె అంతే!

"ఒకవేళ లలితకు తెలీకుండా వారిద్దరి మధ్యనూ ప్రేమ కథ నడిచిందేమో!"

ఈ ప్రశ్నకు లలితకు కోపం వచ్చింది. లలితకు తెలీకుండా చిన్న మెత్తు రహస్యం కూడా దాచడు కిషోర్. అతడి జీవితం పూర్తిగా లలితకే అంకితమై పోయింది.

"అయితే మీ అన్నయ్య ఇంక పెళ్ళిచేసుకోడా?"

ఈ ప్రశ్న లలితను కలవరపరిచినట్లుంది. పెళ్ళిచేసుకుంటే కిషోర్ తన ప్రేమను మరొకరికి పంచిపెట్టాలి. ఆ ఊహ లలితకంత బాగోలేదు.

వెంకన్నకు పరిస్థితి కొంత అర్థమయింది. కిషోర్ చిన్నప్పటిన్నించీ తనకంటూ ఏమీ మిగుల్చుకోకుండా పూర్తిగా

చెల్లెలి గురించే ప్రతికాదు. అందుకు లలిత బాగా అలవాటుపడింది. అన్నయ్యా పూర్తిగా తన మనిషని ఆమె భావిస్తోంది. తను వివాహం చేసుకుని మరొకరి మనిషి కావడానికి అభ్యంతరం లేదు కానీ అన్నయ్య మరొకరి మనిషవుతాడంటే ఆమెకు బెంగగా వుంది. అది లలిత లోపం కాదు. కిషోర్ పెంపకం లోపం.

లలిత మనస్థితి కిషోర్ కి అర్థమై ఉంటుంది. అందుకే అతడు జానకిని ప్రేమించినా ఆ విషయం లలితకు తెలియ నివ్వలేదు. ఇద్దరూ బహుశా రహస్యంగానే కలుసుకునే వారు.

తన జీవితాన్ని పూర్తిగా చెల్లెలికే ధారపోసి—పేదరికపు అట్టడుగునుంచి ధనికవర్గపు స్థాయిని చేరుకున్న మగవాడిని ఏ యువతి ఆరాధించదు? కన్నెతనపు ముగ్ధత్వంలో ఆమె అతణ్ని మనసునిండా నింపుకొని—మనస్ఫూర్తిగా ఆహ్వానించి ఉంటుంది. ఆ తరువాత....

అతను, ఆమె కూడా భయపడివుంటారు — పెద్దలకు చెప్పడానికి!

అదే నిజమైతే జానకి తండ్రి ఆమెనో అనామకుడికిచ్చి ఎందుకు వివాహం చేస్తాడు?

బహుశా అందుకు కులం కారణమైవుంటుంది.... జానకికీ, కిషోర్ కీ కులం కలవదు.

వెంకన్న కిషోర్ ని కలుసుకున్నాడు—"మీ గురించి జానకి చెప్పింది. నా పరిశోధనకు మీ వివరాలెంతైనా పనికొస్తాయి. పెద్ద చదువులు చదివి కూడా ఉద్యోగాల కోసం ప్రాకులాడుతూ రోడ్లమ్మట తిరిగే యువతరానికి మీ కథ ఆదర్శం. నాకు మరికాసిని వివరాలు కావాలి!"

"జానకి ఎవరు?" అన్నాడు కిషోర్.

ఈ ప్రశ్నకు వెంకన్న ఆశ్చర్యపడ్డాడు. కిషోర్ ఆ ప్రశ్న చాలా మామూలుగా అడిగాడు. ఎక్కడా తడబడడంలేదు. వెంకన్న కిషోర్‌కు జానకి గురించి చెప్పాడు.

"ఓహో—లలిత స్నేహితురాలా, ఆమెకు పెళ్ళయి పోయిందనుకుంటాను—....ఇంకా మా లలితకు వరుడు దొరకడంలేదు...." అంటూ నిట్టూర్చాడు కిషోర్.

అతనెక్కడా జానకి గురించి ఆసక్తి కనబర్చకపోవడం వెంకన్నకు ఆశ్చర్యం కలిగించింది. అతను చాలా తెలివైనవాడై ఉండాలి. ఎంతో జాగ్రత్తపరుడై ఉండాలి.

వెంకన్న, జానకి, సూర్యారావుల సంసార జీవితాన్ని గురించి ఎంతో గొప్పగా చెప్పాడు.

కిషోర్ నిట్టూర్చి—"మీరు మీ పరిశోధన పేరుచెప్పి చాలామందిని కలుసుకుంటారనుకుంటాను. నా చెల్లెలికి ఓ మంచి సంబంధం చెప్పగలరా?" అనడిగాడు.

వెంకన్న అతనితో ఎంత మాట్లాడినా జానకి గురించి ఏమీ సమాచారం లభించలేదు.

## 7

"కిషోర్ దొరికాడు ...కానీ జానకికీ అతడికీ ఏమీ సంబంధమున్నట్లు తోచడంలేదు. అసలు జానకి అతణ్ని ప్రేమించినట్లు కిషోర్‌కి తెలుసునా అని నా అనుమానం...." అన్నాడు వెంకన్న.

సూర్యారావు అంతా విని—"అయితే కిషోర్ అనే వాడున్నాడు. వాడు జానకి స్నేహితురాలి అన్న. చాలా కష్టపడి పైకివచ్చాడు. మనిషెలా ఉంటాడు?" అనడిగాడు.

"జానకికి అన్ని విధాలా తగ్గ వరుడనిపిస్తుంది...." అన్నాడు వెంకన్న తాపీగా.

సూర్యారావు ఆవేశపడలేదు—"అంతే ఉండాలి. వాళ్ళిద్దరిమధ్యా కధ కూడా నడిచేవుండాలి...."

"ఆధారం లేనపుడు ఆ విషయం గురించి ఆలోచించడ మెందుకు? ఇది మనసుకు సంబంధించిన విషయమేకానీ శరీరానికి సంబంధించిన విషయం కాదు. ఎందుకంటే మీరామెను చేతిలో తాకి ఆమె పతిత అవునోకాదో తెలుసుకోలేరు. ఆమె ఎంతో మంచిది. మిమ్మల్ని అభిమానిస్తోంది. గతంలో చెడినట్లుగా ఆధారాలేమీ లేవు. మరి హాయిగా ఉండడానికేం?" అన్నాడు వెంకన్న.

"కేసు మీది కానపుడు ఎన్ని సలహాలైనా ఇవ్వవచ్చు. నా బాధ మీకెలా అర్థమవుతుంది. నా భార్య ఆరాధిస్తున్న పురుషుడొకడు ఈ భూమ్మీద ఇంకా బ్రతికి వున్నాడు. ఆమె యింకా వాణ్ని ఆరాధిస్తోంది...."

"అయితే ఏం చేస్తారు?" అన్నాడు వెంకన్న విసుగ్గా.

"ఓసారి వాళ్ళిద్దరూ కలుసుకొని మాట్లాడే ఏర్పాటు చేయండి—"

"ఎలా?"

"ఎలాగో మీరే చెప్పాలి...."

వెంకన్న ఆలోచించాడు. అందుకు ఒక్కటే ఉపాయముంది. లలితకు సంబంధం చూస్తే రెక్కలు కట్టుకుని వాలుతాడు కిషోర్. అదే చెప్పాడు సూర్యారావు.

సూర్యారావుకీ సలహా నచ్చింది. అతను అయిదారు రోజులు శ్రమపడి లలితకు మంచి సంబంధాలు రెండు

చూశాడు. ఆ వివరాలు నోట్ చేసుకుని వెంకన్న సూర్యా రావుని పంపించేశాడు.

తర్వాత వెంకన్న తన స్నేహితుడింటికి వెళ్ళి ఆ వివరాలు కిషోర్ కి వ్రాయమన్నాడు.

రెండు రోజుల్లో కిషోర్నించి సూర్యారావుకి ఉత్తరం వచ్చింది. అతను తన్నుతాను పరిచయం చేసుకుంటూ— తన చెల్లెలి వివాహం విషయంలో తనకు సాయపడ వలసిందిగా సూర్యారావు సరిగ్గా ఆ ఉత్తరం రాశాడు. ఉత్తరంలోని భాష ఎంతో మర్యాదగావుంది.

"వాడు సరాసరి నా యింటికే వస్తున్నాడు. ఎంత చనువో చూడండి!" అన్నాడు సూర్యారావు.

"చనువుకాదు. అతడు అమాయకుడని నా అభి ప్రాయం. లేకపోతే అంత ధైర్యంగా మీ కుత్తరం రాయడు. తప్పు చేసినవాడిలో బెదురుంటుంది...." అన్నాడు వెంకన్న.

"నేనంటే అందరికీ లోకువే. జానకి నా గురించి అతడికి అంతా చెప్పేసి ఉంటుంది. అందుకే ధైర్యంగా ఉత్తరం రాశాడు...." అన్నాడు సుబ్బారావు.

"అయితే వారిద్దరూ మరోసారి మిమ్మల్ని మోసం చేస్తారని మీ అభిప్రాయమా?"

"అదే జరిగితే ఇద్దరూ ఒక్కసారే చస్తారు...." అన్నాడు సూర్యారావు.

## 8

తలుపు తెరిచింది జానకి.

"నమస్కారమండీ — గుర్తున్నానా?" అన్నాడు కిషోర్.

"అయ్యో—మీరు లలిత అన్న కదూ—" అంటూ

లోపలకు ఆహ్వానించింది జానకి.

ఇద్దరూ లోపల కుర్చీల్లో కూర్చున్నాక — "ఏమిటిలా వచ్చేరు?" అంది జానకి.

"మీవారు మీకు చెప్పలేదా?" అన్నాడు కిషోర్ ఆశ్చర్యంగా.

జానకికి విషయం అర్థం చేసుకోడానికి కొద్దిక్షణాలు పట్టింది. "వారికి లక్ష పనులు. చెప్పడం మరిచిపోయుంటారు...." అందామె.

"మీ యింటి అడ్రసు లలిత ఇచ్చింది. మీ ఇంటికే వెళ్ళితీరాలని పట్టుపట్టింది. మీతో అయితే ముఖపరిచయమైనా ఉంది. ఆయనైతే బొత్తిగా తెలియదు నాకు. హోటల్లో దిగుదామనుకున్నాను. కానీ అది వినలేదు...."

"నేను మీ లలిత నే అనుకోండి. మరోలా ఎన్నడూ భావించవద్దు. మీ పని అయ్యేవరకూ మీరు మా ఇంట్లోనే ఉండాలి...." అంది జానకి.

"మీవారింకా రారా?" అనడిగాడు కిషోర్.

"ఆయన బైటకు వెళ్ళారంటే వెనక్కి రావడం కష్టం. పార్టీలు ఓ పట్టాన ఆయన్ను వదలరు...." అంటూ భర్త గురించి ఆదేపనిగా చెప్పుకుపోసాగింది జానకి.

కిషోర్ ఓపిగ్గా అంతా విని తనూ సూర్యారావును మెచ్చుకుని — "ఆయన్ను చూడాలని నాకు చాలా ఆత్రుతగావుంది. ఎప్పుడొస్తారో ఏమో—" అన్నాడు.

ఆ సమయానికి సూర్యారావు ఇంట్లోనే ఉండి వారి సంభాషణంతా వింటున్నాడు. వెంకన్న సలహా మేరకు అతను దొడ్డి తలుపు తీసి ఉంచుకుని ఇంట్లోంచి బైటకు వెళ్ళినట్లే వెళ్ళి మళ్ళీ యింట్లో ప్రవేశించాడు.

తనకు అనువుగావుండే రెండు మూడు రహస్య స్థలాలు ఏర్పరుచుకున్నాడు.

వారి మధ్య జరుగుతున్న సంభాషణ అతడికి బొత్తిగా నచ్చలేదు.

"చాలా దారుణంగా జాగ్రత్తగా మసులుతున్నారు. వీళ్ళు గూఢచారులుగా పనిచేయడానికి ఎక్సలెంట్ గా పనికొస్తారు...." అనుకున్నాడతను కసిగా.

సూర్యారావు ఎంతో జాగ్రత్తగా వారిద్దర్నీ గమనిస్తున్నాడు.

కిషోర్ ఆమెతో చనువుగా ఉండడానికి ప్రయత్నించ లేదు. ఆమె అతణ్ని తాకడంలేదు. అతను హాలు దాటి లోపలకు వెళ్ళాలనుకుంటున్నట్టులేదు. సోఫాలో నే కూల బడ్డాడు. ఆమె కాఫీ తెస్తానంది. అతనలవాటు లేదన్నాడు. కిషోర్ చిన్నప్పట్నించి అన్ని అలవాట్లకూ దూరంగా వున్నాడట. అతడి ఏకైక లక్ష్యం చెల్లెలు! ధన సంపాదన చేసేది కూడా ఆమె సౌఖ్యానికే!

కిషోర్ ఎక్కువ మాట్లాడడం లేదు. జానకి కూడా అట్టే మాట్లాడడంలేదు. పావుగంట భారంగా గడిచింది. అప్పుడు కిషోర్ లేచి—"నేను మళ్ళీ వస్తాను.... ఆయనొస్తే నేను వచ్చి వెళ్ళానని చెప్పండి ...." అన్నాడు.

"అయ్యో—భోంచేయకుండా ఎలా వెడతారు? మీరు కాసేపలా కూర్చోండి. నేను వంట చేసి వస్తాను. ఆయన కూడా కాసేపట్లో రావాలి...." అంది జానకి.

"అలాకాదు. అవతల నాకు పనివుంది. ఓ పెళ్ళి సంబంధం గురించి మాట్లాడాలి. మీ వారిని తీసుకుని వెడదామనుకున్నాను. నేనొక్కడినే వెళ్ళాల్సివస్తోంది.."

అన్నాడతను కాస్త దిగులుగా.

"పెళ్ళి సంబంధం మాట్లాడ్డానికిది సమయంకాదు. సాయంత్రం వెదుకురుగాని.... కాసేపట్లో ఆయన వొచ్చేస్తారు...." అంది జానకి.

మనుషుల్ని తనకు వశంచేసుకుని అధికారం చెలాయించడంలో జానకి తనకుతానే సాటి. కిషోర్ మాట్లాడకుండా సోఫాలో కూర్చున్నాడు. జానకి ఓ అరడజను పుస్తకాలు తెచ్చి అతడిముందుంచి—

"చదువుతూ వుండండి. నా వంటయ్యేలోగానే ఆయన రావచ్చు...." అంది.

అతను చదువులోపడ్డాడు. ఆమె వంటింట్లోకి వెళ్ళిపోయింది.

నిముషాలు గడిచిపోతున్నాయి. కాలం పరుగెడుతోంది. కానీ కిషోర్ మాత్రం నిమ్మకు నీరెత్తినట్లు సుఖంగా కూర్చుని తాపీగా పుస్తకం చదువుకుంటున్నాడు.

సూర్యారావులో సహనం చచ్చిపోతోంది. పూర్వ పరిచయం లేకపోయినా ఇలాంటి అవకాశంవస్తే ఏ మగాడూ వదులుకోడు. ఎంతో కొంత చనువును ప్రదర్శించి చొరవచేస్తాడు. అదృష్టం బాగుంటే కిట్టుబాటవుతుంది. లేదా ఏమీ జరగనట్లు అమాయకుడిలా నటించేయడమే! ఆడది ఇలాంటివి జరిగితే మగాడికి చెప్పుకోదు.

అసలు కిషోర్ లేవడేం? లేచి వంటింటి వైపు వెళ్ళడేం?

కిషోర్ తన భార్య జోలికి వెళ్ళనందుకు బాధపడుతున్నాడు సూర్యారావు.

మధ్యలో ఒకసారి జానకి వచ్చి అతణ్ని పలకరించి-

"ఆయన త్వరగా వస్తే బాగుండును. వంట కూడా పూర్తి కావస్తోంది...." అంది.

అప్పుడు సూర్యారావుకూ ఆకలివేసింది. జానకి లోపలకు వెళ్ళగానే అతను తన దారిన తోటలోకి వెళ్ళివచ్చి వీధి తలుపు తట్టాడు. కిషోర్ లేచివెళ్ళి తలుపు తీశాడు. సూర్యారావు ఆశ్చర్యాన్ని నటిస్తూ—"మీరు... మీరు....కిషోర్ కాదుగదా!" అన్నాడు.

"నా ఉత్తరం అందిందా—మీరు సూర్యారావు గారేనా?" అన్నాడు కిషోర్. సూర్యారావును చూడగానే అతడి ముఖంలో ఆనందం కనబడింది.

"ఈ రోజే అందింది. పోస్టుమన్ పావుగంట క్రితం ఇచ్చాడు. సారీ....మీకు చాలా ఇబ్బంది కలిగించాను. ప్రయాణం సక్రమంగా జరిగిందా? ఇల్లు సులభంగా దొరికిందా?" అంటూ కుశల ప్రశ్నలు వేశాడతను.

ఇద్దరూ కాసేపు వాలాయితీ కబుర్లు చెప్పుకున్నారు. వంట కాగానే అంతా కలిసి భోంచేశారు. జానకి వంటను ప్రత్యేకంగా పొగిడాడు సూర్యారావు.

"మీరోసారి మా యింటికి రండి. మా చెల్లెలు లలిత కూడా ఇంత బాగా చేస్తుంది—" అన్నాడు కిషోర్.

"చిన్నప్పట్నించి చెల్లెలు తప్ప మరో ధ్యాస లేదాయనకు. వచ్చే జన్మలోనైనా నాకిలాంటి అన్న దొరకాలని భగవంతుణ్ని ప్రార్థించుకుంటున్నాను...." అంది జానకి అతడివంక అభిమానంగా చూస్తూ.

"అవున్లే—ఈ జన్మకు కిషోర్ని అన్నగా వూహించుకో లేవుగా—" అంటూ మనసులో పెదర్థాలు తీసుకుని తృప్తిచెందాండు సూర్యారావు.

సాయంత్రం సూర్యారావు, కిషోర్ కలిసి సంబంధం

చూడ్డానికి వెళ్లారు.

వరుడు కిషోర్‌కి నచ్చాడు. కిషోర్ మాట్లాడిన తీరు, ఇస్తానన్న కట్నం ఆవతలివారికి నచ్చాయి. పెళ్ళి చూపులకు ఏర్పాటు చేసుకున్నారు—"పిల్ల నచ్చితే— నిశ్చయ తాంబూలం, పెళ్ళి చూపులు ఒక్క రోజునే!" అన్నాడు వరుడి తండ్రి. కిషోర్ చెల్లెలి అందాన్ని పొగిడాడు.

ఆ రాత్రికే అతను తిరుగు ప్రయాణమై వెళ్ళిపోయాడు.

# 9

"చాలా దిగులుగా కనబడుతున్నారు...." అన్నాడు వెంకన్న.

సూర్యారావు జరిగినదంతా చెప్పాడు.

"ఇందులో బాధపడాల్సినదేముంది?" అన్నాడు వెంకన్న ఆశ్చర్యంగా.

"ఇప్పుడు నేను జానకిని క్షమించే అవకాశంపోయింది. వాళ్ళిద్దరు కలుసుకుని తప్పుచేస్తే—నేను పెద్దమనిషిలా శాంతంగా ఇద్దరికీ బుద్ధి చెప్పాలనుకున్నాను. కుదరలేదు" అన్నాడు సూర్యారావు.

"యూ ఆరే కేస్ ఫర్ సైకాలజీ...." అన్నాడు వెంకన్న.

"నా బాధ మీకర్థంకాదు. ఆమె తప్పుచేసిందని నాకు తెలుసు. అయితే నాకు ఋజావు దొరకనివ్వడం లేదు. ఆ ఋజావు మీకు కూడా సంపాదించలేకపోతున్నారు...." అన్నాడు సుబ్బారావు.

"పనికిమాలిన పనులంటే నాకు వళ్ళు మంట...." అన్నాడు వెంకన్న.

"కానీ....ఇది పనికిమాలిన పనికాదు. నేను హత్య

చేయకుండా అపడానికీ ఋజువు ఎంతో అవసరం. మీరు నన్ను సరిగ్గా అర్థంచేసుకోవడంలేదు. నా భార్య ఒకణ్ని ప్రేమించి వాడితో కొంతకాలం గడిపి, ఆ స్మృతులను మనసునిండా నింపుకొని ఆ తర్వాత నన్ను పెళ్ళాడికూడా ఇంకా వాణ్నే ఆరాధిస్తోంది. నన్నామె గౌరవించడం వల్ల నేనామెనేమీ చేయలేకపోతున్నాను. అది నన్ను నిలువునా దహించివేస్తోంది. ఆమె నన్ను కిషోర్ అని పిలుస్తుంది. ఆ పిలుపు నాకిప్పుడు కంపరంగా వుంది. ఆమె కలలో కిషోర్ అని కలవరిస్తుంది. నా రక్తం మరిగిపోతుంది. తన డైరీలో ఆమె కిషోర్ పట్ల ఆరాధనను ప్రకటిస్తుంది. నా మనసామెను చంపేయమంటుంది. ఆమెను చంపాలంటే ఒక్కటేఒక్క అడ్డంకి....! అన్నివిధాలా ఆమె నాకంటే అధికురాలు. నా అదృష్టమో, దురదృష్టమో ఆమె నా భార్య అయింది. సమాజంలో నాకై నేను సంపాదించలేని స్థానాన్నామె నాకు సంపాదించిపెట్టింది. అటువంటి స్త్రీని ఏ కారణం చూపించి చంపను. ఆమె ఒక్క తప్పుచేస్తే నేనామెను చంపినా చంపుతాను. లేదా ఆమెకంటె అధికుడినన్న ఆనందంలో ఆమెను క్షమించినా క్షమిస్తాను. కానీ ఆమె తప్పు చేయడంలేదు. చేసిన తప్పును దొరకనివ్వడంలేదు. ఎంతో తెలివిగా వ్యవహరిస్తూ నన్నీ ఆట ఆడిస్తోంది...." అన్నాడు సూర్యారావు.

"అంతా మీ భ్రమ!" అన్నాడు వెంకన్న.

"నాకు ఋజువు సంపాదించలేరా?" అన్నాడు సూర్యారావు.

"మరొక ప్రయత్నం చేస్తాను...." అన్నాడు వెంకన్న. అతడి పథకం ప్రకారం సీతమ్మ ఒక రోజున జానకిని

కలుసుకుంది. హఠాత్తుగా ఎరిగున్న మనిషిని చూసినట్లు-
"అరే—జానకీ—నువ్వా?" అంది.

"మీ రెవరో నేను గుర్తుపట్టలేకపోతున్నాను...."
అంది జానకి ఆశ్చర్యంగా.

సీతమ్మ జానకి తండ్రి పేరు, ఊరి పేరు చెప్పింది.

"అవును—సరిగ్గానే చెప్పారు.... కానీ మీ రెవరో.."

"అప్పుడే నువ్వు మర్చిపోయారన్న మాట.... కిషోర్
గుర్తున్నాడా...." అనడిగింది సీతమ్మ.

"కిషోర్ అంటే లలిత అన్నయ్య....?" అంది జానకి
ప్రశ్నార్థకంగా.

"ఆఁ అతనే.... అప్పట్లో మీ ఇద్దరూ రోజూ ఒక
ర్నొకరు చూసుకోకుండా ఉండలేకపోయారు. ఒక
రోజున మీ ఏకాంతాన్ని నేను భంగం చేశాను...."

సీతమ్మ ఇంకా ఏదో చెప్పబోతుండగా జానకి ఆమెను
ఆపి—"చూడండి. మీ రెవరో నిజంగా నాకు తెలియదు.
అనవసరంగా దేనికీ ఆవేశపడని తత్వం నాది. అందుకని
తాపీగా చెబుతున్నాను. నాకు పెళ్ళయింది. నా భర్త
పేరు కిషోర్ కాదు. సూర్యారావు. పెళ్ళికిముందు నే
నెవరితోనూ తిరగలేదు. కిషోర్ నాకు అన్నలాంటివాడు.
మీరు ఎవర్ని చూసి ఎవరనుకుని పొరబడుతున్నారో
తెలియదు. మరెవరిదగ్గరైనా ఇలా మాట్లాడారంటే
బహుశా మీరు కట్టుడు పళ్ళు పెట్టించుకోవాల్సి
ఉంటుంది...." అంది.

సీతమ్మ మారుమాట్లాడకుండా అక్కణ్నించి బైట
పడింది.

"ఇంక రెండు ఉపాయాలున్నాయి. జానకి పేరున
కిషోర్‌కి ఒక ప్రేమలేఖ వ్రాసి అతడి ప్రవర్తన ఎలా

గుంటుందో చూడాలి. అలాగే కిషోర్ పేరున జానకికో ప్రేమలేఖ వ్రాసి ఆమె ప్రవర్తన ఎలాగుంటుందో చూడాలి...." అన్నాడు వెంకన్న సాలోచనగా.

"అలా చేయొద్దు...." అన్నాడు సూర్యారావు— "అప్పుడు జానకికి నిజంగానే కిషోర్ పై ప్రేమ పుట్టి అతడితో లేచిపోవచ్చు. అసలే ఇద్దరికీ ఒకరిపై ఒకరికి ఆకర్షణ వుంది. దానికిలాంటి ప్రోత్సాహం లభించడం నాకిష్టంలేదు...."

"అయితే ఆఖరి ఉపాయం చెప్పనా?" అన్నాడు వెంకన్న.

"ఏమిటది?"

"జానకిని హత్య చేయడం. హత్య చేసేముందు ఆమెకు ఆమె తప్పుల్ని చెప్పడం చాలా అవసరం. అప్పుడు మీకు మానసిక తృప్తి కూడా ఉంటుంది...." అన్నాడు వెంకన్న.

"ఆహా—ఎన్నాళ్ళకు మీరు నేను కోరిన సలహా యిచ్చారు? మీరిలాంటి సలహా యిస్తారనే చాలాకాలంగా ఎదురుచూస్తున్నాను. హత్య ఎక్కడ ఎప్పుడు ఎలా చేయాలో మీరే నాకు వివరించాలి...." అన్నాడు సూర్యారావు.

"అలాగే—అవన్నీ రేపు చూద్దాం—" అన్నాడు వెంకన్న.

సూర్యారావు వెళ్ళిపోయాక — "సూర్యారావు పెళ్ళాన్ని హత్య చేయకపోతే నేనే అతణ్ని చంపేసేలా ఉన్నాను—ఇలాంటి కేసెక్కడా వినలేదు, కనలేదు...." అన్నాడు.

# 10

మర్నాడుదయం వెంకన్న ఆఫీసుకు చిన్న బ్రీఫ్ కేస్‌తో వచ్చాడు సూర్యారావు. అతను మరీ అంత ఉత్సాహంగా లేడు. దిగులుగా వెంకన్నవంక చూస్తూ—"ఇంక మీరే నాకు గురువు...." అన్నాడు.

"నిన్న ఏం జరిగింది?" అన్నాడు వెంకన్న.

"ఇంతకాలం నేను గుర్తించలేదు. ఆమె....అనగా నా భార్య జానకి .... అసాధారణ స్త్రీ! నాకామె భార్యగా లభించడం జన్మజన్మల అదృష్టం. ఆమె అందం, నడక, మాట, తీరు .... ఒకటేమిటి — ఈ సృష్టిలో ఆమెలాంటి వ్యక్తి మరొకతె లేదు...." అన్నాడు సూర్యారావు

"ఈ ప్రపంచంలో ఏ ఇద్దరు వ్యక్తులూ ఒక్కలా ఉండరు. అన్నీ ఒక్కలా వుంటే కనీసం వేలిముద్రలైనా తేడా వుంటాయి. అందువల్ల మీ భార్యవంటి స్త్రీ మరొకామె వుండదని నాకూ తెలుసు—" అన్నాడు వెంకన్న.

"మీరేమనండి. ఆమె అపూర్వ వ్యక్తి--" అన్నాడు సూర్యారావు.

"అయితే ఆమెను చంపనంటారా?" అడిగాడు వెంకన్న. ఈ పిచ్చివాడు నాకెక్కడ దొరికాడు భగవంతుడా అన్న దిగులు అతడి కళ్ళలో కనబడుతోంది.

"ఎందుకు చంపను? చంపితీరతాను. అదే నా నిర్ణయం" అంటూ సూర్యారావు బ్రీఫ్ కేసు తెరచి ఓ వస్తువు పైటకుతీశాడు. అది తళతళ మెరుస్తున్న కత్తి!

"ఈ కత్తి ఎక్కడ సంపాదించారు?" ఆశ్చర్యంగా అడిగాడు వెంకన్న.

"ఇదీ ఆమె సంపాదనే! కాలేజీలో ఝాన్సీలక్ష్మి బాయి వేషం వేస్తే బహుమతిగా ఇదా మెకిచ్చారుట. ఆ కత్తితోనే ఈ రోజు నేనామె ప్రాణాలు తీసు కోతున్నాను—" అన్నాడు సూర్యారావు.

"మిస్టర్ సూర్యారావ్! మీమీద నాకు పూర్తి సానుభూతి వున్నది. అందుకే అడుగుతున్నాను. హత్య చేసి మీరేమి సాధించదల్చుకున్నారు? హంతకుడిగా కోర్టులో నిలబడి జడ్జిచేత శిక్ష వేయించుకుందామనా? లేక తెలివిగా హత్య చేసి తప్పించుకుందామనా?" అన్నాడు వెంకన్న.

సూర్యారావు సాలోచనగా — "జానకిని హత్య చేసికూడా నేను తప్పించుకునే సాధనముందంటారా?" అన్నాడు. అతని మాటల్లో ఆశకూడా ధ్వనిస్తోంది.

"ఉంది. మీకు నేను సాయపడతాను కూడా—" అన్నాడు వెంకన్న.

"అయితే నేను ధన్యుణ్ని. మీరెలా చెబితే అలా చేస్తాను—" అన్నాడు సూర్యారావు.

"మీ భార్యను కత్తితో హత్య చెయ్యవద్దు. రివాల్వర్‌తో చంపండి...." అన్నాడు వెంకన్న.

"నా దగ్గర రివాల్వర్ లేదే...." అన్నాడు సూర్యారావు.

"నా రివాల్వర్ ఇస్తాను...." అన్నాడు వెంకన్న.

"మీ రివాల్వర్ ఇస్తారా?" ఆశ్చర్యంగా అన్నాడు సూర్యారావు.

"అవును. అందువల్ల రెండు ప్రయోజనాలు. హత్యా యుధానికీ మీకూ ఏవిధమైన సంబంధమూ వుండదు. ఆమె వద్దకు నా రివాల్వర్ ఎలా చేరిందో నేను కథ అల్లు

తాను. నాకు మీరు పారితోషికంగా పదివేలిస్తే చాలు. ఈ హత్య జరిగే విధంగానూ, మీరు హంతకుడు కాకుండా ఉండేవిధంగానూ చక్కని పథకం తయారుచేస్తాను. సాధారణంగా నాకిలాంటి పనులిష్టముండదు. కానీ మీ కథ స్వయంగా చూశాక మీకు సాయపడాలనిపించింది. మీ భార్య అందచందాల్లో ఆదర్శ మహిళ కావచ్చు. కానీ ఆమె నయవంచకి. అటువంటి వారెంతకైనా తగుదురు. అలాంటివారివల్ల మీకేకాదు ఈ సమాజానికే ప్రమాదం. ఈ రోజు రాత్రి పన్నెండు గంటలకు నేను మీ యింటికి వస్తాను. కాలింగ్ బెల్ ప్రయోగించను. మీరే సరిగ్గా ఆ టైముకు తెలుపులు తీసి వుంచాలి. నేను సరాసరి లోపలికి వస్తాను. రివాల్వర్ ఇస్తాను. అప్పుడు మీరామెను లేపి రివాల్వర్‌తో బెదిరించి—మీరెందుకు ఆమెను చంపబోతున్నారో వివరించి — సంజాయిషీ అడిగి-ఆ సంజాయిషీ సంతృప్తికరంగా లేకపోతే ఆమెను వెంటనే కాల్చి చంపేయండి. ఆ తర్వాత మీరు నా రివాల్వర్ నాకిచ్చేసి నాతో వచ్చేయండి. మీకు దుర్భేద్యమైన ఎలిబీ సృష్టిస్తాను. మీకు న్యాయస్థానం భయంలేకుండా చేస్తాను...." అన్నాడు వెంకన్న.

"వెంకన్నగారూ-ఇన్నాళ్ళకు మీరు నన్ను పూర్తిగా అర్థంచేసుకున్నారు. సరిగ్గా ఇదే నేను కోరుకున్నది. నా భార్యకు ఆమెచేసిన తప్పు చెప్పాలన్నది ఎన్నాళ్ళుగానో నేను కలగంటున్న కోరిక. కానీ ఒక పర్యాయం ఆమె ఎదుటపడి అంత మాటన్నాక ఆ తర్వాత ఆమెకు ఎదురు నిలవలేను. ఆమెతో మాట్లాడలేను. ఆమె ప్రవర్తనను తట్టుకోలేను. అందుకే ఆమె డైరీ చదివినా కూడా ఆమె నేమీ అనలేకపోతున్నాను. ఇప్పుడైతే చెప్పదలచినవన్నీ

చెప్పేక ఆమెను చంపేస్తాను. అందువల్ల నాకింక మళ్ళీ ఆమెను ఎదుటపడాలన్న బెంగ వుండదు...." అన్నాడు సూర్యారావు.

వెంకన్న నిట్టూర్చి—"మనం మళ్ళీ రాత్రి కలుసుకుందాం—" అన్నాడు.

## 11

"నమస్కారం—మనమిదివరలో ఒకసారి కలుసుకున్నాం—" అన్నాడు వెంకన్న.

"అవును. ఆతర్వాత మీరు డిటెక్టివ్ వెంకన్నగారని తెలిసింది. మీ పేరు వినడమేకానీ మిమ్మల్ని చూసే అదృష్టం కలిగిందని అప్పట్లో నాకు తెలియలేదు—" అంది జానకి.

వెంకన్న ఆశ్చర్యంగా—"నేను డిటెక్టివ్‌నని మీకెవరు చెప్పారు?" అడిగాడు.

ఆమె నవ్వి ఊరుకుంది.

"సరే—ఎలాగో మీరు తెలుసుకున్నారు. ఇప్పుడు నేను డిటెక్టివ్ గానే మిమ్మల్ని హెచ్చరించాలని వచ్చాను—"

"హెచ్చరికా?" అందామె ఆశ్చర్యంగా.

"అవును. మీ ప్రాణాలిప్పుడు ప్రమాదంలో ఉన్నాయి...."

"నా ప్రాణాలకు ప్రమాదమా? వాటిని భద్రంగా మావారు కాపాడుతూంటారు...." అంది జానకి తేలికగా నవ్వేస్తూ.

"మీవారే ఇప్పుడు మీ ప్రాణాలకు ప్రమాదం తలపెట్టారన్నది ఇప్పటి నా హెచ్చరిక!"

జానకి క్షణకాలం స్థాణువైపోయింది — "ఏమ

న్నారు?"

వెంకన్న మళ్ళీ చెప్పాడు.

"అందుకు ఋజువు వుందా?"

"నేనే అందుకు ఋజువు...."

"మీ ఋజువులు నేను నమ్మను...." అంది జానకి.

"ఈ హత్యకు అతడు సాయం కోరాడు. పదివేల రూపాయల ప్రతిఫలానికి నేను రాత్రి పన్నెండింటికి మీ యింటికివచ్చి అతడికి రివాల్వర్ ఇస్తాను. అతడు హత్య చేస్తాడు. అదీ పథకం. ఇప్పట్లో మీకేమైనా సందేహా లున్నా రాత్రి పన్నెండింటికి మీకింకే సందేహాలూ ఉండవు...." అన్నాడు వెంకన్న.

"ఇంతకూ డిటెక్టివ్ గా మీరుచేసే పనేమిటి? హంత కులకు హత్యల్లో సాయపడడమా?"

"అదే నిజమైతే ఇప్పుడు మిమ్మల్నెందుకు హెచ్చ రిస్తాను?" అన్నాడు వెంకన్న.

"అవును .. నిజమే! ఇంతకీ మీ భావమేమిటి?"

"మీ భర్త మిమ్మల్నెందుకు హత్య చేయాలనుకుం టున్నాడో తెలుసా?" అన్నాడు వెంకన్న.

"తెలియదు...." అంది జానకి.

వెంకన్న క్లుప్తంగా సూర్యారావు కథ చెప్పాడు.

"మై గాడ్! ఆయన మనసులో ఇన్ని ఆలోచన లుంటే మాటవరసకైనా ఒక్కసారి నాతో అనలేదు." అంది జానకి. ఆశ్చర్యం ఆమె కళ్ళల్లో స్పష్టంగా కనబడు తోంది.

"అదాయన మంచితనం అనుకోండి. మీమటుకు మీరు ఆయనతో నిజం దాచకుండా కిశోర్ తో పెళ్ళికి ముందు మీకున్న సంబంధం గురించి ముందుగానే చెప్పి

వుంటే ఆయన మీ తప్పు క్షమించి వుండేవాడు. అనవసరంగా ఆ రహస్యం దాచి మీరాయన్ని క్షోభ పెట్టి మీపట్ల మనసు విరిగిపోయేలా చేసుకున్నారు....” అన్నాడు వెంకన్న.

“నా ప్రవర్తనలో ఆయనకేమైనా తప్పు కనిపించిందా?” అంది జానకి.

“లేదు. అది వెతికి పట్టుకునేందుకు ఆయన నన్ను నియమించాడు. నేను శాయశక్తులా ప్రయత్నించి విఫలుణ్ణై విసిగిపోయి మిమ్మల్ని చంపేయమని సలహా కూడా ఇచ్చాను. అందుకోసం ఆయన ఉదయం నా దగ్గరకు కాలేజీ రోజుల్లో మీకు బహుమతిగా వచ్చిన కత్తి తీసుకుని వచ్చి చూపించాడు....” అంటూ వెంకన్న తను రివాల్వర్ ఇస్తానన్న ఉదంతం చెప్పాడు.

“అయితే యిప్పుడు నన్నేం చేయమంటారు?” అంది జానకి.

“చేసిన తప్పు ఒప్పుకుని ఆయన్ను క్షమాపణ వేడుకోండి....”

“తప్పు చేయలేదనే అనడానికి నేను సిద్ధపడితే....”

“ప్రాణాలు దక్కించుకోవడం కోసం ఎక్కడికైనా పారిపోండి—”

జానకి అదోలా నవ్వి—“మృత్యువు నిజంగా తరుముకుని వస్తూంటే మనిషి ఎక్కడని దాగుంటాడు? ఎక్కడ దాగున్నా మృత్యువు మనిషిని వదిలిపెడుతుందా?” అంది.

“నేను మిమ్మల్ని మృత్యువుబారినుండి రక్షించగలను. మీరు నాకు గత-చరిత్ర చెప్పాలి....” అన్నాడు వెంకన్న గంభీరంగా.

“నా గతచరిత్ర ఏమిటని మీ ఉద్దేశ్యం?”

"మీ గతచరిత్ర ఏమైనా అందులో కిశోర్ వున్నాడు...."

జానకి వెంకన్న వంక చురుగ్గా చూసి—"ఇది పూర్తిగా మా భార్యాభర్తలకు సంబంధించిన విషయం. ఇందులో ఇతరుల జోక్యం నేను సహించను. ప్రమాదం గురించి హెచ్చరించినందుకు మీకు నా ధన్యవాదాలు. ఇంక మీరు నన్నేమీ అడగొద్దు...." అంది.

# 12

అర్ధరాత్రి పన్నెండు గంటల సమయం....

వెంకన్న ఆ యింటి తలుపు తీశాడు. తీయగానే తలుపులు తెరుచుకున్నాయి. తలుపులు తెరుచుకోగానే హాల్లోంచి సోఫాలో కూర్చుని వున్న సూర్యారావు అతన్ని కలుసుకుని— "ఆమె నిద్రపోతోంది—" అన్నాడు.

వెంకన్న ఆశ్చర్యంగా—"ఆమె నిజంగా నిద్రపోతోందా?" అన్నాడు.

"ఏం — మీకా అనుమానమెందుకు వచ్చింది?" అన్నాడు సూర్యారావు ఆశ్చర్యంగా.

"మీ ప్రవర్తనలో ఎక్కడా రాత్రి జరగబోయే ఘోరం గురించి ఆమెకు సూచనలందలేదా? అసలే ఆమె ఎంతో తెలివైనది...." అన్నాడు వెంకన్న.

"ఎవరి తెలివికైనా పరిమితి ఉంటుంది...." అన్నాడు సూర్యారావు — "నేను తన్ను హత్యచేస్తానని ఆమె కలలో కూడా ఊహించదు...."

"ఈరోజామె ప్రవర్తన ఎలా ఉంది?" అనడిగాడు వెంకన్న.

"ఎలా అంటే?"

"తనకేవైనా హెచ్చరిక అందినట్లుగా ప్రవర్తించిందా?"

"హెచ్చరిక యెందుకు అందుతుంది? ఎవరు అందిస్తారు?"

"తెలివైనవారికి ఒకోసారి మానవాతీత శక్తులు సాయపడుతుంటాయి. దాన్ని ఇంట్యూషన్ అని అంటారు. ఆమెకు ఇంట్యూషన్ ఎక్కువని నాకు నమ్మకం—" అన్నాడు వెంకన్న.

"అలాంటిదేమీ లేదు. రోజూలాగే ఉందామె ప్రవర్తన!" అన్నాడు సూర్యారావు.

తన హెచ్చరిక వినకుండా ఆమె రోజూలా ఉండగలిగిందంటే ఆమె గుండెలుతీసిన బంటే అయుండాలి. ఇలాంటి మనిషి చచ్చినా సరే కిశోర్‌తో తనకున్న సంబంధం గురించి ఒప్పుకోదు. తన ఆఖరి అస్త్రం ఎలా పనిచేస్తుందో చూడాలి మరి! ఇప్పుడు సూర్యారావుకంటె ఎక్కువగా ఆమె గత చరిత్ర గురించి వెంకన్నకు కుతూహలంగా వుంది. తన తెలివితేటలు వృధా—.... ఆమె గురించిన రహస్యం విడదీయలేకపోతే!

"రివాల్వర్ తెచ్చారా?" ఆత్రుతగా అడిగాడు సూర్యారావు.

వెంకన్న రివాల్వర్ అతడికి అందించి-"వెళ్ళి ఆమెను నిద్రలేపి—మీ నాటకం ఆరంభించండి-...." అన్నాడు.

సూర్యారావు పడకగదిలోకి నడిచాడు. వెంకన్న గుమ్మం పక్కగా నిలబడ్డాడు.

మంచంమీద నిద్రపోతోంది జానకి! ఎంతో అందంగా అమాయకంగా వున్నదామె! స్వచ్ఛత నిండివున్నదామె ముఖంలో .... సూర్యారావామెను తట్టిలేపాడు. కళ్ళు

నులుముకుంటూ లేచిందామె.

"ఆమె నిజంగానే నిద్రపోయింది-" అని గ్రహించిన వెంకన్నకు కలిగిన ఆశ్చర్యమింతా అంతా కాదు.

"ఏమిటండీ —" అంది జానకి మత్తుగా.

"నా చేతిలో ఇదేమిటో చూశావా?" అన్నాడు సూర్యారావు కటువుగా.

జానకి ఉలిక్కిపడి—"రివాల్వర్ —ఇదెందుకు మీకు?" అనడిగింది.

"ఎందుకా — నిన్ను చంపడానికి...." అన్నాడు సూర్యారావు.

"నన్ను చంపుతారా—ఎందుకు?" అంది జానకి.

"కిశోర్ కీ నీకూ వున్న గత చరిత్ర నాకు చెప్పకుండా దాచినందుకు...." అన్నాడు సూర్యారావు.

"దాచకుండా చెబితే ఏంచేసేవారు?"

"నిన్ను క్షమించి ఉండేవాణ్ని ..."

"అలా క్షమించే భర్తంటే నాకు అసహ్యం. అందుకే నేను మీకది చెప్పలేదు—" అంది జానకి.

"ఎందుకని?" అన్నాడు సూర్యారావు. ఆమె అలా అంటుందని అతడూహించినట్లు లేదు.

"భార్య ఏదో తప్పుచేసిందనీ — ఆ తప్పు దాచి పెట్టిందనీ తెలిసిన భర్త—ఆ తప్పు ఆమెచేత ఒప్పించి అప్పుడామెకు క్షమాభిక్ష పెట్టాలనుకుంటే-అంతకంటే చచ్చు మగాడుండడు...." అంది జానకి.

"మరేం చేయాలి?" అన్నాడు సూర్యారావు దిగులుగా. అతని ధైర్యం అడుగంటింది.

"దమ్ములుంటే భార్యను నిలదీసి అడగాలి. లేదా ఆమెను చంపేయాలి...."

"చంపేయాలా?" ఆశ్చర్యంగా, భయంగా అడిగాడు సూర్యారావు.

"అంతే—కిశోర్ అయితే అదే పని చేసివుండే వాడు...."

సూర్యారావు రక్తం మరిగింది—"సిద్ధంగా ఉండు. నేనూ అదేపని చేయబోతున్నాను...."

"నేను కోరుకున్నది కూడా ఇదే—వెంటనే ట్రిగ్గర్ నొక్కండి—" అంది జానకి.

"నువ్వు .... నన్ను చంపమని అడుగుతున్నావా?" అన్నాడు సూర్యారావు.

"అవును—మన పెళ్ళయ్యాక మీరు చేతకానివాళ్ళని ఇంట్లో అంతా చెప్పుకునేవారు. అది నిజంకాదని కనీసం నా మనసుకు తెలిసినా బాగుండుననిపించింది. మిమ్మల్ని కిశోర్ అని పిలుస్తానన్నాను. మీరు ఒక్కసారి కూడా ఏమిటా పేరు, అందుక్కారణమేమిటి—అని అడగలేదు. కొంత కాలంనుండి అతడి పేరు నిద్రలో కలవరించాను. అప్పుడూ మీరు నన్ను కిశోర్ గురించి అడగలేదు. ఆఖరికి మీకోసం డైరీ రాయనారంభించాను. అందులో కిశోర్ గురించి రాసుకునేదాన్ని. అది చదివి కూడా మీరావేశపడలేదు. అంటే నా సమర్థత నుపయోగించు కుంటూ అనామకుడిగా బ్రతకడానికే సిద్ధపడ్డారు మీరని నా నకరమైంది. అందుకు నాకెంతో బాధ కలిగింది. కిశోర్‌కూ నాకూ ఏ సంబంధంలేదు. ఆ కిశోర్ ఎవడో తెలుసుకుని వాడికంటే ఉన్నత స్థానానికి వెళ్ళాలని మీరనుకుంటారని ఆశించాను. జీవితంలో కష్టపడి ఏమైనా సాధించవచ్చునని నిరూపించిన కిశోర్ మీలో అసూయను లేపి—మీ మగతనాన్నీ, పురుషాహంకారాన్నీ రెచ్చగొట్టి

మిమ్మల్నొక సమర్థుడైన మగవాడుగా తయారుచేస్తాడని ఆశించాను. అది జరిగినా జరక్కపోయినా ఆఖరికి మీరు నన్ను చంపాలనుకునే పౌరుషమైనా సంపాదించారు. అందుకే నాకెంతో సంతోషంగా వుంది. మీలో ఈ పౌరుషాన్నే నేను కోరుకునేది. చంపండి — నేను సిద్ధమే!" అంది జానకి.

సూర్యారావు తెల్లబోయి-"నువ్వు రాసిన డైరీ కూడా అబద్ధమా?" అన్నాడు.

"అది డూప్లికేట్ డైరీ అని నేనీ క్షణామే రుజువు చేయగలను. అసలు డైరీ మీకు కనబడకుండా నేనే ఉంచుకుంటున్నాను..." అంది జానకి.

"జానకీ— నేను నీకు తగను. నువ్వు నన్ను బాగు చేయాలని ప్రయత్నిస్తూంటే నేను తప్పుదారిలోనే నడుస్తున్నాను. నేను జీవించతగను...." అంటూ సూర్యారావు చటుక్కున తన్ను తనే పేల్చుకుని నిలువునా కూలబడ్డాడు.

జానకి ఒక్క ఉదుటున్న మంచం దూకి-"ఏమండీ-" అంటూ సూర్యారావును సమీపించింది. అదే క్షణంలో వెంకన్న కూడా గదిలో ప్రవేశించి—"భయపడకండి జానకిగారూ! ఆ రివాల్వర్‌లో గుళ్ళు ప్రాణాలు తీయవు. మనిషికి స్పృహతప్పిస్తాయి. అంతే!" అని—"మిమ్మల్ని మా సేవరకూ నా తెలివితక్కువతనం అర్థంకాలేదు. ఎంతో తెలివిగా మీ గతచరిత్ర కప్పిపెడుతున్నారనే భావించాను గానీ—అంత తెలివైన మీరు మీ డైరీని మీ భర్త కళ్ళబడకుండా ఎందుకు దాచలేమా అని ఆలోచించలేక పోయాను...." అన్నాడు.

"ఆయనకు ఎప్పుడు స్పృహ వస్తుంది!" అంది జానకి బేలగా.

"కొద్ది నిముషాల్లో వస్తుంది. స్పృహ వచ్చేక అతడు పునర్జన్మ ఎత్తినట్లేనని భావిస్తున్నాను...." అంటూ వెంకన్న తన రివాల్వర్ తీసుకుని అక్కణ్ణించి వెళ్ళిపోయాడు.

—:ఐ పో యిం ది:—

# నీటి మునిగిన మనిషి!

## సికిందర్

"నో, మైడియర్ యంగ్ లేడీ!" లాల్ అన్నాడు విసిగిపోయి, అప్పటికి మూడోసారి, ఈసారి కాస్త తీవ్రంగా. "మీ కెన్నిసార్లు చెప్పాలి? బయటి కేసులు మేం తీసుకోవడంలేదు! అంతటి తీరికా ఆసక్తీ మాకు లేవు! ఇక్కడ క్షణం తీరిక లేని కేసులున్నాయి. దయచేసి నన్నింక విసిగించకండి! మీ కేసు ఎట్టి పరిస్థితిలోనూ మేము తీసుకోలేం!"

ఆమె గాయపడ్డ అభిమానంతో చూసింది. "మీ ఏజెన్సీ గురించి నేను విన్నదంతా నిజంకాదని తెలుస్తోం దిప్పుడు!" అందామె అక్కసుగా.

లాల్ తలూపాడు అంగీకారంగా. "అవును, మా ఏజెన్సీ గురించి మీరు వినేదంతా నిజంకాదని నేను చెప్తున్నాను. అండర్ లైన్ చేసుకోండి.

"మా గురించి ఏవో అతిశయోక్తులు విని, లేనిపోని అభిమానాలు కల్పించుకుని వస్తారు. తీరా ఇక్కడ మా

ప్రవర్తన చూసి గాయపడిపోతారు. మా కోసం వచ్చే వారందర్నీ సాదారంగా ఆహ్వానించి అతిథి మర్యాదలు చేసే ఓపిక మాకిప్పుడు లేదు!"

"అతిథి మర్యాదలెవరిక్కావాలి? నాకు మీ సహాయం కావాలి!"

"మళ్ళీ మొదటికే వస్తున్నారు, అది కుదరదని చెప్పాను."

"లుక్ హియర్, మాడమ్" జాన్ కల్పించుకున్నాడప్పుడు, "అతనితో మనకేమిటి? మీరూ నేనూ ఒకటి! ఏమంటారు? మీరతన్ని పట్టించుకోకండి. ఈ మధ్య ఇట్టే నెర్వస్ అవుతున్నాడు. కారణం అడక్కండి! అతని ముందు చెప్పను. బయటి కేసు లెందుకు తీసుకోదూ? మీ కేసు తీసుకోడానికి నేను సంసిద్ధత తెలియజేస్తున్నాను—"

"సంసిద్ధత తెలియజేయడమంటే, యూ ఫూల్, పిల్లాడ్ని దత్తత తీసుకోవడమనుకున్నావా?" అరిచాడు లాల్, "నువ్వు ఏజెన్సీ లక్ష్యాన్ని విస్మరిస్తున్నావు. అగ్రిమెంట్ నియమాల్ని ఉల్లంఘిస్తున్నావు. ఐ విల్ కిక్ యూ టు డెత్!"

జాన్ నవ్వేశాడు తేలిగ్గా, "పార్ట్నర్, అగ్రిమెంట్ వేరు; ఆచరణ వేరు. అగ్రిమెంట్ కాయితాలపైన అలంకార ప్రాయంగా అలా వుంటుంది. ఆచరణ పరిస్థితుల ప్రాబల్యం మీద ఆధారపడి వుంటుంది— ఏమంటారు, మాడమ్?"

"అసలు కేసేమిటో తెలుసుకోకుండా నే ఎలా ఒప్పుకుంటావ్?"

"అంతే కదా? ఓ.కే., మాడమ్! ఇప్పుడు అడ్డు ఏమీ లేదు, అనుగ్రహించాడు. మీరిక చెప్పుకుపోండి.... చెప్పేయండి త్వరగా!"

"మా మామగారు—భూపతిరావుగారు—నెల రోజుల క్రితం కాలం చేశారు—ఆకస్మికంగా. కాలం చేశాక ఆయన పెద్ద కుమారుడు — అంటే నా మరిదిగారు — తన తమ్ముణ్ణి — అంటే మావార్ని — మానసిక రోగిగా భుజించి—సారీ—విభజించి—కాదు కాదు—భావించి-విజయవాడాలోని శాంతా నర్సింగ్ డామ్‌లో—ఓహ్, హోమ్‌లో చేర్పించారు! కాదు నిర్బంధించారు! నిజానికి మావారు తండ్రిపోయిన దుఃఖంనుంచి మర్నాడే కోలుకున్నారు. కానీ ఆయన అన్నగారు మరో ఉద్దేశ్యంతో అలా బుద్ధిపూర్వకంగా నర్సింగ్ హోమ్‌లో నిర్బంధిస్తున్నారు. అక్కడి డాక్టర్ ఆయన చెప్పుచేతల్లోనే వున్నాడు. మా వారికి మతి వక్రించిందని-భ్రమించిందని ధృవీకరిస్తున్నాడు — బుకాయిస్తున్నాడు. మా వార్ని చూస్తే అలా ఏమీ కనిపించరు. వీళ్ళ ధోరణి చూస్తోంటే ఆయన్నలాగే శాశ్వతంగా దిగ్బంధం చేసి — నిర్బంధం చేసి—"

"ఆపండి! ఆపండక్కడ!" అరిచాడు లాల్, "ఏమిటది? క్రికెట్ కామెంటరీయా? చేతబడి మంత్రాలా?"

"క్షమించండి— నేను— నేను—"

"మీరు సహాయం కోసం వచ్చారు. నేను మనసు కరిగి ఇలా ఒప్పుకున్నాను.... ఖర్మకొద్దీ! ఎందుకలా తొందర పడ్డారు? ముందు ప్రశాంతంగా కూర్చోండి. నిదానంగా, వివరంగా చెప్పండి. స్పష్టత ముఖ్యం. మీదే పూర

న్నారూ?"

"శ్రీనగర్."

"శ్రీనగర్? అంటే—"

"కాదు, కాదు! కాశ్మీర్ దగ్గర కాదు, విజయవాడ దగ్గర! పూర్తి పేరు శ్రీనివాస నగర్. కాని పొడుగ్గా వుందని తగ్గించేశారు సంస్కర్తలు."

"మీ ఊళ్ళో సంస్కర్తలున్నారా?" అడిగాడు జాన్.

"ఉన్నారు—ఒకటో రకం నాస్తికులు!"

"విజయవాడకు ఎంత దూరం?" లాల్ అడిగాడు.

"పద్దెనిమిది కిలోమీటర్లు, ఉయ్యూరు రూట్లో."

"సౌకర్యాలేమిటి?"

"రైల్వేస్టేషన్, బస్ స్టేషన్లున్నాయి. మంచి హోటల్సూ, థియేటర్లూ వున్నాయి. ఊరి బయట చెరువు—"

"జనాభా ఎంత?"

"ఇరవై వేలుండొచ్చు."

"అందులో నాస్తికులు, మేడమ్?" జాన్ ప్రశ్నించాడు.

"ఓటర్ల జాబితా చూడాలి."

"అందులో నాస్తికుల వివరాలుండవు!" లాల్ కోపంగా జాన్ వైపు తిరిగాడు, "నువ్వు కాస్సేపు నోర్మూసుకొని అలా కూర్చో—

"లుక్ మేడమ్, మేం బయటి కేసులెప్పుడూ తీసుకో లేదు. ఎప్పుడో మూడేళ్ళ క్రితమనుకుంటాను—ఒకసారి కొవ్వూరు వెళ్ళాం—శివరంజని కేసులో. మీకు తెలిసే వుంటుంది, అప్పుడు అది చాలా సంచలనం కల్గించిన

కేసు. మోసపు పేరూ తెచ్చింది....

"ఇప్పుడు మీ కేసు చూస్తే, మిసెస్ సరళ, మీరనవసరంగా శ్రమ తీసుకొని ఇంత దూరం వచ్చారనిపిస్తోంది. మీ మరిదిగారు మీవార్ని అక్రమంగా నిర్బంధించి ఆస్తికి పూర్తి గార్డియన్‌షిప్ కోసం ప్రయత్నిస్తున్నారంటే, మీరు గమనించారో లేదో, అది పూర్తిగా లీగల్ వ్యవహారమవుతుంది."

ఆమె కళ్ళు తిప్పుతూ ఆశ్చర్యంగా చూసింది.

"పొరపాటా?" అన్నాడు లాల్.

"కాదు, మీరెలా పసిగట్టారు నా అనుమానం?"

"ఏ అనుమానం సరళ?"

"ఆయన ఆస్తికి అధిపత్యం కోసం ప్రయత్నిస్తున్నాడని?"

లాల్ నవ్వాడు, "మీరెంత గజిబిజిగా మాట్లాడినా, సరిగ్గా అవసరమనుకున్న పాయింట్స్‌ని అందులో ఇరికించి వదిలారు."

ఆమె కూడా నవ్వింది మెచ్చుకోలుగా.

జాన్ నోర్మూసుకుని అలాగే కూర్చున్నాడు.

"కానీ లాల్‌గారూ," అందామె మళ్ళీ, "నేనీ లీగల్—ఆస్తి వ్యవహారం గురించి ఇక్కడికి రాలేదు."

"మరి?"

"నాకు మరో విషయంలో అనుమానాలున్నాయి."

"ఏ విషయంలో?"

"మామగారి చావు విషయంలో."

"వెల్, వెల్, ఏమిటివి?"

సరళ—అంది. "మామయ్యగారిది సహజ మరణం కాదు, ప్రమాదం పాలయ్యారు. నీటిలో మునిగి ప్రాణాలు

కోలో పోయారు."

"నీటిలో-నా?"

ఆమె తలూపింది, "అవును, చెరువులో పడిపోయారు రాత్రివేళ. ఉదయంవరకూ ఎవరూ చూడలేదు. పదిన్నరకు చెరువు మధ్యలో తేలింది—ఆయన దేహం. జనం చూసి గగ్గోలు లేపారు. క్షణాల్లో వూరంతా ప్రాకిపోయిందా వార్త. మేమక్కడికి వెళ్ళేసరికి పోలీసులు శవాన్ని తీయిస్తున్నారు. ఆయన బాగా ఉబ్బిపోయివున్నారు. కడుపులో బాగా నీరు చేరింది. సాధ్యమైనంతవరకు నీరు తీసి నేలమీద పడుకోబెట్టారు. కానీ, పోలీసులు శవాన్ని హాస్పిటల్‌కి తరలించి పోస్టుమార్టమ్ జరిపించలేదు. రచ్చబండ దగ్గర పంచాయితీలా, అక్కడే వేపచెట్టుకింద ఏదో పంచనామా అయిందనిపించుకున్నారు, లాంఛనాని కన్నట్టు."

"ప్రొసీడ్!"

"అప్పుడు ఈ పోలీసులూ, డాక్టరూ, మా మరిది గారూ, ఏదో కుట్రదారులుగానే కన్పించారు. చాలా వింతగా ప్రవర్తించారు. ఎవరినీ దగ్గరికి రానివ్వలేదు. ఎవరిమాటా వినిపించుకోలేదు. అక్కడ్నుంచి శవాన్ని ఇంటికి తెచ్చిపట్టుమని పదిగంటలుంచలేదు. బంధువులు వచ్చేవరకూ ఆగలేదు. మరిదిగారిది ఒకటే తొందర— అంతా చప్పున ముగిసిపోవాలని. వెంటనే అంత్యక్రియలకు సన్నాహాలు ప్రారంభించారు. ఆయన కంటే మరీ తొందర రాజేశ్వరిది—నా తోడికోడలు. ఆమె అసలు కంట తడిపెట్టగా నేను చూడలేదు.

"ఇక అప్పుడు మావారి సంగతి చెప్పనే అక్కర్లేదు! ఆయనకు తండ్రి అంటే అమితమైన ప్రేమ. అనుక్షణం

ఇంటా బయటా అంటిపెట్టుకునుండేవారు. ఎక్కువ శ్రమా అలసటా కలగకుండా కనిపెట్టుకునేవారు. ఒక్క రోజు ఊరు వదలి వెళ్తే చాలు, వచ్చేవరకూ తేసిపోని బెంగిలు పెట్టుకుని దిగులు పడేవారు. అటువంటి తండ్రిని ఇప్పుడు శాశ్వతంగా పోగొట్టుకున్నానన్న షాక్‌తో అయిన ఉన్మాదిలా ప్రవర్తించారు ఆ రోజు. పసిపిల్ల వాడిలా ఏడ్చారు. నానా భీభత్సం సృష్టించారు. శవం మీదపడి ఆయన్నలాగే వుంచేసుకుంటాననీ, తీసికెళ్ళి తనకు దూరం చెయ్యొద్దనీ అరుస్తూ సమీపంలో అందర్నీ తరిమేయసాగారు. విపరీతంగా ప్రవర్తించారు. కొందర్ని గాయపర్చారు కూడా. ఈ గొడవంతా చూసి రాజేశ్వరి డాక్టర్ని పిల్చింది."

"చెప్పండి."

"అతను మా ఫ్యామిలీ డాక్టర్. అతను వచ్చి మా వార్ని పనివాడి సాయంతో బలవంతంగా మేడమీన గదిలోకి లాక్కెళ్ళి, ఇంజెక్షన్ ఇచ్చి పడుకోబెట్టాడు. బయటనుంచి తలుపు గొళ్ళెం పెట్టాడు. అంతే, అలా సాయంత్రం వరకూ ఆయన నిద్రలోనే వున్నారు. ఈలోపు అంతా ముగిసిపోయింది, శవాన్ని తీసుకెళ్ళిపోయారు. ఇల్లు మూగబోయింది, చీకటి పడే వేళకి."

"అప్పుడు?"

"అప్పుడు — ఎనిమిది గంటలకి మావారు మేలుకొన్నారు. నేను కాఫీ పట్టుకెళ్ళాను. నన్ను చూస్తూనే ఆయన ఉగ్రుడయ్యారు. ఒక్క ఉదుటున వచ్చి గ్లాసు లాక్కున్నారు. దాన్ని నేలమీదికి విసిరికొట్టి పెద్దగా అరిచారు. "నువ్వు మంచిదానివికాదు! నువ్వూ వాళ్ళతో చేరావు! నాన్నని తీసుకెళ్ళనిచ్చావు! నానుంచి దూరం

చేశావు! నువ్వు నాకొద్దు ద్రోహీ, వెళ్ళిపో!" అంటూ.... ఈ అరుపులు విని రాజేశ్వరి వచ్చింది. ఆమెని చూసి ఆయన రెచ్చిపోయారు. అసలే మొదటినుంచీ అయిష్టం. ఆమె జడపట్టుకుని వీపుమీద బాదారు. ఇంతలో అన్న గారొచ్చి విడిపించడంతో ఆమె పరుగున వెళ్ళి డాక్టర్ని పిల్చింది. ఆయన అన్నగారినీ కొట్టారు. గాయపరిచారు. కరిచారు. వాళ్ళిద్దరు కలిసి ఆయన్ని కట్టేశారు. అంతలో డాక్టర్ వచ్చి మరో ఇంజెక్షన్ ఇవ్వడంతో అంతా ముగిసింది."

"తర్వాత?"

"తర్వాత మరిదిగారూ, ఆయన భార్యా, డాక్టర్తో వేరే గదిలో చాలా రాత్రివరకు మాట్లాడుకున్నారు. నన్ను రానివ్వలేదు. తగ్గు స్వరంతో మాట్లాడుకున్నారు. నేనా రాత్రి ఏడుస్తూ నిద్రపోలేదు. అప్పుడు తెల్ల వారాక వాళ్ళు హడావుడి చేశారు. విజయవాడనుంచి టాక్సీని రప్పించారు. అందులో మావార్ని ఎక్కించి, నన్నూ ఎక్కమన్నారు. మావారప్పుడు గొడవ చెయ్యలేదు. అభ్యంతర పెట్టలేదు. మౌనంగా ఎక్కి కూర్చున్నారు. ఆయనలో కొత్త మార్పు కనిపించింది. నీరసంగా. నిర్వి చారంగా, శూన్యంలోకి చూస్తూ కూర్చున్నారు. చెప్పిందల్లా విన్నారు. ఆయన్ను తీసుకెళ్ళి అన్నగారు విజయవాడలోని శాంతా నర్సింగ్ హోమ్లో చేర్పించారు.

"అక్కడ నేనంతా మౌనంగా గమనించాను. అక్కడ డాక్టర్తో మరిదిగారు ఏమేం మాట్లాడారో నాకు తెలీదు. తర్వాత నా దగ్గరకొచ్చి చెప్పారు, తమ్ముడ్ని అక్కడే కొన్నాళ్ళు వుంచి ట్రీట్మెంట్ ఇప్పించాలని. ఆయనకు మెంటల్ షాక్ అట, నన్నక్కడే వుండి చూసు

కోమన్నారు. ఆ వూళ్ళోనే ఆయన స్నేహితుని ఇంట్లో నాకు వసతి ఏర్పాటుచేసి వెళ్ళిపోయారు."

"చెప్పండి."

"ఈ నెలరోజులు నేనక్కడే వున్నాను ఆయన్ను కనిపెట్టుకొని. ఆయన తొందరగానే కోలుకున్నారు, పదిరోజుల్లో. తిరిగి ఎప్పటిలా మామూలుగా కన్పించారు. శాంతంగా మాట్లాడసాగారు. ఇందుకు నేను సంతోషించాను. ఒకసారి నాతో అన్నారు. 'సరళా, రాత్రి నాన్నగారు నాకు కలలో కన్పించారు. కన్పించి ధైర్యం చెప్పారు. నువ్వు బాధపడకు బాబూ, ఏడవకు. నేను దూరం కాలేదు. నీముందే వున్నాను. నువ్వు తలుచుకున్నప్పుడల్లా కనిపిస్తానన్నారు! నేనిక ఎప్పుడూ బాధపడను. ఇలా ఏడుస్తూ కూర్చోను. నడుం బిగిస్తాను. ఈయన పేరుమీద మంచి కార్యాలు చేస్తాను....' ఈ మాటలు వింటూ నేనెంత ఆనందించానో మీకు చెప్పలేను!"

"అయితే వాళ్ళేమన్నారు?"

"అదే చెప్పబోతున్నాను. ఆయనకు పూర్తి మానసిక స్వస్థత చేకూరింది. అది ఆయనకు తెలుసు. కానీ వాళ్ళు ఒప్పుకోలేదు. మరి కొన్ని రోజులు అక్కడే వుంచి చూడాలన్నాడు డాక్టర్. వివిధ పరిస్థితుల్లో, సమయాల్లో ప్రవర్తన గమనించాలన్నాడు. అన్నగారూ అలాగే అన్నారు. అలా ఇరవైరోజులు గడిచాయి. అప్పుడు ఒకరోజు మరిదిగారు నా దగ్గరకొచ్చి కొత్త విషయం లేవనెత్తారు....ఆస్తి పంపకం గురించి."

"అప్పుడే?"

"అప్పుడే ఏమిటి, మామయ్య పోయిన రాత్రే వాళ్లు

సమాలోచనసలు జరిపారు! మరిదిగారికి కొంచెం కూడా మానవత్వంలేదు. తండ్రిపట్ల భక్తిశ్రద్ధలసలు లేవు. ఆయన భార్య సరేసరి! వఠి డబ్బు మనిషి. దురదృష్టం కొద్దీ మామగారు వీలునామా వ్రాయలేదు. ఉన్న ఆ స్తిని అన్నదమ్ములిద్దరూ చెరిసగం పంచుకుంటామని మరిదిగారన్నారు. ఇల్లూమిల్లూ తాముంచుకుని, ట్రక్కూ కొబ్బరి తోటా మాకిస్తామన్నారు. నాకు మాట పెగల్లేదు. అప్పుడే పంపకాలెందుకన్నాను. అసలు పంపకాలెందుకు, అంతా ఉమ్మడిగా ఎప్పటిలాగే ఉందామన్నాను. కానీ అదిప్పుడు ఆయన భార్యగారికి ఇష్టంలేదట. వెంటనే పంపకాలు అయిపోవాలని చెప్పించిదట. ఆమె మాట ఆయన జవదాటడట. ఆమె పట్టుదల నాకు తెలుసు—

"మామగారున్న రోజుల్లోనే ఆమె నన్ను వేధించేది. ఏ పనీ చెయ్యకుండా అంతా నామీదే వేసేది. సాయంత్రాలు చక్కగా ముస్తాబై ఎక్కడికో షికారుకి వెళ్ళేది. బాగా చీకటిపడ్డాక తిరిగివచ్చేది. అలాటి మనిషితో నేనిక వేగలేనన్పించింది .... పంపకం జరిగి పోవడమే మంచిదన్పించింది. కానీ ఆ ఇల్లు నా కొదల బుద్ధి కాలేదు. నేనా ఇంట్లో కేవలం ఏడాదిపాటేవున్నా, కొన్నేళ్ళ అనుబంధమేదో ఉన్నట్లు ఫీలయ్యేదాన్ని.... ఒక్క రాజేశ్వరిని మినహాయిస్తే ఆ ఇల్లు నాకు స్వర్గం వంటిది, లాల్ గారూ. అందులో తిరుగుతోంటే నాకో విధమైన గర్వంగా ఉండేది....

"అలువంటి ఇంటిని వదిలి వెళ్ళడం నాకు మనస్కరించలేదు. ఈ విషయమే ఆయనతో అన్నాను. ఇల్లూ తోటా మా కొదలేసి, మిల్లూ ట్రక్కూ మీరు తీసుకోండని. వీలుకాదన్నారు. అయితే పంపకం జరగ

దన్నాను. ఆయన కోపం తెచ్చుకున్నారు. ఈ విషయం మావారి వరకూ వెళ్ళింది. ఆయనసలు పంపకం వీల్లేదన్నారు. అదంటూ జరిగితే నాన్నగారి ఆత్మ శాంతించక పరితపిస్తుందన్నారు. కోపంతో చాలా అరిచారు. అంతా కలిసి ఎప్పటిలాగే ఉండాలని వాదించారు. ఈ విషయం ఇలాగే వారంరోజులు నానింది.

"చివరకి ఓ రోజున మరిదిగారు నా దగ్గరకు వచ్చి అన్నారు బెదిరిస్తూ. "చూడు సరళా, మీరు తెలివిగల వాళ్ళమనుకుంటున్నారా? మీరనుకొంటున్నది కలలో కూడా జరిగేది కాదు! బుద్ధిగా చెప్పినట్లు వినండి. లేకపోతే సుధీర్‌కు మతి భ్రమించిందని డాక్టర్ చేత సర్టిఫికేట్ తీసుకుని కోర్టులో వేస్తాను. అప్పుడు ఆ సీగీ స్త్రీ ఏమీ ఉండదు, తెలుసా? అంతా నా అధీనంలోనే ఉంటుంది, నేను గార్డియన్‌ని అవుతాను. అర్థమవుతోందా?....ఇలాగే బెదిరించారు."

లాల్ నవ్వాడు. అతన్ని చూసి జాన్ కూడా నవ్వాడు. ఆమె కలవరంగా చూసింది. "ఎందుకు నవ్వుతారు?"

"ఏమీ లేదు, మీరు చెప్పండి" అన్నాడు లాల్.

ఆమె తిరిగి అంది, "ఈ హెచ్చరిక నన్ను భయపెట్టింది. నిజంగానే అలా జరుగుతుందేమో? అందుకే మావార్ని అలా నిర్బంధిస్తున్నారేమో? ఆ నర్సింగ్ హోం డాక్టర్ కూడా వాళ్ళతో చేతులు కలిపాడు. సందేహం లేదు. వాళ్ళు ఎంతకైనా తెగించగలరు. ఈ విషయం నేను మావారితో చెప్పలేదు. ఆయన్నింకా ఉద్రేకపర్చడం నాకిష్టంలేదు. దీన్ని—ఈ సవాలుని— నేను స్వయంగా ఎదుర్కోవాలనుకున్నాను. ఎట్టి పరిస్థితిలోనూ వాళ్ళకి లొంగకూడదనుకున్నాను. ఎదుర్కొనే మార్గాలు

ఆలోచించసాగాను. వాళ్ళు నా ఆలోచనలు పసిగట్టారేమో, నేను మావాళ్ళ్ని తీసుకువెళ్ళిపోకుండా కట్టుదిట్టాలు చేశారు. మావారు అక్కడ్నుంచి తప్పించుకున్న పక్షంలో వెంటనే పోలీసులకు రిపోర్టువెళ్తుందనీ, ఒక ఉన్మాది ప్రజలమధ్య స్వేచ్ఛగా సంచరించడం చట్టం సమ్మతించదనీ, అదుపులోకి తీసుకొని నట్‌హౌస్‌కి పంపి అక్కడ శాశ్వతంగా ఉంచేస్తారనీ మరో హెచ్చరిక చేశారు."

"ప్రొసీడ్!"

"అసలు నాకు మావార్ని తప్పించాలన్న ఆలోచన లేదు. నా ఆలోచనలు వేరే విషయంపై లగ్నమై ఉన్నాయి....నన్ను గతంలోకి లాగుతున్నాయి.... నేను ఏదో ఒక అతి ముఖ్యమైన విషయాన్ని విస్మరిస్తూ వచ్చాననని శంకించడం ప్రారంభమైంది. ఆ రోజంతా కూర్చుని బాగా ఆలోచించాను. అప్పుడు దాన్ని కనుక్కున్నాను!"

"వెల్, ఏమిటది?"

"మామయ్య చావు గురించి ...ఆ రాత్రి నే నేదో గమనించినట్లు గుర్తు. అసలు ఆయన చెరువులో ఎలా పడిపోయారో మీకు నేను చెప్పనేలేదుకదూ?"

"చెప్పలేదు. ఎలా పడిపోయారు?"

"ఆ రాత్రి ఆయన స్లీప్ వాకింగ్ చేశాడు. ఆయన స్లీప్ వాకర్ అని అంతకుముందు నెలనుంచి పుకారు వుంది."

"పుకారా? అంటే నిర్ధారణకాలేదా?"

"నిర్ధారణ అయింది. మేం విశ్వసించేవాళ్ళే అన్నారు. కానీ మా ఇంట్లో ఎవరూ చూడలేదు, మొదటిసారి

రెండు నెలల క్రిందట ఆయన రాత్రి ఒంటిగంటకి, ఒంటి మీద కేవలం బనియను లుంగీలో; కాళ్ళకి చెప్పులేకుండా నడిచి వెళ్తోంటే మెయిన్ రోడ్ మీద చాలామంది చూసి పలకరించారట, కంగారుపడి. ఆయన్నా స్థితిలో చూస్తామని ఎవరూ వూహించి వుండరు. పలకరిస్తే మాట్లాడకుండా, వాళ్ళవైపు చూడకుండా, సూటిగా నడుచుకుంటూ వెళ్ళిపోయారట. వీళ్ళకేమీ అంతుబట్టక అలాగే చూస్తూండిపోయారట. బహుశ మనసు బాగాలేక అలా షైరుకి బయల్దేరారని తర్వాత సర్ది చెప్పుకున్నారట.

“ఈ సంగతి చాలా రోజులవరకు ఇంట్లో మాకెవరికీ తెలీదు, తర్వాత పదిహేను రోజులకి తిరిగి ఆయన అలా చేసేవరట. అయితే ఈసారి రోడ్డుమీద నడిచివెళ్ళలేదు. ఇంటి వెనుక పెరటి గోడ ఎక్కి కూర్చున్నారట.... అప్పుడే సినిమానించి వస్తోన్న వెనుక వీధిలోని భీముడు అది చూసి దొంగనుకుని అరిచాడట. కానీ ఎంతకీ కదలిక లేకపోవడంతో, దగ్గరికెళ్ళి గుర్తుపట్టి, పారిపోయి ఇంట్లో తలుపేసుకున్నాడట. ఈ సంగతి ఉదయం మాతో భయపడుతూ రహస్యంగా చెప్పాడు. అప్పుడే మాకు ఆయన ఆరోగ్యం తెలిసింది. నాకెంతో ఆందోళన కల్గింది ఆయన పరిస్థితికి. రాజేశ్వరి వెంటనే డాక్టర్ని పిల్చింది—”

“ఈ డాక్టర్ ఎవరు?” అన్నాడు లాల్.

“డాక్టర్ జనార్దన్. అక్కడి సివిల్ డాక్టర్, మా ఫ్యామిలీ డాక్టర్ కూడా. ముప్పైఅయిదేళ్ళుంటాయి, బ్రహ్మచారి. అతన్ని గురించి కథలున్నాయి.”

“చరితార్థుడు—కథలుగలవాళ్ళు చరితార్థులు.”

ఖాన్ నోరుతెరచి అన్నాడు. తిరిగి మూసుకున్నాడు.

ఆమె నవ్వుకుంటూ అంది, "ఈ డాక్టర్ మామయ్యని పరీక్షించి మానసిక రోగి అన్నాడు. స్లీప్ వాకర్ అని ధృవపర్చాడు. కానీ మామయ్య అంగీకరించలేదు. తనకే అనారోగ్యం లేదన్నారు. తాను స్లీప్ వాకింగ్ చేయడం అబద్ధమని ఖండించారు. మరి ఊరంతా చెప్పేది నే మాకేమిటి? వాళ్ళు ఆ అబద్ధాలు సృష్టిస్తున్నారా? ఆయన్ను అపఖ్యాతిపాలు చేస్తున్నారా? అది అసంభవం, వూళ్ళో అందరికీ ఆయనంటే భక్తీ గౌరవమున్నాయి. విరోధులెవరూ లేరు. ఆయన్ని అంతా ఇష్టపడతారు.

"కానీ మామయ్యని చూస్తే పైకి ఆరోగ్యంగానే కన్పించేవారు. మానసిక వ్యాధులు బైటికి వ్యక్తం కావుగా, ప్రవర్తనలో తప్ప? అవి అంతర్గతంగా, నిగూఢంగా రూపుదిద్దుకొంటూ అపస్మారక స్థితిలో మనల్ని వింతగా ప్రవర్తింపజేస్తాయి....స్లీప్ వాకర్ తాను స్లీప్ వాకర్నని తెలుసుకోలేడు కదా, ఇతరులు తెలుసుకొని చెప్పేవరకూ?

"అప్పటినుంచీ ఆయన స్థితికి మేమంతా కలతచెంది జాగ్రత్తగా చూసుకునేవాళ్ళం. ఆ వయసులో బాధ్యతలన్నీ చక్కగా తీర్చుకుని, ఏ బాదరాబందీ లేని ప్రశాంత జీవితం గడుపుతున్న ఆయనకి సమస్యలేమిటో, విచారమేమిటో ఒహపట్టాన అంతుబట్టలేదు. అడిగితే ఆయన చెప్పేవారుకాదు. ఆ విషయాలు కదిపితే చాలు, కోపంతో విరుచుకుపడేవారు. మా అందరికీ—వూళ్ళో వాళ్ళందరితోసహా పిచ్చెక్కిందని—మా పరామర్శలూ సపర్యలతో మిగిలివున్న తనకూ ఎక్కిస్తున్నారనీ— అంతా కలిసి కట్టగట్టుకుని వెళ్ళి పిచ్చాసుపత్రిలో తగల డండని తిట్టేవారు.

"అప్పటినించీ మేం దూరంగా ఉండసాగాం. కానీ రాత్రులు జాగ్రత్తగా కనిపెట్టేవాళ్ళం. సూరిపండు— మా పనివాడు బయట కాపలా వుండేవాడు. నేను రాత్రులు అనేకసార్లు లేచి ఆయన గదిలోకి చూసేదాన్ని. ఆయన ప్రశాంతంగా నిద్రిస్తున్నట్లు గురక వినిపించేది.... అలా పదిహేనురోజులు ఏమీ జరగలేదు, ఆయన మళ్ళీ స్లీప్ వాకింగ్ చెయ్యలేదు, డాక్టర్ ఇచ్చిన మందులూ ట్రాన్క్విలైజర్స్ వాడకుండా పారేసినా. అయితే సరిగా పదహారో రోజున ఆయన మళ్ళీ స్లీప్ వాకింగ్ చేశారు—మూడోసారి—అదే చివరిసారి—అంతే, అదే రాత్రి ఆయన ప్రాణాలు కోల్పోయారు."

"అప్పుడెవరూ చూడలేదా?"

"లేదు, అదే దురదృష్టం. ఆయన 12-30—2-30 మధ్య చనిపోయి వుంటారని డాక్టర్ అన్నాడు. నేను ఒంటిగంటకి లేచి చూస్తే ఆయన గదిలోనే వున్నారు. గురక విన్పించింది. ఆ తర్వాత అరగంటకి మావారు చూశారట—అప్పుడూ వున్నారు. ఆ తర్వాతే ఆయన ఎప్పుడు లేచి వెళ్ళారో తెలీదు. సూరిపండు చూడలేదు. అప్పుడతను కాపలాలేడు. ఆ పదిహేనురోజులూ ఏమీ జరక్కపోవడంతో వాడికి ఆసక్తి నశించి గుడిసెలోకి వెళ్ళి పడుకున్నాడు—అర్ధరాత్రికే.

వీధిలో కూడా ఆయన్ని ఎవరూ చూడలేదు. చెరువు తూర్పువైపు కిలోమీటరు దూరంలో వుంది. అక్కడ ఒకవైపు అన్నీ గుడిసెలూ, చిన్న హోటళ్ళూ వున్నాయి. అక్కడా ఆయన్ని ఎవరూ చూడలేదు. అక్కడ లైట్లు లేవు. ఆ రాత్రి వెన్నెలలేదు. ఎవరైనా చూసివుంటే ఆయన దక్కేవారేమో, అలా వ్రాసివుంది!"

"అయితే ఇందులో మీ అనుమానమేమిటి?" లాల్ అడిగాడు.

"అదే చెప్పబోతున్నానిప్పుడు....ఆ రాత్రి ఒంటిగంట తర్వాత నేను మళ్ళీ రెండున్నరకి వెళ్ళి చూశాను."

"చూస్తే....?"

"అప్పుడాయన గదిలోనే వున్నారు."

"ఏమిటీ! గదిలోనే వున్నారా?"

"అవును, నాకు అప్పుడు గురక కూడా వినిపించింది."

"కానీ డాక్టర్ పన్నెండున్నర—రెండున్నర అని-"

"అవును, ఆ మధ్యకాలంలో మరణించారని అన్నాడు. కానీ నాకు తెలిసిన దాన్నిబట్టి ఆయన రెండున్నర వరకూ సజీవంగా వున్నారు గదిలో నిద్రిస్తూ."

"మీరు పొరబడ్డారు—"

"నేను పొరబడ్డాననకండి! టైము సరిగ్గా చూశాను. నిద్రకళ్ళతో కాదు పూర్తి తెలివిలో వున్నానప్పుడు. నా చెవులు స్పష్టంగా విన్నాయి ఆయన గురక."

"అయితే డాక్టర్ పొరబడ్డాడా—?"

"నాకు తెలీదు, నేనతన్ని అడగలేదు. నాకు వీలు దొరకలేదు. అసలీ సంగతి నాకు నిన్న రాత్రే నిశ్చయంగా తెలిసింది. ఇందులో పొరపాటు లేదనుకున్నాకే ఇలా మీ దగ్గరికొచ్చాను. ఇలా రావడానికి కారణం చెప్పుకోవాలి గనుక మావారికి ఈ సంగతి చెప్పాను. ఇంకెవరికీ చెప్పలేదు. ఆయన వెంటనే నన్ను వెళ్ళమన్నారు.

"డిటెక్టివ్ గారూ, ఇప్పుడు మీకు పరిస్థితి బోధపడింది. పొరపాటు ఎక్కడ జరిగిందో మీరు తెలుసు

కోవాలి. నేను కనుక్కున్నది నిజమైతే ఆయన చావు అనుమానాస్పదమైన పక్షంలో ఆస్తికి వాళ్ళు వేస్తున్న ఎత్తుగడల్ని చిత్తుచేసే ఆధారం మాకు లభిస్తుంది. ఏమంటారు?"

"ఇందులో మీ రెవర్ని అనుమానిస్తున్నారు?"

"ఎవరినీ లేదు. అందుకే మీ దగ్గరికొచ్చాను, మీరు తెలుసుకోగలరన్న ఆశతో. నేను మిమ్మల్ని కలుసుకున్నట్లు అక్కడ ఎవరికీ తెలియకూడదు, రహస్యంగా వుంచాలి."

"రహస్యాలకి నూరు శాతం భద్రత" లాల్ అన్నాడు, "కానీ మిసెస్ సరళ, ఒకవేళ మీ అనుమానం తప్పయితే—మీరు పొరబడివుంటే — వాళ్ళ ఆటల్ని ఎలా కట్టిస్తారు?"

"నా అనుమానం తప్పుకాదు, నా అంతరాత్మకు తెలుసు."

"అంతరాత్మ అప్పుడప్పుడు డింకీ కొడుతుంది.... దాన్ని పూర్తిగా నమ్ముకోకండి. మీరు చేయవల్సిన పని ఒకటి వుంది, వినండి."

"చెప్పండి."

"మీ వార్ని అలా నిర్బంధించేందుకు వారికే హక్కు లేదు. మీ మరిదిగారి బెదిరింపులు వట్టి హంబక్. వాళ్ళేమీ చెయ్యలేరు, అలా గార్డియన్ షిప్ పొందలేరు. ఒక వ్యక్తి మానసిక రోగి అని నిరూపించి, అతను తన ఆస్తి వ్యవహారాల అజమాయిషీకి అనర్హుడని రుజువుచేసి, అతనిమీద అదుపు పొందాలంటే చాలా తతంగం వుంటుంది. అందుకు మేజిస్ట్రేట్‌కి పిటీషన్ పెట్టుకోవాలి. దానితోపాటు రెండు సర్టిఫికేట్లను జతపర్చాలి. ఒకటి గెజిటెడ్ మెడికల్ ఆఫీసర్ ధృవ

పరచింది, రెండోది రిజిస్టర్డు మెడికల్ ప్రాక్టీషనర్ ధృవపర్చింది. వాటిని పరిశీలించి మేజిస్ట్రేట్ సందేహాలుంటే రోగిని స్వయంగా పరీక్షించవచ్చు. ఆ పిటీషన్ సమంజసమైనదని తోచినప్పుడే నట్ హౌస్కి రిసెప్షన్ ఆర్డర్ జారీ చేస్తారు ...

"కాబట్టి మీ వారు మానసిక రోగి అంటూ ఆ డాక్టర్ ఒక్కడే ధృవపరిస్తే సరిపోదు. అసలు అందు నిమిత్తం అంతకాలం అలా నిర్బంధించే హక్కు అతనికి లేదు. రోగ నిర్ధారణకు పూనుకునే ముందు మేజిస్ట్రేట్ అనుమతి పొందాలి. పదిరోజుల్లో నివేదిక అందించాలి. అవసరమైతే మేజిస్ట్రేట్ ఆ కాలాన్ని పొడిగించవచ్చు. ఇటువంటి ఏ నియమావళినీ పాటించక గుడ్డిగా జంగిల్ లాని అనుసరిస్తున్న వాళ్ళమీద మీరు చర్య తీసుకోవచ్చు. మీకెవరైనా లాయర్ తెలుసా విజయవాడాలో?"

"తెలీదు, కానీ కొందరి పేర్లు తెలుసు."

"వెల్, మీరెక్కడుంటున్నారు ప్రస్తుతం?"

"హోటల్లో."

లాల్ అన్నాడు. "మిసెస్ సరళ, మేం ఈ కేసు తీసుకుంటాం. రేపుదయం బయల్దేరి వెళ్తాం, మీరూ రండి మాతో మా కార్లో. మిమ్మల్ని విజయవాడలో డ్రాప్ చేసి, మేం మా ఊరు వెళ్తాం. మీరక్కడ మంచి లాయర్ని కలిసి పరిస్థితి వివరించండి. చాలు, అతను నర్సింగ్ హోంకి వెళ్ళి వాళ్ళకు బాగా శిక్ష నేర్పుతాడు. మీ వారికి విముక్తి కలిస్తాడు."

"కానీ నా దగ్గర డబ్బు ..."

"ఏమీ లేదా?"

"నేనిది ఆశించలేదు."

"నెవర్ మైండ్, మా డమ్" జాన్ అన్నాడు రెండోసారి నోరు తెరిచి.

"డబ్బు మేం సర్దుతాం, తర్వాత సెటిల్ చేసుకుందాం. ఏమంటావు పార్టనర్?"

లాల్ అంగీకరించాడు.

ఆమె కృతజ్ఞతగా చూసింది, "అయితే ఉదయం బయల్దేరదామా?"

లాల్ తలూపాడు. "ఉదయం అయిదు గంటలకి. మీరు రెడీగా ఉండండి, వచ్చి తీసుకెళ్తాం. యే హోటల్‌లో దిగారు మీరు?"

చెప్పింది సరళ.

## 2

సర్కిల్ ఇన్స్‌పెక్టర్ వరదాచారి మీసాలు దువ్వి చిరునవ్వు విసిరాడు.

"అయితే మీరు లాల్ అండ్ జాన్, సుప్రసిద్ధ నేర పరిశోధకులు, ట్విన్ సిటీస్ డిటెక్టివ్ ఏజెన్సీ వ్యవస్థాపకులు, మరియు భాగ్యనగర్ వాసులన్న మాట!" అన్నాడతను తమాషాగా చేతులూపుతూ.

జాన్ నవ్వాడు కళ్ళు తిప్పుతూ. "మరొకటి కూడా జోడించాలి; భారత జాతీయులం కూడా!"

"జాతిగురించి వదలండి, ముందు మేం గర్విస్తున్నాం!" గర్జించాడు సర్కిల్.

"ఉద్దేశం తెలుసుకోకుండా గర్జించడం—గర్వించడం మంచిది కాదేమో?"

"మీ ఉద్దేశ్యంతో వచ్చారిక్కడికి?" మండిపడ్డాడు సబ్ ఇన్స్‌పెక్టర్ మోహన్రావ్. అతను 30 ఏళ్ళ నవ

యువకుడు. నాజూగ్గా వున్నాడు. కానీ డిటెక్టివ్‌లపట్ల తన అయిష్టతను పై అధికారితో పోటీపడుతూ వ్యక్తం చేస్తున్నాడు.

లాల్ అతన్ని సానుభూతిగా చూశాడు. "వెల్. మా రాక మీకు ఇబ్బందిగా ఉంటుందని మాకు తెలుసు, అయినా మీ సౌఖ్యం కోసం రావడం మానుకోలేదు. ఇప్పుడు వచ్చాక తిరిగివెళ్ళే ప్రసక్తేలేదు. వచ్చిన పని పూర్తి చేసుకుపోతాం. ఒక కేసులో మా క్లయంట్ సందేహాన్ని నివారించడానికి వచ్చాం—భూపతిరావు కేసు. నెలరోజుల క్రితం పూరవతల చెరువులోపడి మరణించిన మనిషి."

వాళ్ళిద్దరు నిటారుగా అయ్యారు. చెప్పలేనంత ఆశ్చర్యంతో ఒకర్నొకరు చూసుకున్నారు. తేరుకుని డిటెక్టివ్‌ని మింగేసేలా చూశారు.

"రావుగారి చావుని తిరగతోడటానికొచ్చారా మీరు!" గర్జించాడు సర్కిల్. "అసంభవం అది! వెళ్ళి పోండి వెంటనే!"

లాల్ నవ్వాడు, "అసంభవం ఎందుకని?"

"మేం పరిష్కరించిన కేసుల్ని ఇతరులు కెలకడం సహించం!"

"మీరు రావుగారి చావుని పరిష్కరించారా!"

"పరిహాసిస్తున్నారా? పరిష్కరించాం! అందులో ఎవరికీ సందేహాల్లేవు!"

లాల్ అన్నాడు శాంతంగా. "రిలాక్స్, ఇన్స్‌పెక్టర్. మీకు సంబంధించినంత వరకూ రావుగారి చావు పరిష్కారమైంది. మీకందులో సందేహాల్లేవు. ఆ కేసును మూసివేశారు కూడా—ఆక్సిడెంటల్ డెత్ అని లేబిల్

అంటించి కదూ?

"కానీ ఇందులో న్యాయం జరగలేదని ఒక పార్టీ సందేహించింది. ఆ పార్టీ మమ్మల్ని సంప్రతించింది. మేమిలా ఆ కేసు రీ ఓపెనింగ్ కి బయల్దేరాం....

"ఇందుకు మీరిప్పుడు అభ్యంతర పెడ్తున్నారు. అది సహజం. కేసు మా దర్యాప్తులో మరో రకంగా తేలితే మీ ప్రతిష్టకు దెబ్బ. అదే మీ భయం. అంటే మీ పరిష్కారంమీద మీకు సంపూర్ణ విశ్వాసంలేదు. అయినా ప్రతిష్ట ముఖ్యం గనుక దాన్ని కాపాడుకోవాలనే వ్యక్తిగత ఉద్దేశ్యంతో ఇలా మమ్మల్ని వ్యతిరేకిస్తున్నారు. కానీ మేం నిరుత్సాహపడి విరమించుకొనే ప్రసక్తేలేదు. అవసరమైతే మేజిస్ట్రేట్ నుండి ప్రొసీడింగ్స్ తెచ్చుకుని కొనసాగుతాం. ఈ కేసులో నిగ్గుతీసి వదుల్తాం. మా క్లయంట్ అనుమానాన్ని నివృత్తిచేస్తాం."

"ఎవరా క్లయంట్?" సర్కిల్ అన్నాడు ఇంకా కోపంతో.

"క్లయంట్స్ని మేం గోప్యంగా ఉంచుతాం."

"రావుగారి సంబంధీకులా—కుమారుడా?"

"కుమారుడంటే ఏ కుమారుడని మీ ఉద్దేశ్యం?"

"చిన్న కుమారుడు సుధీర్."

"పెద్ద కుమారుడు సురేష్. ఎందుక్కాకూడదు?"

"అతనికి మతిభ్రమించలేదు గనుక!"

"అంటే మా క్లయంట్ మతి చలించినవాడనా?"

"నాకలా తోచింది...."

"వెల్, తోచిందల్లా చెప్పెయడం ఆరోగ్యం కాదు. ఈ క్లయంట్ పూర్తి మానసికారోగ్యంతో మమ్మల్ని సంప్రతించడం జరిగింది."

"అదే ఎవరు—ఆడా? మగా?"

"ఎవరైతే నేం? ఒక శ్రేయోభిలాషి!"

"శ్రేయోభిలాషులు ముందు తమ స్వంత బాగోగులు చూసుకోడం మంచిది!" అన్నాడు సర్కిల్ సిగార్ తాగుతూ తాపీగా, "రావుగారి పెద్ద కుమారుడు సురేష్‌కి తండ్రి చావు ప్రచారం జరగడం ఎంతమాత్రం ఇష్టంలేదు. అది దర్యాప్తు జరిగి కుటుంబ విషయాలు పొక్కడం సహించలేడు. ఆయన చావు గురించి లేనిపోని అపోహాల్ని వ్యాపింపజేసే వాళ్ళమీద కఠిన చర్య తీసుకుంటానని మాతో అన్నాడు—

"కాబట్టి, మైడియర్ జంటిల్ మెన్, మీరు వెంటనే విరమించుకోండి. ఈ కేసులో మీరు కొత్తగా ఏమీ తెలుసుకోలేరు. డాక్టర్ రిపోర్టులోగానీ, మా ఇంక్వెస్టులోగానీ లోపాలు కనిపెట్టలేరు. సాక్షుల కథనాన్ని మార్చలేరు. మీ క్లయంట్ అనుమానం పూర్తిగా తప్పు. అనుమానాలుంటే మా దగ్గరికెందుకు రాకూడదు? ఎక్కడో వున్న మిమ్మల్ని పిలిచి మమ్మల్ని అసమర్థుల్ని చేయాలనేనా ఉద్దేశ్యం?"

"ఇందులో శక్తి సామర్థ్యాల ప్రస్తావనలేదు, ఇన్స్పెక్టర్" లాల్ అన్నాడు అలసటగా. "మిమ్మల్నేదో కించపర్చాలని కాదు మా క్లయంట్ ఉద్దేశ్యం. తన కోరికని మీరు తిరస్కరిస్తారని కావచ్చు. మీ దర్యాప్తులో పొరపాట్లుండక పోవచ్చు—చేసినంతవరకు. కాని దృష్టికిరాని అంశాలు కొన్ని వుండవచ్చు కదా? వాటిని దర్యాప్తులో సమీకరించి విశ్లేషించకపోతే కేసుకి పూర్తి న్యాయం జరగనట్లే కదా?"

"ఏమిటా దృష్టికిరాని అంశాలు, మిస్టర్ లాల్?"

"ఆయన సజీవంగా వున్న కాలాన్ని 'మీ డాక్టర్' మరణకాలంగా సూచించడం."

"ఏమిటేమిటీ! వివరంగా చెప్పండి" మోహన్ అన్నాడు కుతూహలంగా.

లాల్ అన్నాడు. "మీ డాక్టర్ మరణకాలాన్ని 12-30—2-30ల మధ్య నిర్ణయించాడు కానీ ఆ రాత్రి రెండున్నర ప్రాంతాల ఆయన గదిలోనే నిద్రిస్తూ వున్నారని ఒక సాక్షి కథనం. ఈ సాక్షి—ప్రత్యక్షంగా గమనించిన సాక్షి—ఆయన గది ముందు వుండి లోపల గురక వినడం జరిగింది. అంతేగాక, గది తలుపు లోపలనుంచి గడియవేసి వుండడం కూడా గమనించడం జరిగింది."

"కల్పితం! కేసుని కన్ఫ్యూజ్ చెయ్యడానికి!" అరిచాడు సర్కిల్.

"కల్పనలతో కన్ఫ్యూజ్ చెయ్యడానికి మేము లాయర్లం కాము!" లాల్ అన్నాడు నిర్లక్ష్యంగా, "ఈ సాక్షి కథనం కల్పనకాదు. అదేదో దురుద్దేశ్యంతో ఇచ్చిన స్టేట్‌మెంట్ కాదు. ఈ సాక్షి ఒక బాధ్యత ఎరిగిన వ్యక్తి."

"అయితే మీరెవర్ని బాధ్యతలేని వ్యక్తి అంటున్నారు, డాక్టర్నా?"

"లుక్ ఇన్స్పెక్టర్!" లాల్ అన్నాడు కఠినంగా, "మేమిక్కడ వ్యక్తుల బాధ్యత, సమర్థత, సంస్కారం, నీతి నిజాయితీల్ని, గుణగణాల్ని పరిశీలించడానికి రాలేదు. వాస్తవం తెలుసుకోడానికి వచ్చాం, కేవలం వాస్తవం! మీరనుకొంటున్న వాస్తవానికీ మాకూ చాలా వ్యత్యాస ముంది. మీరు నమ్మే వాస్తవం పొరపాటుతో కూడి

ఉండకపోవచ్చు. మీ డాక్టర్ పొరబడ్డాడని అనలేను. ఆసమర్థుడని చెప్పలేను. కానీ దర్యాప్తును సక్రమంగా నిర్వహించడంలో మీరు విఫలమయ్యారని చెప్పగలను. అందువల్ల కొన్ని విషయాలు మరుగున వుండిపోయే అవకాశం వుంది—కాదంటారా?"

"మీకో విషయం చెప్పనా, మిస్టర్ లాల్?" సర్కిల్ అన్నాడు మీసాలు మెలేస్తూ. "అసలిందులో దర్యాప్తు అనేదిలేదు! అన్ది స్పాట్ టపాకాయలా పేలిపోయిన—తేలిపోయిన కేసు! ఆయన స్లీప్ వాకర్. ఆ రాత్రి నడిచివెళ్ళి నిద్రలో చెరువులో పడిపోయారు. అంటే, అది ఆక్సిడెంటల్ డెత్. దానికి ఇంకా దర్యాప్తు ఏమిటి? మాకు వేరే పనీ పాటా లేదను కున్నారా?"

"అసలు దర్యాప్తును కొందరు నిరోధించారు."

"కరెక్టు! ముఖ్యంగా పెద్ద కుమారుడు సురేష్. అతనికి తండ్రి పేరుప్రతిష్ఠల గురించి పట్టుదల ఎక్కువ. ఆయన చావు ప్రచారం కావడం వీల్లేదన్నాడు. కేసును వీలైనంత త్వరగా—అక్కడికక్కడే ముగించివేస్తే మంచిదన్నాడు. పైగా అందులో మేం చేయగల్గింది కూడా ఏమీ కన్పించలేదు.

"కానీ ఇప్పుడు మీరు-కొత్త పాయింట్ని సృష్టించి కన్ఫ్యూజ్ చేస్తున్నారు. దేన్ని నమ్మాలి, మా డాక్టర్ రిపోర్టునా? మీ సాక్షి స్టేట్మెంట్నా?"

లాల్ అన్నాడు, "ఇన్స్పెక్టర్, ఇందులో మిమ్మల్ని వేరుగా, మిమ్మల్ని వేరుగా భావించి వాగ్యుద్ధం ప్రకటించకండి దయచేసి! మనమంతా ఒక్కటే—ఒకే రంగానికి చెందినవాళ్ళం. నేరపరిశోధన ముఖ్య లక్ష్యం.

సత్యాన్ని దర్శించడం కలిసికట్టుగా పనిచేస్తే దాన్ని సాధించగలం. అలా గాక కోర్టు వాతావరణాన్ని సృష్టించుకుంటే కాలయాపనే జరుగుతుంది — సత్యం మరుగున వుండిపోయింది.... మేం మీ క్రెడిట్‌ని దోచుకు పోవాలని రాలేదు. మిమ్మల్ని అల్పుల్ని చేసి ఎదిగి పోవాలనే దుగ్ధతో కూడా రాలేదు. పేరుప్రతిష్టలు మా కక్కర్లేదు—మా క్కావాల్సిందల్లా న్యాయం."

"ఈ ఉపన్యాసాలతో మన మెక్కడికి పోతున్నామో తెలీటంలేదు, మిస్టర్ లాల్!" మోహన్ అన్నాడు అమాయకంగా.

లాల్ అతన్ని జాలిగా చూశాడు.

సర్కిల్ పెద్దగా నవ్వాడు. "ఈ ఉపన్యాసాల్ని ఎవరు కేర్ చేస్తాడు, మోహన్? డియర్ జంటిల్‌మెన్, మీతో నే స్తం కుదరదు! ఉపన్యాసాలాపి సూటిగా బిజినెస్ మాట్లాడుకుందాం, మీరొక పాయింట్ తెచ్చి ఆలోచింపజేశారు. మేం ఒకసారి మా నోట్స్ రిఫర్ చేసుకుంటాం. తగిన విధంగా చర్య తీసుకుంటాం. మీరిక నిశ్చింతగా సెలవు తీసుకోవచ్చు."

"మీ దగ్గర్నుంచా?"

"ఈ ఊర్నుంచే! అరగంటలోగా మీ కారు రోడ్డు మీద ఉరుకుతుండాలి. అది మా హెడ్ చూడకపోతే పరిస్థితి బాగుండదు."

"ఏమవుతుంది? ఏం చేస్తారు?"

"మీమీద కఠిన చర్య తీసుకుంటాం!"

"ఏ ఆధారంతో? ఏ సెక్షన్ ప్రకారం?"

"ఆధారాలూ, సెక్షన్లూ అన్నీ మీకు తెలుసు."

లాల్ లేచాడు వెంటనే, "మమ్మల్ని ఎలా రక్షించు

కోవాలో కూడా మాకు తెలుసు! సీయూ, ఫ్రెండ్స్!
కమాన్, జాన్."

## 3

శ్రీనగర్ టౌను అతి సుందరమైనది. శుభ్రతకు, పరిసరాల రమ్యతకు సాటిలేనిది. ప్రకృతి దృశ్యాలకు పెట్టింది పేరు.

అందమైన వీధులతో, మరీ అందమైన గృహాలతో; కాలుష్య నివారణలోనూ, పారిశుద్ధ్యాభివృద్ధిలోనూ, ప్రజా జీవితానికి వలసిన ఉన్నత ప్రమాణాలతో, మహా మహా నగరవాసులను సైతం ఆకట్టుకొనే అతి నిరాడంబరమైన టౌను శ్రీనగర్.

ఊళ్ళో ఒక సివిల్ హాస్పిటల్తోపాటు అరడజను ప్రైవేటు ఆస్పత్రులున్నాయి. కోర్టు, జూనియర్ కాలేజీ ఇతర ప్రభుత్వ కార్యాలయాలూ వున్నాయి. ఏడెనిమిది హోటళ్లు, నాలుగు లాడ్జింగులు (వాటిలో రెండు ఆధునిక సౌకర్యాలు కలవి), అయిదు సినిమా థియేటర్లూ వున్నాయి.

చుట్టుపక్కల గ్రామాలవారికి అది ముఖ్య వ్యాపార కేంద్రం. ఊరి రెండు చివరలను కలిపే నాలుగు కిలో మీటర్ల రోడ్డు పొడవునా వివిధ వ్యాపార కేంద్రాలు నెలకొని వున్నాయి. బియ్యం ప్రధాన వ్యాపారంకాగా, ఈమధ్య కాలంలోనే అసంఖ్యాకమైన రైసు మిల్లులు వెలిశాయి. ఆర్థికంగా, వ్యాపారపరంగానూ ఇంత అభివృద్ధి సాధించినా, ఇంకా ఊళ్ళోని రాజకీయాలు దీన్ని మేజర్ పంచాయితీ నుంచి మున్సిపల్ స్థాయిలోని పాలనా వ్యవస్థకి తీసుకుపోలేకపోతున్నాయి.

ఊరవతల ఉత్తరంవైపునుంచి నీటిచెరువుంది. ఆపైన

పరిపాలాలూ, ఉయ్యూరు షుగర్ ఫ్యాక్టరీ కింద చెరకు తోటలూ వున్నాయి. చెరువు ప్రాంతాల జనసంచారం వుంటుంది. అక్కడ వ్యవసాయ కూలీలు, ఇతర బడుగ వర్గాలవారూ నివసిస్తూంటారు. అక్కడ వాళ్ళ అవసరాల్ని తీర్చే చిల్లరకొట్లూ, టీ బడ్డీలు వున్నాయి.

దక్షిణం దిక్కు విజయవాడ రోడ్డుమీద కొంత దూరం వెళ్తే భూపతిరావు రైసుమిల్లు వుంటుంది. ఇంకా పైకి వెళ్తే ఆయన కొబ్బరి తోట కనిపిస్తుంది. ఊరిమధ్య దేవాలయం దగ్గర ఆయన రెండంతస్తుల మేడ దర్శనమిస్తుంది.

పోలీస్ స్టేషన్లో ఇన్స్పెక్టర్ సంకుచిత ప్రవర్తనకి నిరాశ చెందని, బాధపడని డిటెక్టివ్లు ధూమపానం చేస్తూ కార్లో తిరిగి కొన్ని పనులు వేగంగా ముగించుకుని, సివిల్ హాస్పిటల్ ముందు ఫ్రెష్గా దిగారు.

సమయం మధ్యాహ్నం రెండు కావస్తోంది.

మెట్లెక్కి లోపలికి వస్తోంటే, యుక్తవయసులోని నర్సు వాళ్ళని ఆహ్వానించింది. జాన్ ఓ అందమైన చిరునవ్వు అలా విసిరి, ఆమె కన్నె హృదయాన్ని ఇలా దోచుకోబోయాడు.

"ఇలా రండి, ప్లీజ్! డాక్టర్ లోపల వున్నారు..." దారి చూపించిందామె.

కారిడార్లో నడిచి చివరి గది దగ్గర ఆగారు. ఆమె లోపలికి తొంగి చూసి, "సర్, ఎవరో మెడికల్ రిప్రెజెంటేటివ్స్లా వున్నారు, వచ్చారు" అంది.

"సెండ్ దెమ్ ఇన్!" అరుపు వినిపించింది.

ఆమె డిటెక్టివ్లని గదిలో ప్రవేశపెట్టి నిష్క్రమించింది.

డాక్టర్ జనార్ధన్, సరళ చెప్పిన వయసులో నల్లగా దృఢంగా వున్నాడు. అతన్ని విష్ చేసి కూర్చున్నారు డిటెక్టివ్లు.

లాల్ అన్నాడు. "డాక్టర్, మేం హైద్రాబాదు నుంచి వచ్చాం. లాల్ అండ్ జాన్ అంటే సరిపో తుందనుకుంటాను—"

"లాల్ అండ్ జాన్!" అన్నాడతను, ఉలిక్కిపడి నిటారుగా కూర్చుని.

"యస్, మేం భూపతిరావ్ ఆక్సిడెంటల్ డెత్ని తిరిగి దర్యాప్తు చేస్తున్నాం. ఇందులో మీ సహాకారం మాకు చాలా అవసరం."

డాక్టర్ అయోమయంగా చూస్తున్నాడు. అతని ముఖంలో కలవరం, కంగారు, భయమూ అన్నీ కలగా పులగంగా కలిసి, చకచకా వ్యక్తమవుతున్నాయి.

"డాక్టర్—మీ ఆరోగ్యం—బాగుందా?" లాల్ అన్నాడు చటుక్కున.

అతను తేరుకున్నాడు. నెమ్మదిపడ్డాడు. బలహీనంగా నవ్వాడు. "నా ఆరోగ్యం....ధనాధన్! మీరు మెడికల్ రిప్రజెంటేటివ్స్ అని చెప్పింది నర్సు—"

"అలా మేం చెప్పలేదు, ఆమె పొరబడింది. మీరు కంగారుపడకండి. ఆ ధనాధన్ ఏమిటి? మమ్మల్ని నవ్వించకండి. మీతో కొన్ని విషయాలు సీరియస్గా మాట్లాడాలి. మీరు భూపతిరావు మృతదేహం మీద నామమాత్రపు పోస్టుమార్టమ్ జరిపారు-"

"కానీ ఆ విషయాలు నాతో ఎందుకు మాట్లాడు తున్నారు? మీరెవరి తరఫున వచ్చారు?"

"ఓ క్లయింట్ తరఫున. ఆ కేసు సక్రమంగా దర్యాప్తు

జరగలేదు."

"దర్యాప్తు జరిపించే అవసరం కన్పించలేదు!" అన్నాడు డాక్టర్ వెంటనే, "ఆన్ ది స్పాట్ తేలిపోయిన కేసు, ఎవర్నయినా అడగండి. ఆయన ప్రమాదవశాత్తు చెరువులోపడి చచ్చిపోయారు, అంతే. ఈ విషయాలు నేను మీతో చర్చించకూడదు. నా కనుమతి లేదు. పోలీసుల్ని కలవండి. కానీ వాళ్ళెప్పుడో ఆ కేసు మూసేశారు—"

"ఆ కేసు రీ ఓపెనింగ్ కి ఇదుగో మేజిస్ట్రేట్ గారు ఇలా ఆజ్ఞాపిస్తున్నారు...." లాల్ ఒక కవరుతీసి అతనికి జాగ్రత్తగా అందించాడు.

డాక్టర్ దాన్ని విప్పి చదివి కంగారుపడ్డాడు. ముఖం వివర్ణమైంది.

లాల్ నవ్వాడు విలాసంగా, "మేం మేజిస్ట్రేట్ ని కలుసుకొని వస్తున్నాం, డాక్టర్. మా సందేహాలు ఆయనకు విన్పించాం. ఆ కేసుని హడావుడిగా ముగించారని ఆయన అన్నారు. ఆక్సిడెంటల్ డెత్ కు సంబంధించి సర్కమ్ స్టేన్షియల్ ఎవిడెన్స్ లో ఎటువంటి లోపం కనిపించలేదన్నారు.

"ఇక మెడికల్ ఎవిడెన్స్ కు — పోస్టుమార్టమ్ కు ఆయన కుటుంబం ముఖ్యంగా ఆయన పెద్ద కుమారుడు సురేష్ అంగీకరించలేదన్నారు. కుటుంబ ప్రతిష్ట, తండ్రి గురించిన చేదు వాస్తవాలు రచ్చకెక్కడం అతను సహించలేదట. మీకు తెలుసు, ఈ పలుకుబడి గల కుటుంబాల వాళ్ళకి లొంగి, కొందరు అధికారులెలా ప్రవర్తిస్తారో. ఈ కేసులో మీరంతా వాళ్ళకి లొంగి వుండి విధుల్ని సక్రమంగా నిర్వహించలేదు.

"వెల్, ఒక అత్యంతాసక్తికరమైన విషయం ఇటీవల వెలుగులోకి వచ్చింది. దాన్ని మేజిస్ట్రేట్ కి విన్పించాం. ముందు ఆయన చాలా అప్ సెట్ అయ్యారు. తర్వాత శాంతంగా ఆలోచించారు. మేం కేసుని మా క్లయింట్ ప్రయోజనాల కోసం తిరగతోడి పెడదారి పట్టించడం లేదని ఆయనకు నమ్మకంగా తెలుసు. మా రెప్యుటేషన్ ఆయనకు తెలుసు. మాతో చాలా ఆత్మీయతతో మాట్లాడారు. ముందు మమ్మల్ని తిరస్కరిస్తారనుకున్నాం. ఈ పునః దర్యాప్తు బాధ్యతల్ని ప్రభుత్వాధికారికే అప్పగిస్తారనుకున్నాం. కానీ డాక్టర్, మామీద విశ్వాసంతో, అభిమానంతో మమ్మల్నే నియమించారు. తత్ఫలితమే ఈ ఆర్డర్.

"వెల్, మాకిప్పుడు ఏ ఆటంకాలూ వుండవు" లాల్ ఇంకా కొనసాగించాడు. "మేం కోర్టు రికార్డ్సులో మీ మెడికల్ రిపోర్టుని, పోలీసుల ఇంక్వెస్టునీ చూశాం. మీ రిపోర్టులో మీరు చాలా తక్కువ అంశాలు—పైపై విషయాలను మాత్రమే పొందుపర్చారు. పురీషనాళంలో థర్మామీటరు వుంచి శవం ఉష్ణోగ్రత, రిగర్ మార్టిస్, పోస్టుమార్టం లివిడిటీ, స్కిన్ ఎలాస్టిసిటీ, వస్త్రధారణ, ఇంకా శవంమీద ఇతర వస్తువులూ గాయాలూ మొదలైనవి...."

"అంతే మిస్టర్ లాల్, శవాన్ని కోసి ఛిన్నాభిన్నం చెయ్యడం ఆయన కుటుంబం అంగీకరించలేదు. పైగా అంత అవసరం కన్పించలేదు కూడాను."

"అవసరం కన్పించలేదా?" లాల్ అన్నాడు ఆశ్చర్యంగా, "డాక్టర్, మీరు బాధ్యతగల అధికారి. అవసరం కనిపించలేదంటున్నారా? ఆయన కుటుంబంలో ఫ్యామిలీ

డాక్టర్‌గా సన్నిహిత సంబంధాలు కలిగివుంటూ, ఆయన ఆరోగ్యంపట్ల, ఆయన అకాలమరణంపట్ల ఏ మాత్రమూ శ్రద్ధ కనబర్చక పలువురూ చెప్పుతున్న గాలిమాటలతో నిర్ణయానికొచ్చేసి మీ కర్తవ్యం నెరవేరిందనుకున్నారా? పోలీసులు లక్ష వూహిస్తారు. ఉత్పేక్షం వాళ్ళ ఊపిరి. కానీ డాక్టర్ అలా కాదు, పరిశీలిస్తాడు. కనుక్కుంటాడు. తను కనుక్కున్న వాటిమీదనే ఆధారపడి నిర్ణయాలు చేస్తాడు. మీరు కుటుంబసభ్యుల నిర్ణయాలకి తలొగ్గి ప్రవర్తించారనడం నేనిప్పుడు అంగీకరించను. అలా జరిగి వుంటే, ఫలితాలను కూడా మీరు వాళ్ళకనుకూలంగానే ప్రకటించి వుండేవారు.”

“ఫలితాలా?”

“అవును, ఫలితాలు—”

“ఆగండి! వాళ్ళకనుకూలంగా ప్రకటించి వుండేవాడ్ననడంలో మీ ఉద్దేశ్యం? వాళ్ళని మీరు అనుమానిస్తున్నారా? ఏ రకంగా?”

“వాళ్ళ ధోరణి, ప్రవర్తనే అనుమానాస్పదంగా లేదూ? ఆ చావుని గుట్టురట్టుగాకుండా మట్టుబెట్టాలనుకోవడం, సుధీర్‌ని ఆస్పత్రిలో నిర్బంధించి ఆస్తిమీద ఆధిపత్యం పొందాలనుకోవడం, అంతా ఒక పథకం ప్రకారం జరుపుతున్న కుట్రలా లేదూ?”

“మీ ఆరోపణలు తీవ్రంగా వున్నాయి! సురేష్‌కి తెలిస్తే—”

“గో టు హెల్! తండ్రి బ్రతికున్నప్పుడు లేని శ్రద్ధాభక్తులు, ఆయన పోవడంతోనే అకస్మాత్తుగా ఎలా పుట్టుకొచ్చాయి? ఆయన ప్రతిష్ట గురించి అంత బెంగ ఇప్పుడు ఎందుకు? డాక్టర్, ఆ చావు దర్యాప్తు

జరిగితే ఎవరి ప్రయోజనాలకి ముప్పో నాకు తెలుసు. భయపడినవారే ఇలాటి అర్థంలేని బెదిరింపులు చేస్తారు."

"ఆల్ రైట్, ఇందాక నేనే ఫలితాల్ని వాళ్ళ కనుకూలంగా ప్రకటించలేదన్నారు?"

"టైమింగ్ — మరణ సమయం, అది 12-30— 2-30ల మధ్య నిర్ణయించారు. అవునా?"

"అవును...."

"వెల్, ఆ సమయంలో ఆయన బ్రతికే ఉన్నారంటే మీరేమంటారు?"

"ఏమిటీ! ఆయన బ్రతికే వున్నారా!"

"అవును, రెండున్నరవరకూ ఆయన గదిలో గురక వినిపించింది."

డాక్టర్ ఉలిక్కిపడ్డాడు, "గురక విన్పించిందా? ఎవరన్నారు?"

"ఒక నమ్మకమైన సాక్షి."

"ఎవరా సాక్షి?"

"అది మేం పోలీసులకే చెప్పలేదు."

"నాకు తెలుసు. అదెవరో నాకు తెలుసు. సరళ కదూ? అవును, ఆమె నిన్నటినుంచీ కన్పించలేదు. మీ దగ్గరికి వెళ్ళి ఇలా పంపింది. ఇది ఆమె పనే!"

"వెల్, నా ప్రశ్నకు జవాబివ్వలేదు."

"అది పూర్తిగా అబద్ధం. అసంభవం."

"మీ రిపోర్టు నిజమా?"

"నిజం. పూర్తిగా వాస్తవం."

"డాక్టర్, మీరు పొరపాటున కమిట్ అవుతున్నారేమో.... ఇప్పటికైనా అవకాశం వుంది, బాగా ఆలోచించుకోండి!" జాన్ హెచ్చరించాడు.

"లేదు, నే సూచించిన టైము సరయినదే!"

"మీరిప్పుడు కమిట్ అయిపోయారు!" అన్నాడు జాన్.

డాక్టర్ అన్నాడు. "ఆ రాత్రి ఆ సమయంలో ఆయన గదిలో గురక వినిపించిందంటే మీ సాక్షి పొరబడి వుండాలి. ఇంట్లోవాళ్ళు ఆయన్ను రాత్రులు లేచి కనిపెట్టడం నాకు తెలుసు. పనివాడు నూరిపండు బయట కాపలా వుండేవాడు. కానీ ఆ పదిహేను రోజులూ ఆయన మళ్ళీ స్లీప్ వాకింగ్ చెయ్యలేదు. అందువల్ల ఆ రాత్రి కూడా ఏమీ కాదనే ధీమాతో నూరిపండు వెళ్ళి పడుకున్నాడు.

"నాకు తెలిసినంతవరకు ఇంట్లో సురేష్ భార్య రాజేశ్వరి, సుధీర్, అతని భార్య సరళ తప్ప—సురేష్ ఏనాడూ తండ్రిని అలా కనిపెట్టలేదు. గాఢంగా నిద్రించేవాడు. ఆ రాత్రి రాజేశ్వరి కూడా కనిపెట్టలేదు. తనకెందుకో గాఢంగా నిద్రపట్టేసిందని నాతో అంది. ఇక సుధీర్, సరళ, ఇద్దరూ ఆ రాత్రి ఎన్నిసార్లు లేచి చూశారో నాకు తెలీదు. కానీ అన్నిసార్లు చూశాక, ప్రతిసారీ గురక విన్నాక, చివరిసారిని సరిగా గుర్తు పెట్టుకుని ఉండకపోవచ్చు. నిద్రమత్తులో లేని గురకను వింటున్నట్లు భ్రమించి వుండొచ్చు. లేదా, చివరిసారి చూసిన సమయాన్ని పొరబడి వుండచ్చు."

లాల్ అన్నాడు. "మొదటిసారి సరళ ఒంటిగంటకి, రెండోసారి ఆమె భర్త ఒకటిన్నరకు చూశారు. ఇద్దరూ పొరబడే వీల్లేదు. ఆ రెండుసార్లు గురక విన్పించింది. ఆ రెండు సమయాలూ మీరు నిర్ణయించిన మరణ సమయంలోనివే కదూ?"

డాక్టర్ తలూపాడు. "కానీ రెండోసారి ఆమె భర్త ఒకటిన్నరకు చూసిన తర్వాతనుంచీ, ఆ తర్వాత రెండున్నరవరకూ గల గంట వ్యవధిలో ఆయన లేచివెళ్ళి చావు తెచ్చుకోవడానికి మంచి అవకాశం వుంది. ఈ సమయం కూడా నేను నిర్ణయించిన పరిధిలో నేవుంది. ఇక రెండున్నరకు సరళ చూశాననడం కల్పితమైనా కావాలి, పొరపాటైనా కావాలి."

"అప్పుడు తలుపు గడియకూడా వేసివుంది లోపలి నుంచి."

"అది పూర్తిగా అసంభవం. కల్పితం."

"లేదా ఆ గురక తప్పుడు టైమింగ్‌తో సృష్టించబడిన ఎలిబీ కావచ్చు."

"అంటే!"

"నెవర్ మైండ్. మీకు శవం తలమీద గాయంగానీ, బొప్పిగానీ కన్పించలేదా!"

"లేదు!"

"పోస్టుమార్టమ్ లివిడిటీ?"

"నెగటివ్. నీటిలో తేలే శవంలో అది ఏర్పడదు!"

"ఆయనకు ఈత వచ్చా?"

"రాదు!"

"థాంక్స్, డాక్టర్" లాల్ లేచి కరచాలనం చేశాడు.

## 4

"వెల్, పార్టనర్. ఏమిటి నీ అయిడియా?" జాన్ అన్నాడు కారు స్టార్టుచేసి.

లాల్ సిగరెట్ వెల్గించుకుని కళ్ళు మూసుకున్నాడు

క్షణం సేపు.

"ఈ సరళ కథ అల్లుకొని రాలేదు కదా?" అన్నాడతను మెల్లిగా.

"లేదు. అలా అన్పించడంలేదు" అన్నాడు జాన్ డ్రైవ్ చేస్తూ, "నీ కా అనుమానం ఎందుకొచ్చింది?"

లాల్ అన్నాడు, "ఆమె భర్తను చూసు, వాళ్ళేం చేశారో! ఆ కక్షతో ఆమె తెలివిగా ఈ వంకను సృష్టించి వాళ్ళని ముప్పుతిప్పలు పెట్టాలనుకోవడంలేదు కదా?"

"కక్ష సాధించాలనుకోవడం నిజం. కానీ ఈ వంకను సృష్టించలేదు. అది ఆమె ప్రత్యక్షానుభవంలోంచి వెలికి తీసింది."

"అయితే ఆ రాత్రి ఆ గదిలో గురక విన్పించిన ఆసామీ ఎవరంటావు?"

"నువ్వు గమ్మత్తుగా మాట్లాడతావు, లాల్. గురక నెవరైనా అనుకరించగలరా?"

"అభ్యాసం మీద ఏదైనా సాధ్యమే పార్ట్నర్."

"ప్రొసీడ్!"

"చూశావా, నువ్వు అప్రయత్నంగానే నన్ను అనుకరిస్తున్నావు, ప్రొసీడ్ అంటూ!" నవ్వాడు లాల్, "సురేష్‌ని కలుసుకోవాలి. వాళ్ళింటికి పోనివ్వు. అతని రియాక్షన్ ఏమిటో, మనమీద ఏం చర్య తీసుకుంటాడో చూద్దాం!

"ఈ డాక్టర్ మన క్లయింట్‌ని ఊహించేశాడు. ఈపాటికి సురేష్‌కి ఫోన్ చేసి చెప్పేసివుంటాడు. ఆ రాత్రి ఆ భార్యాభర్తలిద్దరూ గాఢనిద్రలో వున్నారట. కాదు, వాళ్ళిద్దర్లో ఒక్కరే నిద్రలో వున్నారు నా

థియరీ ప్రకారం. మరొకరు అక్కడ గైర్ హాజర్‌లో వున్నారు. ఈ గైర్ హాజర్ వున్న పార్టీ మరికొన్ని పార్టీలని కూడగట్టుకొని తన పనులు చక్కబెట్టుకుంటుంది."

"ఆ పార్టీలెవరు, ఎందరున్నారు, ఏమేం చేశారు..." జాన్ అడ్డు తగిలి అంటూండగా, లాల్ అందుకొని అన్నాడు. "మొదలైన సందేహాలకి సమాధానాలు నీ బుర్రలో వెతుక్కోగలవు."

కారు వురుకుతోంది....జాన్ డ్రైవ్ చేస్తూన్నవాడల్లా మెయిన్ రోడ్డుమీద అకస్మాత్తుగా వేగం దగ్గించి, రోడ్డుదిగి పక్కవీధిలోకి తిరుగుతోన్న రిక్షాన్ని చూపిస్తూ అరిచాడు. "పార్ట్‌నర్, అటు చూడు! రిక్షాలో!"

లాల్, జాన్ చూపించినవైపు చూశాడు. అతని కళ్ళు పెద్దవయ్యాయి. "హో, సరళ!" అన్నాడతను ఆశ్చర్యంతో, "స్పీడప్! ఆమెని అందుకోవాలి!"

జాన్ వేగంగా ఆ వీధిలోకి పోనిచ్చి రిక్షాని ఓవర్‌టేక్ చేస్తూ కొంతదూరంలో ఆపేశాడు. తటాలున ఇద్దరూ దిగి నిలబడ్డారు. అంత దూరంనుంచి డిటెక్టివ్‌లని చూసి సరళ, చటుక్కున రిక్షా ఆపేసి దిగిపోయింది. డబ్బులిచ్చేసి, పరిగెత్తుకొంటూ వచ్చి చేరుకుంది అరుస్తూ, "లాల్! ఓహ్, లాల్!"

"ఉష్‌ష్....వీధి! పబ్లిక్ వీధి!" వారించాడు లాల్.

ఆమె వణికిపోతోంది. లాల్ చెయ్యి పట్టుకొని అర్చింది మళ్ళీ, "నేను మీ కోసమే వచ్చాను!"

"ఎందుకు?"

"ఆయన....ఆయన . కన్పించడంలేదు!"

"ఏమిటీ!"

"అవును! ఆయన పారిపోయారట, వాళ్ళని గాయ

పరచి!"

"ఎక్కడికి? వివరంగా చెప్పండి."

ఆమె ఆయాసపడుతోంది. వీధిలో జనం ఆమెనీ, డిటెక్టివ్ లనీ విచిత్రంగా చూసుకుంటూ పోతున్నారు.

"ఉదయం నాలుగ్గంటలకి ఆయన వెళ్ళిపోయారట. ఎక్కడికో తెలీదు! అడ్డుకోబోయిన నర్సుని గాయపర్చి పారిపోయారట. నేను లాయర్ తో వెళ్ళగానే చెప్పాడు డాక్టర్. మీకు తెలీదా? ఇక్కడ ఆయన అన్నకు ఫోన్ చేశాడట డాక్టర్ ...."

"లేదు, మాకు తెలీదు" అన్నాడు లాల్, "ఇక్కడ డాక్టర్ గానీ, పోలీసులు గానీ మాకు చెప్పలేదు. మీ మరిదిగార్ని మేమింకా కలుసుకోలేదు. ఆయనెక్కడికి వెళ్ళి వుంటాడు?"

"ఏమో, తెలీదు! నాకేదో భయంగావుంది ..."

"ఎందుకు భయం?"

"ఒకవేళ ఆయన ఇక్కడికే బయల్దేరివచ్చి—"

"చెప్పండి, టైంలేదు! వచ్చి—"

"ఎవరిమీదనైనా అఘాయిత్యం జరుపుతారేమో!"

"జరపనీండి!"

"ఏమిటీ!"

"ప్రయత్నించనీండి!"

"అంటే!"

"దోషులకి ఇప్పుడు తాము జాగ్రత్తగా ఉండాలని తెలుసు. మీవారు అఘాయిత్యం జరపడం అనుకున్నంత సులభంకాదు. లాయర్ ఏమన్నాడు?"

"కేసు వేస్తానన్నాడు—హేబియస్ కార్పస్. అలా నిర్బంధించినవాళ్ళకి పరిరక్షించే బాధ్యత కూడా వుంటుం

దన్నాడు. డాక్టర్‌తో చాలా వాదించాడు. ఒక సందర్భంలో ఆయుస్సు దాచి బుకాయిస్తున్నానని కూడా ఆరోపించాడు."

"ఎందుకు దాస్తారు?"

"ఏమో తెలీదు. అందుకేగా అన్నగారు పోలీసు రిపోర్టు ఇవ్వనిది!"

"వెల్, మీరు కారెక్కండి. ఇంటికెళ్దాం."

"మా ఇంటికా? మీతోనా?"

"అవును, మీ గురించి వాళ్ళకి తెలిసిపోయింది. ఇంకా మన సంబంధాన్ని దాచడం జోక్‌గా వుంటుంది" లాల్ వెనుక డోర్ తీసి ఆమెను కూర్చోబెట్టాడు. తను ముందు సీట్లో కూర్చున్నాడు. జాన్ స్టార్టు చేశాడు. వెనుక డోర్స్ అద్దాలు లైట్‌ప్రూఫ్ కావడంవల్ల బయటి వాళ్ళకి సరళ కన్పించదు.

నాలుగు నిమిషాల్లో కారు భూపతిరావ్ మేడ ముందాగింది. గేటుమూసివుంది. జాన్ హారన్ ప్రోగించిన నిముషానికి ఒక నల్లగా, బలిష్టంగా వున్న మనిషి వచ్చి తీశాడు. అతనికి నలభై ఏళ్ళుంటాయి.

అతను కారువద్దకొచ్చి ప్రశ్నార్థకంగా చూశాడు, "ఎవరు అబ్బాయా, మీరు?"

"నువ్వెవరు?" జాన్ అన్నాడు తలెగరేసి.

"నేను సూరిపండుని, అబ్బాయా!"

"అయ్యో, నువ్వేనా! అయితే నేను జాంపండుని, ఈయన లాల్‌పండు."

లాల్ కసురుకున్నాడు. "నీకు మా పేర్లు కొత్తగా వుంటాయి, మమ్మల్ని డిటెక్టివ్ గారని పిలువ్."

"డిటెక్టివ్‌గారా?" అన్నాడా మనిషి ముఖం చిట్లించి.

"అదేమిటి, ముళ్ళపూడి వా! బుడుగు అన్నట్టు అంటాడు? నువ్వు 'బుడుగు' చదివావా సూరిపండూ?" అన్నాడు జాన్.

"నాక్కోపం తెప్పించకండి అబ్బాయీ!" అన్నాడా మనిషి తీవ్రంగా.

"సరే, అయితే మేం డికిష్టిలం—నువ్వు కోపిష్టివి, ఓ.. కే.?"

జాన్ కారును రివ్వున లోపలికి పోనిచ్చాడు.

సూరిపండు వెనుక అద్దంలోంచి సరళని చూసి, "చిన్నమ్మగారు, మీరా!" అంటూ పరుగెత్తుకు వెళ్ళాడు.

అప్పుడే ఇంటి వరండాలో ఒక స్త్రీ వచ్చి నిల్చుంది. ఆమె గాభరాగా చూస్తోంది. జాన్ కారాపగానే లాల్, సరళలు వెంటనే దిగారు. తర్వాత జాన్ దిగాడు. సూరిపండు ఆశ్చర్యపోతూ వాళ్ళని చేరుకున్నాడు.

ఆ స్త్రీ వేగంగా నడిచివస్తోంది ఆవరణలో. "రాజేశ్వరి—" అంది సరళ మెల్లగా. లాల్ తలూపాడు. రాజేశ్వరికి ముప్ఫై లోపు వుంటుంది వయసు. అత్యంత ఆకర్షణీయంగా అలంకరించుకుంది. ఆమె వాళ్ళని చేరుకొని ప్రశ్నార్థకంగా చూసింది. తర్వాత సరళవైపు తిరిగి కోపంతో కసిరింది, "ఎక్కడున్నావు నువ్వు?"

సరళ తటపటాయించింది. "ఆయన.... ఆయన కనిపించటం లేదక్కా!"

"తెలుసు! అతన్ని నువ్వే లేపుకుపోయావనుకున్నాం!"

"మీరు కాస్త మర్యాదగా మాట్లాడాలి, మాడమ్" జాన్ అన్నాడు.

"మీరెవరు మాకు సత్యలా?"

"లాల్ అండ్ జాన్, హైదరాబాద్. సరళ తరఫున వచ్చాం. మేం మీవారితో మాట్లాడాలి, ఆయనెక్కడున్నారో పిలవండి."

ఆమె గిరుక్కున సరళవైపు తిరిగింది. "నువ్వు....! నువ్వెంతకు తెగించావు! డిటెక్టివ్‌లని తెచ్చి బెదిరిస్తున్నావా? దీని ఫలితం తెలుసా నీకు?"

"నా కనవసరం!" అరిచింది సరళ తీవ్రంగా, "ఈ పాడు ఆస్తీ డబ్బూ మీరే అనుభవించండి! మాకొద్దు? నా ఆలోచనలు వేరే వున్నాయి, నేను కొన్ని అనుమానాలు తీర్చుకోవాలి!"

"ఏ అనుమానాలు?"

"మామయ్య చావు గురించి.... ఆయన నిజంగా ఎలా చనిపోయారో తెలుసుకోవాలి!"

"నువ్వు.... నువ్వేం మాట్లాడుతున్నావో తెలుసా? ఇది మీ మరిదిగారికి తెలిస్తే మీ ఇద్దర్నీ కలిపి—"

"ఏంచేస్తాడక్కా? ఏంచేస్తాడు? రమ్మను ముందుకు! ఆయనెంత మూర్ఖుడో ముఖంమీద చెప్పేస్తాను!"

"ఎంత ధైర్యం! నీకెంత ధైర్యం వచ్చింది! నువ్వీ ఇంటి కోడలు సరళేనా? ఈ ఇంటి గౌరవం నిలపవలసిన దానివేనా? వీధికెక్కి ఇలా పరాయివాళ్ళతో దండయాత్రకొస్తావా! మమ్మల్ని ధిక్కరిస్తావా! నువ్వెంత బరితెగించిపోయావు నిజంగా!"

"అక్కా! నీ మాటలు జాగ్రత్త!" సరళ ఆవేశంతో ముందుకెళ్ళింది.

హఠాత్తుగా వెనుక స్కూటర్ చప్పుడైంది. డిటెక్టివ్‌లు తిరిగి చూశారు. స్కూటరు కారుప్రక్కగా వచ్చి ఆగింది. దానిమీద ముప్పై ఏళ్ల యువకుడు దిగి గబగబా వచ్చాడు, "ఏమిటిది? ఎవరు మీరు?" అంటూ.

డిటెక్టివ్‌లు అతన్ని చూశారు. తెల్లగా పొడుగ్గా వున్నాడు. నున్నగా గీసుకున్న గడ్డం, నల్లటి కళ్ళు' విశాలమైన నుదురు.

"చూడండి!" రాజేశ్వరి అంది ఉద్రేకంగా, "ఈ మెగారు హైద్రాబాద్ వెళ్ళింది మగరాయుడిలా! ఈ మొనగాళ్లని వెంటబెట్టుకొచ్చింది—డిటెక్టివ్‌లట!"

అతను డిటెక్టివ్‌లను ఎగాదిగా చూశాడు. తర్వాత సూరిపండువైపు చూశాడు-వీళ్లని ఎలా రానిచ్చావన్నట్టు.

అప్పుడు సరళని చూశాడు నిరసనగా. "సుధీర్ ఇక్కడికి రాలేదు. ఈ డిటెక్టివ్‌లని వెళ్ళిపొమ్మను వెంటనే!"

"వాళ్ళు వేరే పనిమీద వచ్చారు" అంది సరళ తల వంచుకొని.

"ఈ మెకు మనం హంతకులమని అనుమానమట! వింటున్నారా?" అంది రాజేశ్వరి వ్యంగ్యంగా "మీ నాన్నగారు చంపబడ్డారట! వినండి ఇంకేం చెప్తుందో?"

"నువ్వెళ్ళు రాజీ!" సురేష్ అన్నాడు కఠినంగా.

"వీళ్లందర్నీ మీరు.—"

"మాట్లాడకు నువ్వు, వెళ్ళిపో ఇక్కడ్నుంచి!". అరిచాడు సురేష్ అసహనంగా.

రాజేశ్వరి రుసరుసలాడుతూ ఇంట్లోకెళ్ళిపోయింది.

"సరళా, నువ్వు కూడా!" సురేష్ అన్నాడు మళ్ళీ.

"నేనేందుకు?"

"ష్, ఏమిటీ న్యూసెన్స్! ఏమైంది మీకివాళ? చిన్న విషయానికి ఎందుకిలా కీచులాడుకుంటారు?"

సరళ మౌనంగా ఇంట్లోకి నడిచింది.

సురేష్ డిటెక్టివ్‌లవైపు తిరిగాడు, "బహుశ మీకు తెలిసే వుంటుంది, మా కుటుంబ విషయాలు బయటికి వెళ్ళడం నేను సహించను. మా తండ్రి చావు విషయంలో గానీ, నా తమ్ముడు విషయంలోగానీ మీరు కలగజేసుకుంటే నేను తీవ్రమైన చర్య తీసుకుంటాను."

"సుధీర్‌ని మీరు గాలిస్తున్నారా?" అడిగాడు లాల్ ప్రశాంతంగా.

"లేదు. నేను పోలీసులకి చెప్పలేదు, ఎవరికీ చెప్పలేదు. ఇది నలుగురికీ తెలిసి మేమింకా తలెత్తుకోలేని పరిస్థితి రాకూడదు. సుధీర్ తప్పక తిరిగి వస్తాడు. అంతా సర్దుకుంటుంది. మీరు దయచేసి వెళ్ళిపోండి!"

"సుధీర్ ఏ వుద్దేశ్యంతో పారిపోయాడో చెప్పలరా?"

"మామధ్య కొన్ని మనస్పర్థలొచ్చాయి. ఆ కోపంతో వెళ్ళిపోయాడు. ఇప్పుడు తిరిగివస్తే మేం శాంతియుతంగా పరిష్కరించుకుంటాం."

"సరళ మీ నాన్నగారి చావుని అనుమానిస్తోంది...."

"నాన్నగారు ప్రమాదవశాత్తున చనిపోయారు. సరళ దాన్ని తమ ప్రయోజనాల కోసం ఎక్స్‌ప్లాయిట్ చేస్తోంది."

"ఆయన చనిపోయారనుకుంటున్న సమయంలో ఆయన సజీవంగానే వున్నారు."

"అంటే?"

"ఆయన ఏ సమయంలో మరణించారో మీకు తెలుసు

కానీ అదే సమయంలో ఆయన గదిలో గురక విన్నది సరళ."

లోపలినుంచి హఠాత్తుగా అరుపులు వినిపించసాగాయి....

సురేష్ ఉలిక్కిపడ్డాడు. అతని ముఖంలో రంగులు మారాయి.

"సరళ తెలివి మీరుతోంది! ఆమెతో నేను మాట్లాడతాను, మీరు వెళ్ళండి."

"కానీ ఆ రాత్రి మీరు—"

"నేనింకేమీ వినను, ప్లీజ్! ఇంట్లో ఆ అరుపులు వింటున్నారా? ఆడవాళ్ళు అరుచుకునే ఇల్లు అంగడితో సమానం. వాళ్ళని అదుపు చెయ్యాలి. సూరీ, సుబ్బిళ్ళని పంపించెయ్యి!" సురేష్ గిరుక్కున తిరిగి వేగంగా వెళ్ళిపోయాడు.

సూరిపండు డిటెక్టివ్ లని చూశాడు.

"అబ్బాయా, మీరు వెళ్ళిపోండి!" అన్నాడతను కర్కశంగా.

"పోపోవయ్యా, పెద్ద మొనగాడివి!" జాన్ గేలి చేశాడు.

"వెళ్ళిపోండి అబ్బాయా, లేకపోతే ఎత్తి పడేస్తాను!"

"నేను పడేసి తొక్కుతాను."

"అట్లాగా, అయితే చూద్దామా డిటెక్టివ్?"

"చూసుకుందాం కోతిపిల్లా!"

సూరిపండు చెయ్యెత్తాడు, జాన్ కాలెత్తాడు.

లాల్ కల్పించుకొని విడిపించాడు.

# 5

"వెల్, పార్ట్‌నర్. ఇప్పుడేమిటి నీ అయిడియా?" జాన్ అన్నాడు గాగుల్స్ తీసి పరిసరాల్ని చూస్తూ.

సమయం సాయంత్రం అయిదవుతోంది. ఎండతీవ్రత ఇప్పుడిప్పుడే తగ్గుతోంది. చెరువు నిర్మలంగా, ప్రశాంతంగా వుంది. నీటితలంమీద సూర్యకిరణాలు ప్రసరిస్తూ కళ్ళను చెదరగొడుతున్నాయి....డిటెక్టివ్‌లు మెట్లమీద నిల్చుని చూస్తున్నారు.

లాల్ ఆలోచిస్తూ రోడ్డుమీద దూరంగా చూస్తున్నాడు.

"చెప్పు బ్రదర్, రావ్ ఎట్నుంచి వచ్చి పడ్తాడంటావు?" జాన్ అన్నాడు మళ్ళీ.

లాల్ వులిక్కిపడ్డాడు, "రావ్ సంగతి దేవుడెరుగు, ముందు అటు చూడు!" అన్నాడతను రోడ్డుమీద చూపిస్తూ.

ఒక జీపు వేగంగా దూసుకొస్తోంది....

జాన్ వుత్సాహంతో నవ్వాడు, "వెరీ వెల్, మన ఫ్రెండ్స్!"

నిముషంలో జీపు వచ్చి వాళ్ళ దగ్గరాగింది. ఇన్స్పెక్టర్ దిగి మీదమీదకొచ్చారు. సర్కిల్ కోపంతో ఊగిపోతున్నారు.

"అరగంట దాటి నాలుగ్గంటలవుతోంది, మీ బండి ఇంకా ఇక్కడే వుందేమిటి?" గర్జించాడతను.

"మేమెక్కడవుంటే అదక్కడే వుంటుంది" అన్నాడు జాన్.

"మీరిక్కడ వుండకూడదని హెచ్చరించాను!"

"ఇప్పుడేం చేసుకుంటారో చేసుకోండి!"

సర్కిల్ కి పిచ్చి ఆవేశం వచ్చి, ఛాతీమీద చెయ్యివేసి జాన్ ని వెనక్కి తోసేశాడు బలంగా. జాన్ కింద పడిపోయి, మెట్లమీంచి దొర్లుకుంటూ వెళ్ళి నీట్లో పడ్డాడు.

"అరె! అరెరె, ఇన్స్పెక్టర్! ఇదన్యాయం! అక్రమం! దుర్మార్గం!" అరుస్తూ అతను నీటిలోపల అదృశ్యమయ్యాడు.

లాల్ కు కోపం పెరిగింది. మోహన్ బెదిరిపోయి దూరంగా జరిగాడు. లాల్ సర్కిల్ ని సమీపించి అన్నాడు కర్కశంగా, "చూడండి! ఆ చుట్టూ జనం చూస్తున్నారు! మీరేం చేశారో వాళ్ళంతా చూశారు. రేపు సాక్ష్యానికి రావడానికి జంకుతారనుకోండి! వాళ్ళంతా వస్తారు. మీరు శిక్షను తప్పించుకోలేరు. మీరు అక్రమంగా ప్రవర్తిస్తున్నారు. ప్రభుత్వ వుద్యోగులకి ఆటంకాలు కల్గిస్తున్నారు. పరిశోధన సాగకుండా అడ్డుపడుతున్నారు. దీని ఫలితం మీరు చూస్తారు, ఇన్స్పెక్టర్ —"

జాన్ దూరంగా నీటిపైకి తేలి చూశాడు. చెయ్యూపుతూ అరిచాడు సంతోషంగా, "ఇటూ! హే, పార్ట్నర్! ఇటు చూడు!"

లాల్ తిరిగిచూశాడు. జాన్ చేతిలో ఏదో తెల్లగా మెరుస్తోంది.

"గొలుసు, పార్ట్నర్!" జాన్ అరిచాడు మళ్ళీ, "కాలి పట్టాగొలుసు!"

ఈదుతూ మెట్లుచేరుకొని చెయ్యి అందించాడు. లాల్ పట్టి లాగాడు. జాన్ ముద్దగా తడిసిపోయి, నిలువునా నీళ్ళు కారిపోతూ, అలాగే వచ్చి నవ్వుతూ కరచాలనం

చేశాడు సర్కిల్ తో.

"థాంక్స్! మీవల్ల చాలా మేలు జరిగింది!"

మోహన్ ఇంకా కలవరంగా చూస్తున్నాడు.

జాన్ ఆ గొలుసును పూర్తిగా చూపించాడు.

"సిల్వర్! వెండిగొలుసు. దొర్లుతున్నప్పుడు చివరి మెట్టుమీద తగిలింది!"

"దాన్నిలా ఇవ్వండి!" లాక్కోబోయాడు సర్కిల్.

"ఇవ్వకు జాన్!" వారించాడు లాల్. మరుక్షణం అది జాన్ జేబులోకి వెళ్ళిపోయింది.

"ఎం దు కి వ్వ రు, మిస్టర్ లాల్?" మోహన్ ప్రశ్నించాడు అమాయకంగా.

"ఎందుకివ్వమంటే, ఒకటి—" లాల్ వివరించాడు స్పష్టంగా, "ఈ గొలుసును మేం దొంగలించలేదు—రెండు ఇది పోయినట్టు మీకెవరూ రిపోర్టివ్వలేదు. మూడు—దీని స్వంతదారెవరూ ఇప్పుడు క్లెయిమ్ చేయడంలేదు. నాలుగు—దీని స్వంతదారు మీరు కాదు. కాబట్టి దీనిమీద మీకే హక్కూ లేదు."

వాళ్ళిద్దరు బిక్క మొహాలేసుకున్నారు.

"ఆల్ రైట్!" సర్కిల్ అన్నాడు చివరకి, "అలాగే వుంచుకోండి! కానీ ఈ చెరువు దగ్గర మీరేంచేస్తున్నారో చెప్పితీరాలి నాకు!"

"రావుగారు ఎలా వచ్చిపడ్డారో చూస్తున్నాం."

"ఇందాక మీ పార్టనర్ పడటం మాత్రం కాదు!"

"అంటే తోసివేయబడలేదనా?"

"తోసివేయబడ్డారా!" పకపకా నవ్వాడు సర్కిల్, "మీరు క్రైమ్ తప్ప మరొకటి ఆలోచించారా? ప్రతీ దాంట్లోనూ క్రైమ్ ని వూహిస్తూ కంగారు పెట్టేస్తారు ...

ఆయన్ను యెవరు తోశారని మీ ఊహ?"

"శత్రువు. విరోధి. ఆయన నిద్రలో నడచి వస్తు న్నప్పుడు వెంటాడి, ఇక్కడకొచ్చి, తలమీద వెనుక నుంచి కొట్టి, చెరువులో తోసేశారు. ఆయన స్పృహ తప్పి నీట్లో పడ్డారు. ఆ తర్వాత మీకు తెలుసు—చని పోయారు."

"ఆ పాట వింటున్నావా మోహన్, ఎంత బాగుందో?"

"వింటున్నాను సార్, చాలా బాగుంది!"

వాళ్ళిద్దరూ దూరంగా టీ బడ్డీలోంచి వస్తోన్న మల్లీశ్వరి పాట వింటూ ఆనందించసాగారు....

"నా పాట చేదుగా తోచిందనుకుంటాను" అన్నాడు లాల్.

"మీ పాట ఎవరికైనా చేదుగానే వుంటుంది సార్."

"వెల్, మీరు కోరినమీదటే విన్పించాను."

"ఇంకెప్పుడూ అది ఎవరికీ విన్పించకండి!"

"మీ అభ్యంతరమేమిటో సెలవివ్వండి!"

సర్కిల్ మీసాలు దువ్వాడు. గొంతు సరిచేసు కున్నాడు. చెప్పసాగాడు, "మహాశయా, వినండి! మీ పలుకులు మనస్పర్థలు సృష్టించే ధోరణిలో వున్నాయి. ఊళ్ళో సంచలనం లేవదీస్తాయి. అనవసర రాద్ధాంతానికి దారితీస్తాయి—అపోహలూ మనస్తాపాలతో, ఒకరిమీద ఒకరికి అనుమానాలతో, ఊళ్ళో అశాంతి ఏర్పడుతుంది. ప్రజలు అలమటిస్తారు.

"రావుగారికి మీరన్నట్టు విరోధుల్లేరు. శత్రువుల్లేరు. ఆయనమీద కక్ష ఎవరికీ లేదు. ఆయన వ్యక్తిత్వాన్ని,

శీలాన్ని, మంచితనాన్ని, అంతా శ్లాఘిస్తారు. ఆయన్ని గౌరవమర్యాదలతో చూస్తారు. ఆయనంతటి మంచి వ్యక్తి నా జీవితంలో ఎవ్వరూ తటస్థపడలేదు. ఆయన్ని కోల్పోవడం తీరని లోటుగా భావిస్తాను...."

"ప్రొసీడ్!"

"ఆయన్నెవరూ చంపలేదు, చంపలేదు. ప్రమాద వశాత్తు చనిపోయారు, అంతే. మీరిదివరకేదో గురక ప్రస్తావన తెచ్చారు. ఇప్పుడెవరో తోసివేశారంటున్నారు. మీ మాటల్లో నాకు విశ్వాసంలేదు. ఆ రాత్రి ఆయన నిద్రలో నడుచుకుంటూ ఇక్కడికొచ్చారు. ఇక్కడాయన్ను ఎవరూ చూడలేదు."

"కీప్ టాకింగ్."

"ఆయన మేడమీద తన గదిలోంచి కిందకు వచ్చి, ముందు తలుపు తోసుకొని, ఆ తర్వాత బయటకు వెళ్ళి, గేటు కూడా తీసుకొని, రోడ్డెక్కారు. అప్పుడాయన్ను ఇంట్లో ఎవరూ చూడలేదు. ఆయన అక్కడ్నుంచి మెయిన్ రోడ్డు మీదుగా కాకుండా, అంత రాత్రివేళ జనసంచారం వుండదని వెనుక వీధులగుండా నడిచివచ్చారు. అందుకే దారిలో ఎవరికంటా పడలేదు. లేకపోతే దక్కేవారేమో—విధి అలా వ్రాసివుంది."

"ప్రొసీడ్!"

"స్టాప్ యువర్ బ్లడీ ప్రొసీడ్!"

"యూ గో ఆన్ విత్ యువర్ ఫన్నీ థియరీ!"

"ఆల్ రైట్, ఆ విధంగా ఆయినిక్కడకి చేరుకున్నారు. ఇక్కడ కూడా ఆయన్ను ఎవరూ చూడలేదు. దీపాలు లేవు. ఆ రాత్రి చంద్రుడు లేడు. అప్పుడాయనక్కడాగి; నీళ్ళు తాగాలనుకునో, లేక ముఖ కడుక్కో-

వాలనుకునో, లేక అసలు ఏ ఉద్దేశ్యము లేకుండా నే మెట్లు దిగివుండాలి. అప్పుడు కాలుజారి, గాలి కిందపడి, దొర్లుకుంటూ వెళ్ళి సీట్లో పడ్డారు. ఊతరాదు. పైగా అరవటానికి మెలకువ వచ్చి వుండదు. ఏ మెట్టుకో తల కొట్టుకొని స్పృహ తప్పి వుంటుంది. అంతే—మునిగి పోయారు. అది అక్సిడెంటల్. అర్థమైందా? దీన్ని మీరింకా హత్యగా ఎలా నిరూపిస్తారో నా కర్థంగావడం లేదు—" ఆపి పెద్దగా నవ్వాడు సర్కిల్.

"మీరు నవ్వండి. ఇన్స్పెక్టర్ జనం చూస్తారు!" అరిచాడు లాల్ అక్కడ్నుంచి వెళ్ళిపోతూ. కారెక్కి సారుచేసి జాన్ని పిల్చాడు. జాన్ వచ్చి కూర్చున్నాక వెంటనే పోనిచ్చాడు.

వెళ్ళిపోతున్న డిటెక్టివ్‌లని చూసి ఇన్స్పెక్టర్లు హేళనగా నవ్వసాగారు.

డిటెక్టివ్‌లు కొంతదూరం నిశ్శబ్దంగా ప్రయాణించారు. అప్పుడు జాన్ జేబులోంచి ఆ గొలుసును తీశాడు.

"పార్ట్‌నర్!" అన్నాడు దాన్ని లాల్ కళ్ళముందు వూపుతూ, "ఈ గొలుసు—ఏ భామామణి పాదపద్మము నుండి రాలిన పుప్పొడి రేణువో కదా!"

లాల్ తలూపాడు, "ఆ పాదపద్మం కొరకు భామా మణుల్ని ఆదేపనిగా చూడకు ఇక్కడి వాతావరణం నీకు పడదు."

"ఏమవుతుంది?"

"రాలుతాయి."

"ఏమిటవి?"

"పళ్ళు మైడియర్ పార్ట్‌నర్, యువర్ టీత్."

"వెల్, అయితే ఈ గొలుసు ఎవరిదంటావు? దీన్ని

చూస్తే ఆ స్త్రీ డబ్బుగలదనిపిస్తోంది. కాని చెరువు ప్రాంతాల ఎవరూ డబ్బుగలవాళ్ళు నివశించడంలేదు. ఎవరక్కడ ప్రత్యేకంగా వెళ్ళి దీన్ని పోగొట్టు కున్నారు?"

"సరళ కాళ్ళకి నువ్వు గొలుసులు చూశావా?"

"లేదు. ఒక గొలుసు పోతే ఒంటికాలికి గొలుసుతో తిరుగుతారా? కాదు, ఆమెకు ఈ గొలుసులతో అలవాటు లేదు."

"రాజేశ్వరి?"

"అలా చెప్పు బాగుంది! ఆమె మేకప్ చూస్తే తప్పక ధరిస్తుందనిపిస్తుంది.... లెట్స్ గో, వెళ్ళి అడుగుదాం!"

"ఈ వేషంలోనా? ముందు హోటల్ కెళ్దాం. నువ్వు బట్టలు మార్చుకో. తర్వాత ఆమె దగ్గరికెళ్దాం."

# 6

హోటల్ కి వచ్చిన డిటెక్టివ్లని చూసి కౌంటర్ లోని వ్యక్తి అన్నాడు. "సార్, ఇందాక మీకు ఫోన్ వచ్చింది. సరళ గారట, మిమ్మల్ని అడిగారు. లేదని అంటే వచ్చిన వెంటనే ఇంటికి రమ్మని చెప్పమన్నారు."

"ఆమె ఎలా మాట్లాడింది?" అన్నాడు లాల్.

"కంగారుగా.... చాలా భయంగా!"

డిటెక్టివ్ లు ఒకర్నొకరు చూసుకున్నారు. జాన్ పైకి పరుగెత్తి అయిదు నిమిషాల్లో దుస్తులు మార్చుకొని వచ్చాడు. తిరిగి కారెక్కి బయల్దేరా రిద్దరూ.

"ఏం జరిగివుంటుంది... సుధీర్ వచ్చాడా?" అన్నాడు జాన్.

లాల్ మాట్లాడలేదు. అతివేగంగా డ్రైవ్ చేశాడు.

పదినిముషాల్లో రావ్ ఇంటి ఆవరణలో కారు దిగారు. అక్కడ పోలీసు జీపువుంది. వరండాలో ఇన్స్పెక్టర్లు కన్పించారు....

వేగంగా వాళ్ళని చేరుకున్నారు. వాళ్ళు నిప్పులు కురిపిస్తూ చూశారు. సర్కిల్ అన్నాడు ఎగతాళిగా, "వచ్చారా? రండి, రండి! మీ కోసమే చూస్తున్నాం! అంతా మీ చలవే, జంటిల్ మెన్!"

"ఏం జరిగింది, ఇన్స్పెక్టర్?" లాల్ అన్నాడు కోపంగా.

"ఏం జరిగిందా! జరగని హత్యని పరిశోధిస్తామని వుబలాటపడ్డారు....ఇప్పుడు నిజంగానే హత్య జరిగింది!"

"ఎవరి హత్య, ఇన్స్పెక్టర్?"

"ఇంకెవరిది! రాజేశ్వరిది! తెలియనట్లు మాట్లాడకండి! మీకంతా తెలుసు! పథకం ప్రకారం పనులు జరిపిస్తున్నారు! క్లయంట్ తో కుమ్మక్కయి కుట్రలు చేస్తున్నారు! మీ క్లయిమాక్స్ దగ్గర పడిందిప్పుడు! మీ జాట్టు చేతికి చిక్కిందిపుడు! వెళ్ళి జీపెక్కి కూర్చోండి, కమాన్—"

"పార్టనర్, షాక్ ట్రీట్ మెంట్" జాన్ అన్నాడు.

లాల్ తలూపాడు. జేబులోంచి కవరుతీసి సర్కిల్ కిచ్చాడు.

సర్కిల్ ఇన్స్పెక్టర్ దాన్ని విప్పి చదివాడు. హఠాత్తుగా అతను ఉలిక్కిపడ్డాడు. ముఖం వివర్ణమైంది. కంగారుగా డిటెక్టివ్ లని చూశారు. వెంటనే అతని కళ్ళలో అభిమానం పెల్లుబికింది. మెరుపు వేగంతో కరచాలనం చేశాడు—

"ఏమి అదృష్టం! ఏమి అదృష్టం! గ్లాడ్ టు మీట్యూ

మిస్టర్ లాల్! గ్లాడ్ టు మీట్యూ మిస్టర్ జాన్! అయాం వెరీ గ్లాడ్! మిమ్మల్ని కలుసుకోడం మిక్కిలి ఆనందంగా వుంది! మీ గురించి విన్నాను చాలా! బలే స్నేహంగా వుంటారు మీరిద్దరూ! వుండవలసినవారు, జాతికి అవసరం! మీతో కలిసి పనిచేసే భాగ్యం ఎప్పు డెప్పుడా అని ఎదురుచూశాను! అదిప్పుడు లభించింది! నాకిప్పుడు వెరీ హేపీగావుంది!"

"నాకూ అలాగేవుంది—" అన్నాడు లాల్.

"కానీ మీరీ విషయం ముందే ఎందుకు చెప్పలేదు?" మోహన్ అడిగాడు అమాయకంగా.

"మీతో సరసం మాకు సరదాగా తోచింది" చెప్పాడు జాన్.

"స్నేహితులం మనం!" సర్కిల్ మరోసారి చెయ్యి కలిపాడు, "మోహన్! రాత్రి స్నేహితులకి విందు!"

"ఎంత భాగ్యం, సార్!"

"ముందు శవం" అన్నాడు లాల్.

సర్కిల్, లాల్ నడుము చుట్టూ చెయ్యివేశాడు, "పదండి! మీ కోసమే నిరీక్షిస్తున్నాం!"

అంతా కలిసి ఇంట్లోకి నడిచారు. మోహన్ అమాయ కంగా అడుగుతున్న ప్రశ్నలకి జాన్ బవాబులు చెపుతున్నాడు. హాల్లో సరళ ఏడుస్తూ కూర్చునుంది. ఆమె ప్రక్కన సురేష్ వున్నాడు. సోఫా వెనుక సూరిపండు నిల్చున్నాడు.

లాల్ని చూసి సరళ లేచిరాబోయింది. లాల్ వారిస్తూ కూర్చోమన్నాడు. అందరూ ఇంటి వెనుక నడిచారు. సర్కిల్ బాత్రూంవైపు దారితీశాడు. అక్కడొక కానిస్టేబిల్ వున్నాడు.

"స్నానానికి వెళ్ళినపుడు లోపలవుండి పొడిచాడు" అన్నాడు సర్కిల్, బాత్ రూం తలుపు తెరుస్తూ.

"ఎవరు?" అన్నాడు లాల్ లోపలికి చూస్తూ.

ఆమె గచ్చుమీద వెల్లికిలా పడివుంది. ఆమె నోట్లో టవల్ కుక్కబడివుంది. కళ్ళు వెలికి వచ్చాయి. చేతులు పిడికిళ్ళు కట్టుకున్నాయి. ఆమె గుండె ప్రాంతాల రెండు కత్తిపోట్లున్నాయి. రక్తం నేలమీద విశాలంగా మడుగు కట్టింది.

"సుధీర్!" అన్నాడు సర్కిల్ లాల్ ప్రశ్నకు బవాబుగా.

"ఎవరన్నారు?" అన్నాడు లాల్ మామూలుగా.

"సూరిపండు చెప్పాడు—అతను చూశాడట. అప్పుడు సుధీర్ బాత్ రూంలోంచి వచ్చి పరిగెడుతున్నాడు, పెరటి తలుపు దగ్గరికి సూరిపండు పిల్చినా ఆగకుండా తలుపు తీసి పారిపోయాడు వీథిలోకి. కానీ వీధిలో అత న్నెవరూ చూడలేదంటున్నారు. కానిస్టేబిల్స్ని పంపాను. గాలిస్తున్నారు."

"ఎంత సేపయింది?"

"అరగంటయింది, అంతే. డాక్టర్కి ఫోన్ చేశాను. అతనొచ్చాక శవాన్ని తొలగించి బాత్ రూంని సీలు చేస్తాం. విజయవాడనుంచి ఎక్స్పర్ట్స్ వచ్చాక ఎవిడెన్స్ సేకరిస్తాం, వేలిముద్రలు వగైరా."

"హత్యాయుధం దొరికిందా?"

"పట్టుకెళ్ళిపోయాడు."

"వెల్, ఈసారి పోస్టుమార్టమ్ సక్రమంగా జరుగుతుందనుకుంటాను."

"జరుగుతుంది. ఇది ప్లెయిన్ మర్డర్. ఓపెన్ మర్డర్.

శవాన్ని ఈ రాత్రి హాస్పిటల్ లో వుంచి తెల్లారి పోస్టు మార్టమ్ జరుపుతాం. మీకు తెలుసు, రాత్రివేళ పోస్టు మార్టమ్ జరపకూడదు."

"తెలుసు," అన్నాడు లాల్, జాన్ తో దూరంగా కదుల్తూ, "ఆ గొలుసు ఏది? ఇలా ఇవ్వు."

"దేనికి?" అన్నాడు జాన్, దాన్ని తీసిస్తూ.

లాల్ దాన్ని వూపుతూ చూపించాడు, "ఈ హత్యకు ప్రేరణ ఈ గొలుసు. ఇది మనకి దొరికినట్లు ఎవరికో తెలిసింది. ఈమె నోరు మూసేశారు. నువ్వెంటనే వెళ్లు! చెరువు దగ్గర సాయంత్రం మనల్ని కనిపెట్టిందెవరో తెలుసుకో. మనమీద ఎవరు గూఢచారత్వం నెరపుతున్నారో కనుక్కో!"

జాన్ తలూపాడు, "కానీ ఈ కమెడియన్స్ సుధీర్ ని ...."

లాల్ ఇన్స్పెక్టర వైపు చూశాడు, "ఆ కమెడియన్స్ అలాగే అంటారు. నేను వాళ్ళ థియరీని పరిశీలిస్తాను. నువ్వు నా థియరీ సంగతి చూడు,"

జాన్ తలూపి కదిలాడు.

లాల్ హాల్లోకి నడిచాడు. అప్పుడే డాక్టర్ హడావుడిగా వస్తూ ఎదురయ్యాడు.

"ఓహ్, ఈ ఇంట్లో ఏం జరుగుతోంది! ఏమిటీ వైచిత్రి?"

"వైచిత్రి కాదు, విపరీతం అనండి" సవరించాడు లాల్.

డాక్టర్ ముఖం నిస్తేజంగా వుంది. వెంటనే కదిలి వెళ్ళిపోయాడు.

లాల్ సురేష్ ప్రక్కన వెళ్ళి కూర్చున్నాడు. సురేష్

తలెత్తి ఎర్రబారిన కళ్ళతో విషాదంగా చూశాడు.

"అయాం సారీ, సో సారీ...." లాల్ పరా మర్శించాడు.

సురేష్ అన్నాడు ఆవేదనగా. "మీ రెండుకొచ్చా రిక్కడికి, లాల్? మా నాన్న చావుని ఎందుకు కదిపి ఈ కలకలం సృష్టించారు? సరళ హైద్రాబాదు వెళ్ళడం వల్లనే సుధీర్‌కు తప్పించుకునే వీలుచిక్కింది. వాడిలా చేశాడు! నేను వూహించను కూడా లేను. వాడిప్పుడు కత్తి కూడా పట్టుకెళ్ళాడంటే ఇంకెవరిమీదో కూడా కక్ష తీర్చుకుంటాడు!"

"మీరలా అనుకోకండి, సురేష్. మీ తమ్ముడిక్కడికి రాలేదు."

"సుధీర్ ఇక్కడికి రాలేదా?"

"నేను చూశాను అబ్బాయా, పారిపోతుంటే" నూరిపండు అన్నాడు.

"ఎలా చూశావు? ఎట్నుంచి? ముందునుంచా, వెనుక నుంచా?" అడిగాడు లాల్.

"మొదట ముందునుంచి చూశాను, అబ్బాయా! అప్పుడు బాత్‌రూంలోంచి వస్తున్నాడు, చేతిలో రక్తంతో తడిసిన కత్తివుంది! నన్ను చూసి, నేను పిలుస్తున్నా ఆగకుండా పారిపోయాడు, పెరటి తలుపు తీసుకొని."

"కానీ వీధిలో ఎవరూ చూడలేదట....?"

"అప్పుడు వీధిలో యెవరూ లేరు, అబ్బాయా!"

"నువ్వెంత దూరం వెంటాడావు? అబ్బాయా అనకు నన్ను!"

"వీధి చివరిదాకా వెళ్ళాను, డిక్షిగారూ. కనిపించ

లేదు."

"సుధీర్ వచ్చాడు, లాల్. ఇది వాడి పనే!" సురేష్ అన్నాడు.

లాల్ అతన్ని పరీక్షగా చూశాడు.

"మీ తమ్ముడు మీలాగే వుంటాడా, సురేష్?"

అతను వులిక్కిపడి చూశాడు. "ఎందుకలా అడిగారు?"

"సమాధానం చెప్పండి."

"అవును, మాకు చాలా దగ్గర పోలికలున్నాయి."

"ఆ గోడమీద ఫోటోలో మీ తల్లిదండ్రులు కదూ?"

"అవును."

"మీ రంగు, రూపురేఖలు తల్లిగారివి వచ్చాయి."

"అవును. నాకప్పుడు పద్దెనిమిదేళ్ళు, అమ్మ పోయినపుడు."

"ఆ సమయంలో మీరెక్కడున్నారు?"

"అమ్మ పోయినప్పుడా!"

"మీ ఆవిడ పోయినప్పుడు."

"ఓహ్, పైన గదిలో వున్నాను! మీరు కంగారు పెట్టేస్తున్నారు...."

"మీరక్కడ వున్నట్టు నిరూపించుకోగలరా?"

"నిరూపించుకోలేను."

లాల్, సూరిపండుని చూశాడు. "హంతకుడ్ని ఎలాంటి దుస్తుల్లో చూశావు?"

"ఆకుపచ్చ షర్టు, నల్లటి ప్యాంటు—డీకిష్టి గారూ."

"మీరప్పుడు ఏ దుస్తుల్లో వున్నారు?" లాల్ అడిగాడు సురేష్ని.

"ఈ గుస్తుల్లోనే! ఇవి హంతకుడి రకం గుస్తులు కావు!"

సరళ చటుక్కున ముందుకి వంగింది. ఏదో చెప్ప బోతూ లాల్ సౌజ్ఞకి ఆగిపోయింది.

లాల్ జేబులోంచి పట్టా గొలుసు తీశాడు.

"ఈ గొలుసెవరిదో గుర్తుపట్టండి!" అన్నాడతను అందరికీ చూపిస్తూ.

సురేష్ కంగారుపడ్డాడు. సరళ కళ్ళు పెద్దవిచేసింది. నూరిపండు తటస్థంగా నిల్చున్నాడు.

"ఇది రాజీది!" సురేష్ అన్నాడు గట్టిగా.

"గుడ్, ఎంతకాలంనుంచి ఇది కన్పించడంలేదు?"

"ఏమో, నేను గమనించలేదు. కానీ ఇది ఆమెదే! ఎక్కడ దొరికింది?"

"మీ నాన్నగారు పడిపోయినచోట, సురేష్. చెరువులో."

"చెరువు.... చెరువులోనా!"

"అవును, అక్కడికెలా వెళ్ళిందో చెప్పగ్గలరా?"

"తెలీదు! ఆమె సాయంత్రాలు షికారు వెళ్తుంది.... బహుశా ఎప్పుడైనా...."

"ఐసీ....మీ తండ్రి చనిపోయిన రాత్రి మీరెక్క డున్నారు?"

"ఇంట్లోనే!"

"ఏం చేస్తున్నారు?"

"నిద్రపోతున్నా!"

"మధ్యలో లేవలేదా....?"

"ఎందుకు? ఆ రాత్రి నాకెందుకో గాఢంగా నిద్ర పట్టేసింది."

"ఎందుకు పట్టింది?"

"తెలీదు! తల దిమ్మెక్కినట్లనిపించింది ... పగలు బాగా అలసిపోయానేమో."

లాల్ అతన్నే చూస్తూండిపోయాడు కాస్సేపు. అప్పుడు డాక్టర్, ఇన్స్పెక్టర్లు హడావుడిగా వచ్చి లాల్ దగ్గర సెలవు తీసుకొని, శవంతో వెళ్ళిపోయారు బయటికి. సురేష్, సూరిపండు కూడా వాళ్ళని అనుసరించారు.

లాల్ సరళ వైపు తిరిగాడు చటుక్కున "వెల్, మీరేం చెప్పదల్చుకున్నారిందాక?"

"సూరిపండు అబద్ధం చెప్పాడు!" అందామె వెంటనే.

"ఏం చెప్పాడు?"

"మావారికి నల్ల ప్యాంటు వుందిగానీ, ఆకుపచ్చ షర్టు లేదు!"

"లేదా?"

"లేదు.... లేనేలేదు!"

ఫోన్ మ్రోగింది హఠాత్తుగా. లాల్ వెళ్ళి రిసీవ రెత్తాడు.

"యస్, జాన్?"

"సూరిపండు సాయంత్రం అయిదు గంటలకి చెరువు దగ్గర టీ కొట్లో వున్నాడు."

"వెరీ వెల్, పార్ట్నర్!"

"నేను ఒడ్డుకి రాగానే అది చూసి కంగారుగా వెళ్ళిపోయాడట."

"వండర్ఫుల్! అతనిక్కడే వున్నాడు, నువ్వికక్కడ కొచ్చి నిఘావుండు!"

ఫోన్ పెట్టేసి సరళ చెయ్యి అందుకున్నాడు. "మీతో ఏకాంతంలో మాట్లాడాలి. పైకెళ్దాం, రండి!"

ఆమె లాల్‌తో మేడమీదకి వురికింది. లాల్ ఒక గదిలోకి వెళ్ళి కిటికీ తెర ప్రక్కకు లాగి బయటకు చూశాడు. క్రింద జీపులోకి వాళ్ళు శవాన్ని ఎక్కిస్తున్నారు. సురేష్ మోహన్‌తో ఏదో మాట్లాడుతున్నాడు. ఓ ప్రక్కగా, వెలుతురు లేనిచోట నిల్చున్నాడు డాక్టర్. సూరిపండు నెమ్మదిగా కదిలి అతన్ని సమీపించాడు. ఇద్దరూ బాగా చేరువయ్యారు. క్షణకాలంలో ఒక వస్తువు చేతులు మారింది చీకట్లో. అది సూరిపండు జేబులోకి వెళ్ళింది. వెంటనే వాళ్ళిద్దరు విడిపోయారు....

లాల్ తెర లాగేశాడు.

## 7

"వెల్, మీకా గురక ఎలా వినిపించింది?" అడిగాడతను, సరళవైపు తిరిగి.

"అంటే?" అందామె అర్థంగాక చూస్తూ.

"అది మీ మామగారిదేనా?"

"అవును, అది మామయ్యదే!"

"ఎంతసేపు విన్నారు?"

"ఒక అరనిమిషంపాటు....కానీ స్పష్టంగా విన్నాను. అది ఆయనదే!"

"మధ్యాహ్నం మీరూ రాజేశ్వరి ఎందుకు అరుచుకున్నారు?"

"ఆమె నాకు పేర్లు పెడుతోంది! ఆయన వచ్చి లాక్కెళ్ళి పైన గదిలో బాగా తిట్టారు. ఆ తర్వాత ఏం జరగలేదు."

"వెల్, జాన్ నా కోసం ఫోన్ చేస్తే డాక్టర్ ఇంటికి వెళ్ళానని చెప్పమనండి."

"డాక్టర్ ఇంటికా!" అందామె అయోమయంగా.

లాల్ ఆమె భుజంమ్మీద చెయ్యివేసి తట్టాడు. ఆమె కళ్ళలోకి తీక్షణంగా చూశాడు, "భయపడకండి మీ వారు ఏమీ చెయ్యలేదు. వాళ్ళు వూరికే నింద వేస్తున్నారు. ఈ హత్య గురించి తెలిస్తే ఆయనెక్కడున్నా తప్పక తిరిగొస్తారు."

"మీరు లేకపోతే నేనేం చేసేదాన్నో వూహించలేను లాల్. మీరున్నారన్న తలంపుకే నాకు ధైర్యం చిక్కుతోంది ..." అందామె కృతజ్ఞతగా.

లాల్ మరోసారి తట్టాడు. "గుడ్, నిర్భయంగా వుండండి. నేను డాక్టర్ ఇంటికి వెళ్ళినట్టు ఎవరికీ చెప్పకండి, జాన్‌కు తప్ప."

లాల్ క్రిందకు దిగివచ్చి ఆవరణలో కారు దగ్గరికి నడిచాడు. అప్పటికి జీపు వెళ్ళిపోయింది. అక్కడెవరూ లేరు. కారులోంచి మారుతాళాలు తీసుకొని, ఓసారి చుట్టూ చూసి, గేటుతీసుకొని వేగంగా రోడ్డెక్కాడు. వీధి తలుపు దగ్గర వెనకనుంచి అరుపు వినిపించింది. "యూ పార్టనర్!"

ఆగిపోయి వెనక్కి చూశాడు. జాన్ చీకట్లోంచి కదిలివచ్చాడు.

"యస్, పార్టనర్?" లాల్ అన్నాడు.

"ఎక్కడికి జారుకుంటున్నావ్, రెండు కాళ్ళమీద?"

"బ్రేకింగ్ న్యూస్, నూరిపండు, డాక్టర్‌లమధ్య వస్తుమార్పిడి జరిగింది. డాక్టర్ దాత, గ్రహీత నూరిపండు, భావం నువ్వర్థంజేసుకో."

"బ్రదర్! పాపం బద్దలైంది కదూ?"

లాల్ తనెక్కడికి వెళ్తున్నదీ చెప్పి కొన్ని సూచన లిచ్చి బయల్దేరాడు.

దార్లో ఇద్దరు ముగ్గుర్ని కనుక్కొని ఇరవై నిముషాల్లో డాక్టర్ గృహప్రవేశం చేశాడు, మారుతాళాలతో. డ్రాయింగ్ రూంలో లైటువేసి కూర్చుని, టేబిల్ మీద ఫోన్ అందుకున్నాడు. డైరెక్టరీ తిరగేసి ఒక నెంబర్ డయల్ చేసి, "హలో, సివిల్ హాస్పిటల్?" అన్నాడు.

"యస్, ఎవరు కావాలి?" అంది అవతలి ఆడ గొంతు.

"డాక్టర్ ఏం చేస్తున్నారు?"

"బిజీగా వున్నారు, ఇప్పుడే బాడీ వచ్చింది."

"పోలీసులున్నారా?"

"సర్కిల్ గారున్నారు."

"ఫోనందుకోమనండి!"

సర్కిల్ లైనులోకొచ్చి అన్నాడు, "హలో ఎవరు మీరు?"

"నేను లాల్ ని, ఇన్స్పెక్టర్. డాక్టర్ని అక్కడ కొంతసేపు ఆపగలరా?"

"ఎందుకు? మీరెక్కడున్నారు?"

"తర్వాత చెప్తాను. నేను తిరిగి ఫోన్ చేసేవరకు అత న్నక్కడ ఆపండి."

ఫోన్ పెట్టేసి లాల్ లేచాడు. ఫ్రిజ్ దగ్గరికెళ్ళి ఒక బీర్ బాటిల్ ఖాళీచేశాడు. ఉత్సాహం తెచ్చుకుని గదిని పరిశీలనగా చూశాడు. కుడివైపు షెల్ఫు దగ్గరికి నడిచాడు. దానిమీద స్టీరియో టేప్ రికార్డర్ వుంది. దాని మీట నొక్కి చూశాడు. 'ఇది మౌనగీతం....'

అంటూ సన్నగా మొదలైంది పాట. వింటూ కేసెట్ బార్‌లో కేసెట్లని పరిశీలించాడు. ఏదో తట్టినట్లయి వులిక్కిపడ్డాడు. వాటిని ఇక పరిశీలించడం విరమించుకుని తిరిగివచ్చి కూర్చున్నాడు.

అప్పుడు టేబిల్ సొరుగు లాగి వెతకసాగాడు. అందులో అన్నీ ఏవో కాగితాలూ, మెడికల్ జర్నల్సూ కుక్కివున్నాయి. అన్నీ కెలికి చూశాడు. ఒక డైరీ కనిపించింది. కానీ అది డైరీకాదు, అందులో ఆత్మ కథ లేదు. పేజీలు తిరగేశాడు. ఏవో లెక్కలూ, నెంబర్లూ, చిరునామాలూ వున్నాయి. ఒకచోట ఆగిపోయాడు. ఆ పేజీల మధ్య ఒక చిన్న స్లిప్ వుంది. దాన్నందు కున్నాడు. అది రిజిష్టర్ లెటర్ పంపిన పోస్టల్ రశీదు. కపాడియా అనే పేరుతో కలకత్తా అడ్రసుకు వుంది.

ఆలోచిస్తూ ఇంకా పేజీలు తిప్పాడు.... ఒకచోట కపాడియా అడ్రసూ, ఫోన్ నెంబరూ వున్నాయి. పోస్టల్ రశీదుమీద తేదీ చూశాడు. మూడు నెలల క్రితానిది. చకచకా కింది సొరుగులాగి ఇంకా వెతికాడు. నిండుగా వున్న చిత్తుకాయితాల అడుగున ఒక కవరు దొరికింది. అందుకొని విప్పి చూశాడు. అతని ముఖం వెలిగింది. అందులో రెండు ఫోటో నెగెటివ్‌లున్నాయి. అవి రెండు భంగిమల్లో తీయబడ్డ బస్ట్ సైజు చిత్రాలు. వాటిని వెలుతురుకు పెట్టి రూపాన్ని చూశాడు. భూపతి రావ్.

నిమిషం తర్వాత అతను ఎక్స్ఛేంజికి ఫోన్ చేసి మాట్లాడసాగాడు. ఒక నెంబర్ ఇచ్చి కలకత్తాకు ట్రంకాల్ కోరాడు, డాక్టర్ జనార్థన్ తరఫున. అర గంట పడుతుందన్నాడు ఆపరేటర్. డిస్కనెక్టు చేసి

సరళకు ఫోన్ చేశాడు.

"జాన్ ఇంకా రాలేదు, లాల్!" అందామె వెంటనే.

"నెవర్ మైండ్, మీ డాక్టర్ ఆ మధ్య ఊరు వెళ్ళాడా.... దూరప్రాంతాలకి?"

"వెళ్ళాడొకసారి, మూడు నెలలక్రితం, కలకత్తాకి. ఎందుకు?"

"దేనికి వెళ్ళాడో తెలుసా?"

"తెలీదు."

"అతనికి హిందీ వచ్చా?"

"రాదు. మీరేం చేస్తున్నారక్కడ లాల్?"

"ఆలోచిస్తున్నాను సరళ, మర్డర్ ప్లాట్."

# 8

ఆ ఆకారాన్ని చూసి జాన్ నిదానంగా లేచి నిల్చున్నాడు, ఆ ఇంటి అరుగుమీద నుంచి. ఆ ఆకారం పెరటి తలుపు తీసుకొని వీధిలోకి వచ్చింది. ఓసారి అటూ ఇటూ చూసి చటుక్కున ఎడమవైపు తిరిగి సాగి పోయింది వీధిలో, చంకలో చిన్న మూటతో.

జాన్ దాన్ని కొంతదూరం పోనిచ్చి అప్పుడు అనుస రించాడు. మూటని భద్రంగా పట్టుకుని నడుస్తోంది. తల తిప్పకుండా ఆ చీకటి వీధిలోముక్కు సూటిగా సాగి పోతోంది. అప్పుడు జాన్‌ని కంగారుపెట్టేస్తూ చాటు నుంచి హఠాత్తుగా మరో ఆకారం వూడిపడి, మొదటి ఆకారం వెనుక నడవ సాగింది....

జాన్ తేరుకుని, పరిస్థితిని తెలుసుకుని, ఆ రెండు ఆకారాల్నీ కలిపి జాయింటుగా వెంటాడసాగాడు. అలా పోతూ మొదటి ఆకారం అకస్మాత్తుగా లైట్లున్న వీధి రావడంతో, ఠక్కున ఆగిపోయి వెనక్కి చూసింది.

మొదటి ఆకారం తడబడి గోడకతుక్కుంది. జాన్ అక్కడే చెత్తకుండీ చాటున చతికిలబడ్డాడు.

తిరిగి మొదటి ఆకారం వెలుగువున్న వీధిని మెరుపులా దాటేసి చీకట్లోకి వెళ్ళిపోయింది. రెండో ఆకారం కొంత వ్యవధి ఇచ్చి బయల్దేరింది. ఆ తర్వాత జాన్ బయల్దేరాడు.

అలా ఇరవై నిముషాలు సాగిన నడక ఊరవతల చెరువును దాటేసి పొలాల్లోకి, అక్కడ్నుంచి ఆపైన చెరుకు తోటల్లోకి వెళ్ళి అంత మైంది.... అక్కడంతా చిమ్మచీకటిగా, నిర్మానుష్యంగా వుంది....

• • •

"యస్, మిస్టర్ కపాడియా?" లాల్ అన్నాడు, ఆపరేటర్ పరిచయం చేశాక.

అవతలి కంఠం అంది హిందీలో, "యస్, నేను కపాడియాని."

"నేను డాక్టర్ జనార్థన్ ని, శ్రీనగర్ నుంచి మాట్లాడుతున్నాను, ఆంధ్రా" అన్నాడు లాల్ ఇంగ్లీషులో.

"డాక్టర్ జనార్థన్? అంటే....?" అంది అవతలి కంఠం కూడా ఇంగ్లీషులో.

లాల్ నెమ్మదిపడ్డాడు. "గుర్తులేనా? మిమ్మల్ని కలకత్తాలో కలిశాను, మూడ్నెల్ల క్రితం? తిరిగివచ్చి ఫోటోలు కూడా పంపాను."

"ఓహ్, మీరా! గుర్తొచ్చారు....ఎందుకు ఫోన్ చేశారిప్పుడు?"

"ఆ ఫోటోలేంచేశారని అడుగుతున్నాను కపాడియా!"

"ఆ దేమిటి జనార్ధన్, మీ పని చేసిపెట్టాను కదా! నే పంపిన పార్శిల్ మీకు అందినట్టు కూడా రశీదు ముట్టింది. మీరు తృప్తిచెంది డబ్బు కూడా పంపారు."

"ఏ పార్శిల్ గురించి మాట్లాడుతున్నారు మీరు, కపాడియా? నాకు రెండు అందాయి."

"రెండు అందాయా? ఏమిటది, జనార్ధన్! నే నొక్కటే కదా పంపింది, విగ్గూ మాస్కూ కలిపి ఒకే ప్యాకింగ్ లో?"

లాల్ కళ్లు విశాలమయ్యాయి, "మీరు నాకు విగ్గూ మాస్కూ పంపారా!"

"మరేమిటనుకున్నారు? విగ్గూ మాస్కూ!"

"అయితే అవి డాక్టర్ కి అందే వుంటాయి."

"వాట్!"

"సారీ, నేను డాక్టర్ జనార్ధన్ ని కాను."

లైను కట్ చేసి లాల్ హాస్పిటల్ కి ఫోన్ చేశాడు. "ఇన్స్పెక్టర్, మీరు వెంటనే డాక్టర్ తో అతనింటికి రండి!" అన్నాడతను సర్కిల్ తో.

• • •

జాన్ ఆ చోద్యాన్ని ఆసక్తిగా గమనించాడు.

మొదటి ఆకారం అక్కడ మూటకింద పెట్టి కూర్చుంది. రెండో ఆకారం పొదలమాటున నక్కి చూస్తోంది. కొద్దిక్షణాల తర్వాత హఠాత్తుగా గాలిలో కిరసనాయిలు వాసన సోకింది. ఆ వెంటనే మొదటి ఆకారం దగ్గర చిన్న మంట వెలిగింది.... అప్పుడు రెండో ఆకారం ఒక్క వుదుటున వెళ్ళి మొదటి ఆకారంమీదపడి, పక్కకు తోసేస్తూ మూట నందుకోబోయింది. కానీ మొదటి ఆకారం ప్రతిఘటించి, తన బలిష్టమైన

హస్తాలతో ఊపిరాడకుండా చేసింది. రెండో ఆకారం గావుకేక వేసింది.

జాన్ అప్పుడు పరుగున వెళ్ళి, చేతులతో మట్టితీసి మంట నార్పసాగాడు. మొదటి ఆకారం అది మాని అతనిమీద వచ్చిపడింది. జాన్ కాలితో పొట్టలో లాగిపెట్టి తన్ని, వెల్లకిలా పడేసి మీద కూర్చున్నాడు. "కోపిష్టీ! నువ్వింత పాపిష్టివా!" ఆశ్చర్యం ప్రకటించాడతను.

రెండో ఆకారం మూట ఎత్తుకు పరిగెత్తసాగింది.

"సుధీర్! ఆ మూట పడేసి పోలీసుల్ని పిలవండి!" అరిచాడు జాన్, నూరిపండుని ఎడాపెడా పిడికిళ్ళతో బాదేస్తూ.

## 9

"ఆహ్, కమాన్! మిస్టర్ జనార్ధన్, కమాన్!" లాల్ ఆహ్వానించాడు అతన్ని నవ్వుతూ.

డాక్టర్ గాభరాపడి చూశాడు, "మీరు-మీరిక్కడేం చేస్తున్నారు?"

సర్కిల్ ఇంకా కలవరంగా చూశాడు.

లాల్ నవ్వాడు మళ్ళీ. "సిడవున్" అన్నాడతను సిగరెట్ ముట్టించుకుంటూ, "మీతో చాలా మాట్లాడాలి. ఇన్స్పెక్టర్, ఇప్పుడు మీకంతా అర్థమవుతుంది. రావుగారి చావు ఆక్సిడెంటల్ కాదని మీరిప్పుడు నమ్ముతారు.... ఆయన కోడలి హంతకుడెవరో కూడా తెలుసుకుంటారు."

సర్కిల్ కూర్చుని తలూపాడు. డాక్టర్ స్తబ్దుడై చూస్తున్నాడు టేబిల్ మీది వస్తువుల్ని.

లాల్ ఆ నెగెటివ్‌లని అందుకున్నాడు, "డాక్టర్, మీరు చాలా పకడ్బందీగా పథకం నడిపారు....మీరు వున్న రోగాల్ని నయంచేస్తారే తప్ప లేని రోగాల్ని వున్నట్లు ప్రజల్లో ప్రచారంచేస్తారని ఎవరూ అనుమానించే అవకాశంలేదు. మీ ప్రయోజనాల కోసం మీరేమైనా చేస్తారు. మీ క్లయంట్స్‌ని మభ్యపెడతారు, వంచిస్తారు, ద్రోహమూ చేస్తారు .... అందులోనూ మీ ప్రయత్నాలకు క్లయంట్ తరఫు వ్యక్తులనుండి ప్రోత్సాహం కూడా వుంటే ఇంకా చెప్పేదేముంది?"

"ఏమిటి మీరు వాగుతున్నారు? ఇన్స్‌పెక్టర్! ఇంకా చూస్తారేమిటి? ఈ ఆగంతకుడ్ని...." డాక్టర్ రెచ్చిపోయి మెరుపులా లేచి, తన బలిష్టమైన హస్తంతో లాల్‌ని కొట్టబోయాడు.

లాల్ ఆ హస్తాన్ని మధ్యలో ఆపి, ఒడిసిపట్టుకొని, ఎడంచేతో అతని ముఖంమీద చాచి కొట్టాడు.

"మానర్స్. బిహేవ్ మానర్స్."

సర్కిల్ నిశ్చేష్టుడయిపోయాడు. డాక్టర్ ముఖం పట్టుకొని బాధపడుతున్నాడు. అతను మళ్ళీ తిరగబడలేదు.

లాల్ సిగరెట్ దమ్ములాగి సర్కిల్ వైపు తిరిగాడు,

"ఇన్స్‌పెక్టర్, ఈ నెలరోజులూ మీ సహ్యమీ ప్రజలమధ్య తిరుగుతున్న హంతకుడ్ని కనిపెట్టలేకపోయారు... ఈ డాక్టర్ మీరనుకుంటున్నట్టు ప్రజల పాలిట దేవుడు కాడు, దేవాంతకుడు. రెండు హత్యలు చేశాడు. ఆ సినీ కబళించాలని చూశాడు."

"నాకాశ్చర్యంగా వున్నాయి లాల్, మీ మాటలు."

"ఈ నెగెటివ్స్‌ని చూడండి. ఇక్కడికెలా వచ్చా

యంటారు? ఇతని కేమిటి అవసరం? ఈ పోస్టల్ రశీదుని చూడండి. ఈ కపాడియా అనేవాడు ఒక, ఇంటర్నేషనల్ క్రూక్. ఎన్నో ఇంపర్సనేషన్, ఫ్రాడ్, చీటింగ్ నేరాలతో అనేకసార్లు జైలుకు వెళ్ళాడు. ఆ క్రిమినల్‌ని ఈ డాక్టర్ కాంటాక్టు చేశాడు కలకత్తాలో, మూడ్నెల్ల క్రితం...."

"ఎందుకు?"

"చెయ్యబోయే హత్యకు రంగం సిద్ధం చేయడానికి. ఆ హత్యను ఆక్సిడెంట్‌లా సృష్టించాలి. ఆ ఆక్సిడెంట్ కన్విన్సివ్ గా వుండాలి. అది జరగటానికి దోహదం చేసిన పరిస్థితులు కూడా పటిష్టంగా వుండాలి .... అందుకే రావుగార్ని స్లీప్ వాకర్ గా పుకారు లేవదీశాడు."

"పుకారా! లేవదీశాడా!"

"ఇతన్ని చూడండి! ఇతని ఒడ్డూపొడుగూ అన్నీ రావుగారితో సరిపోతాయి. లేనిదల్లా ఆయన రూపురేఖలు. అందుకోసం కలకత్తాలో ఈ కపాడియాని కలిసివచ్చి, రావుగార్ని రహస్యంగా రెండు ఫోటోలు తీసి, వాటిని పంపాడు. కపాడియా మాస్కుల తయారీలో సిద్ధహస్తుడు. డాక్టర్ పంపిన ఫోటోల ప్రకారంగా విగ్గూ మాస్కూ రూపొందించి పంపాడు.... ఇతను అందుకొని డబ్బు పంపాడు.

"ఇతని పథకంలో రాజేశ్వరి సహకారం వుంది. బహుశ వీళ్ళిద్దరు ప్రేమికులు. నూరిపండు కూడా వీళ్ళతో కలిశాడు. అంతా కలిసి తమ చేతనయినంత చిక్కించుకోవాలని చూశారు.

"ఈ డాక్టర్ అప్పుడప్పుడా విగ్గూ మాస్కూ ధరించి రాత్రులు సంచరిస్తూ రావుగారి అనారోగ్యాన్ని

ప్రచారంచేశాడు, స్లీప్ వాకర్ గా.

"అలా అదేపనిగా చేయలేదు. తగిన వ్యవధి ఇచ్చి కేవలం రెండుసార్లు చేశాడు, అంతే. ప్రజల్లో ఇక రావుగారు స్లీప్ వాకర్ అనే భావం బలీయంగా నాటు కుంది... అటువంటి సమయంలో అనువు చూసి ఆ ఆక్సి డెంట్ సృష్టించి రావుగారిని అంతంచేశాడు."

డాక్టర్ కళ్ళప్పగించి చూస్తోంటే, లాల్ నవ్వి తిరిగి ప్రారంభించాడు.

"ఆ రాత్రి రాజేశ్వరి భర్తకి అతనికి తెలియకుండా నిద్రమాత్రలిచ్చి జారుకుంది. కుట్రదారులు బైట కలుసు కున్నారు. కార్యక్రమం నిర్ణయించుకున్నారు. అప్పుడు రావుగార్ని స్పృహ పోగొట్టి ఎత్తుకుపోయారు. బహుశ ఆ గది బాల్కనీవైపు కిటికీ అప్పుడు తెరిచివుండాలి.... అందులోంచి ప్రవేశించి రావుగార్కి క్లోరోఫాం చూపించారు. ఆయన తల వాల్చేయగానే మోసుకెళ్ళి పోయారు. అతి జాగ్రత్తగా, ఎవరికంటా పడకుండా, చెరువు దగ్గరికి తీసుకెళ్ళి అందులో ఎత్తేశారు, చేతులు దులుపుకున్నారు, అంతే.

"ఆయన అదృశ్యం అప్పటికప్పుడు ఇంట్లో వున్న వాళ్ళకి (సుధీర్, సరళ) తెలియకుండా వుండటానికి గది లోపలినుంచి గడియపెట్టి, అక్కడ టేప్ రికార్డర్ వుంచి, కిటికీలోంచి జారుకున్నారు.

"ఆ టేప్ రికార్డర్ అంతకుముందే రహస్యంగా రికార్డు చేసి వుంచుకున్న ఆయన గురకను ప్రసారంచేసింది....

"అది విన్న సరళకుగానీ, ఆమె భర్తకుగానీ ఎటు వంటి అనుమానం రాలేదు. అయితే టైమ్ ఎలిమెంట్ దగ్గర వీళ్ళు పొరపాటుచేశారు. అసలు దాన్ని విస్మ

రించారు. డాక్టర్ చెప్పిన మరణ సమయం 12-30—2-తోల లోపలే వీళ్ళు ఆ పని ముగించారు. ఆ పనికి వీళ్ళకు అరగంటలో పే పట్టింది. ఎందుకంటే, ఆ గురక కేసెట్ అరవై నిముషాలది. ఎలాగంటే అక్కడున్న కేసెట్లన్నీ అగవై నిమ షాలవే. ఆ కేసెట్ వీటిలో ఒకటి.

"ఆ కేసెట్‌లో గురకను ఇరువైపులా రికార్డుచేసి వుంటే, విన్పించేటప్పుడు ఒకవైపు అంటే అరగంట మాత్రమే సాధ్యమవుతుంది. మళ్ళీ తిప్పివేయడానికి అక్కడెవరూ వుండరు. రాజేశ్వరి కూడా చెరువు దగ్గరకి వెళ్ళి ఆ కార్యక్రమంలో ప్రత్యక్షంగా పాల్గొన్నదని అక్కడ దొరికిన ఆమె గొలుసు చెప్పుంది....

"అందువల్ల అరగంటలోగా తిరిగివచ్చేసి కేసెట్‌ని తిప్పివేయాలి. ఇంట్లోవాళ్ళకి అనుమానం రాకుండా చూసుకోవాలి. అలాగే చేశారు. సూరిపండు గదిలో ప్రవేశించి దాన్ని తిప్పివేశాడు. అలా ప్రతి అరగంటకూ మారుస్తూనే వున్నాడు....గది బయట సుధీర్, సరళలు ఒకరి తర్వాత ఒకరు వచ్చివెళ్ళడం గమనించాడు. అప్పుడు రెండున్నరకి చివరిసారి సరళ వచ్చివెళ్ళినప్పుడు, మరికొంతసేపు చూసి, ఇక ఎవరూ రారని నిశ్చయించుకుని, రికార్డర్ కట్టేసి, తలుపు తెరిచిపెట్టి, క్రింద హాలు తలుపు కూడా తెరిచిపెట్టేసి, తన గుడిసెలోకి మాయమయ్యాడు టేప్ రికార్డర్‌తో.

"కానీ వుదయం ఈ డాక్టర్ మరణ సమయాన్ని ప్రకటించేటప్పుడు, రాత్రి గురకను ఎప్పటివరకు విన్పించారన్నది లెక్కలోకి తీసుకోకుండా; దాన్ని ఏఏ సమయాల్లో ఎవరెవరు విన్నారన్నది కూడా పట్టించుకోకుండా; చివరిసారిగా వాళ్ళు విన్న సమయాన్ని

కూడా దృష్టిలోకి తీసుకోకుండా; నిజాయితీగా నిజమైన మరణ సమయాన్ని డిక్లేర్ చేసి పుణ్యం కట్టుకున్నాడు.

"లేకపోతే, ఇన్స్పెక్టర్, ఆ గురక కేవలం తమ కార్యక్రమం చెడకుండా రక్షణగా ఉపయోగపడిందని మాత్రమేగాక; దాన్ని మరణ సమయం నిర్ణయించేటప్పుడు టైం ఎలిమెంట్ గా కూడా పరిగణించడం అవసరమని స్ఫురించివుంటే; ఆ మరణ సమయాన్ని రెండున్నర—నాల్గున్నరల మధ్య మార్చి చెప్పేవాడు. అప్పుడు సరళకు అనుమానమూ వచ్చేదికాదు, మేమిలా వచ్చేవాళ్ళమూ కాము కదూ డాక్టర్?"

డాక్టర్ పాలిపోయిన ముఖంతో పిరికిగా చూశాడు.

"కానీ ఇతన్ని మీరెలా అనుమానించారు?" అడిగాడు సర్కిల్.

లాల్ చిన్నగా నవ్వాడు, "ఇందాక సూరిపండుకి కేసెట్ అందిస్తోంటే...."

బయట వాహనాలాగిన చప్పుడైంది. లాల్ కిటికీలోంచి చూశాడు. కొందరు గబగబా లోపలికొస్తున్నారు. కొన్ని క్షణాల్లో గదిలోకొచ్చేశారు.

ఇన్స్పెక్టర్ మోహన్ అన్నాడు, "సర్, సూరిపండుని అరెస్టుచేసి లాకప్ లో వుంచాం. అతను నాశనం చేయబోయిన ఎవిడెన్స్ని స్వాధీనం చేసుకున్నాం."

"వెరీగుడ్!" అన్నాడు లాల్.

"ఏమిటా ఎవిడెన్స్?" సర్కిల్ అడిగాడు.

"ఒక జత బనియన్, లుంగీ; విగ్గూ మాస్కూ, టేప్ కేసెట్ ఒకటి, ఒక రక్తంతో తడిసిన కత్తి.... రాజేశ్వరిని తనే చంపినట్టు సూరిపండు ఒప్పుకున్నాడు."

జాన్, సరళ, సుధీర్, సురేష్లు వరుసగా వచ్చి

నిల్చున్నారు.

డాక్టర్ తల ఎత్తి అందర్నీ ఓ మారు చూశాడు. వెంటనే దించుకొని మౌనంగా వుండిపోయాడు కొన్ని క్షణాలు....అప్పుడు హఠాత్తుగా చెప్పసాగాడు.

"అవును. నేనూ రాజేశ్వరి ప్రేమించుకున్నాం. దగ్గరయ్యాం. ఒకటయ్యాం. ఆమెకు భర్తంటే ఏమాత్రం గౌరవం లేదు. అతనికి ఎంతసేపూ డబ్బు లెక్కలు చూసుకోవడం తప్ప, ఆమె అచ్చటా ముచ్చటా తీర్చే తీరిక లేదు. ఈ నాలుగేళ్ళూ అతనితో ఆమె బాగా విసిగిపోయింది. నన్ను విడిచివుండలేని స్థితికొచ్చింది .... విడాకులు తీసుకోమన్నాను. అది కలిసి రాదంది. ఆ వచ్చే మనోవర్తితో తృప్తిపడలేనంది. పెద్ద ప్రణాళిక ఏదైనా చేపడితే తప్ప తగినంత మొత్తం చిక్కించుకుని బయటపడలేమంది.

"అప్పుడే ఈ పథకం ఆలోచించాం. ఆమె భర్తకు సంక్రమించే ఆస్తినంతా కైవసం చేసుకోవాలనుకున్నాం. రావుగారు విల్లురాయలేదు ఇంకా. ఏ నిమిషంలోనైనా వ్రాస్తే ఏఏ నిమ్మతుల్లో ఎవరెవరికి ఏంచేస్తారో తెలీదు- అదీ దెబ్బే. అందువల్ల ఆయన విల్లు వ్రాయకుండానే వీలయినంత త్వరగా పోతే మంచిదనుకున్నాం. అప్పుడాస్తి కుమారులిద్దరికే సంక్రమిస్తుంది. వాళ్ళిద్దరు చెరి సగం పంచుకుంటారు. అప్పుడు కొన్నాళ్ళు నిరీక్షించి, మరో ఆక్సిడెంట్ ఏదైనా కల్పించి ఆమె భర్తని కూడా తప్పించేస్తే, అతని వాటా ఆస్తిని సొమ్ముచేసుకుని ఇక్కడ్నుంచి వెళ్ళిపోవాలనుకున్నాం.

"కానీ పరిస్థితులు అనుకూలించలేదు, ఇలా రూపు దాల్చాయి. ఒక చిన్న టెక్నికల్ పాయింట్ రావుగారి

చావుని తిరగతోడింది. మీ రొక్కొక్కటి కూపీ లాగుతోంటే, ఆమె పట్టాగొలుసువంటి సాక్ష్యాల్ని సేకరిస్తోంటే, ఆమె ఎక్కడ నోరు విప్పేస్తుందోనని జంకి ఆమెనే చంపుకునే అగత్యం ఏర్పడింది....”

సురేష్ ముఖం అవమానంతో ఎర్రబడి వుంది. అతను ఉద్రిక్తంగా వింటున్నాడు. అప్పుడు సుధీర్ అన్నాడు. “అవును డాక్టర్, నాకు తెలుసు. మీ గుసగుసలు పకపకలు నేను విన్నాను. కానీ మీమధ్య ఇలాంటి వ్యవహారం వుంటుందన్న భావనే మనసులోకి రానీయలేక పోయాను. వదిన అంటే నాకెంత అయిష్టమున్నా ఆమెని గురించి అలా అనుచితంగా ఆలోచించడం మంచిది కాదన్పించింది....

“కానీ నాన్న పోయాక పరిస్థితులు కొంతకొంత అవగతమవుతూ, సరళ అనుమానంతో కొన్ని సంగతులు నిర్ధారణ అయ్యాయి. అన్నయ్య నన్నిలా చేయడానికి స్వతహాగా పూనుకోలేదు. అతని లోభత్వాన్ని ఎరగావేసి రెచ్చగొట్టి నామీదకు ఉసిగొల్పారు. వదిన మాటంటే వేదవాక్కు అన్నయ్యకి. నన్నిలా నిర్బంధించి తనకే తెలియనిదేదో అనుభవించేద్దామనుకున్నాడు అన్నయ్య.

“ఈ సూరిగాడికీ ఇందులో పాత్ర వుందన్పించింది. మీ ఇద్దరితో అప్పుడప్పుడు చూసేవాడ్ని. మీ స్వంత విషయాల్లో వాడికి ప్రాధాన్యత ఏమిటా అనుకొనే వాడ్ని....వాడూ మీతో ముఠాకట్టాడనే అన్పించింది. సరళ హైద్రాబాదు వెళ్ళాక ఇక ఆగలేకపోయాను. నాకయిన జ్ఞానోదయంతో మీ చర్యల్ని కనిపెట్టాలనుకున్నాను. ఇక్కడ డిటెక్టివ్ల ఆగమనం మీలో ఎలాటి రియాక్షన్ కల్గిస్తుందో చూడాలన్పించింది....ఈ

వుదయం పారిపోయి విజయవాడలోనే తిరిగాను. చీకటి పడుతోండగా ఇక్కడకొచ్చాను. ఇక్కడ వదిన హత్య జరిగింది. నా అనుమానం బలపడింది. సూరిగాడ్ని కనిపెట్టాను. వాడూ నా అనుమానం నిజంచేశాడు. పాపం మూటగట్టుకొని పెరటిదారిగుండా జారుకుంటోంటే ఊరవతలివరకు వెంటాడాను. అక్కడే ఈ డిటెక్టివ్ గారు సహాయంగా వచ్చి వాడ్ని తన్ని బంధించారు...."

సురేష్ చివాల్న తలెత్తి తమ్ముడి కళ్ళలోకి చూశాడు తీక్షణంగా. అతని కళ్ళు అకస్మాత్తుగా చెమర్చాయి. వున్నట్టుండి అమాంతంగా అతన్ని కావలించుకుని బైటికి తీసుకువెళ్ళాడు. అది చూసిన జాన్ కళ్ళు కూడా అప్రయత్నంగా చెమర్చాయి.

సరళ కదిలి లాల్ ప్రక్కగా వెళ్ళి నిల్చుంది. అతని చెయ్యి అందుకొని నిమరసాగింది కృతజ్ఞతతో....

లాల్ తలతిప్పి ఇన్స్పెక్టర వైపు చూశాడు, "వెల్, గో ఎహెడ్ అండ్ అరెస్ట్ హిమ్" అన్నాడతను, చిరునవ్వుతో సరళ చేతిని తప్పిస్తూ.

—: అయిపోయింది :—

# వెంటాడే మృత్యువు

## ఎమ్.వి.వి. సత్యనారాయణ

విశాఖపట్నం మెయిన్ రోడ్డు రద్దీగా వుంది.

అసలే రోడ్డు బక్క—వాడి గోచీలాగా వుంటుందేమో రద్దీలో అది మరీ ఇరుకుగా అయింది. మనుషులు ఒకరి నొకరు తప్పించుకుంటూ తమ గమ్యాలకేసి పరుగులు తీస్తున్నారు.

గోపాలం జనసముద్రంలో తప్పించుకుని వెళుతూ వెనక్కి చూశాడు. తన వెనక అందమైన స్త్రీ వస్తోంది. ఆమె హై హీల్స్ టకటకలు తనకి అంత హోరులోనూ నేపథ్య సంగీతం లాగా వినిపిస్తోంది.

ఇందాక మార్కెట్ సెంటర్లో కూడా ఆమె తనకి ఎదురయింది. కొంత వుంటే తనని ఢీకొట్టి తనకి తాత్కాలిక స్పర్శ సుఖం అందించేది. ఎవడో అడ్డంగా వచ్చాడు. ఆమె అతడిని ఢీకొట్టి చీవాట్లు పెట్టింది.

ఆమె తనని ఢీకొట్టి కూడా అలాగే చీవాట్లు పెట్టేదా?

గోపాలం కాలర్ సర్దుకున్నాడు.

ఆమె తనని చీవాట్లు పెట్టదు. తనకి వున్న పర్సనాలిటీ ఆ అడ్డంగా వచ్చినవాడికి ఎక్కడిది?

ఆమె లేత నీలిరంగు షిఫాన్ చీరకట్టింది. తెల్లటి బ్లవుజ్ వేసింది. తల నీట్ గా దువ్వుకుంది. అయినప్పటికీ చెంపలమీద రెండు మూడు వెంట్రుకలు అలంకార ప్రాయంగా మొహంమీద ఎగురుతోన్నాయి. తీర్చిదిద్దిన కనుముక్కు తీరు ఆమెలో ప్రత్యేక ఆకర్షణ.

గోపాలం యిద్దరు మగ్గురిని ఢీకొట్టబోయి ఆగాడు. ఆమెను గురించిన ఆలోచనలు తనను ఎటో తీసుకు వెళుతున్నాయి.

అకస్మాత్తుగా గోపాలానికి జానకి గుర్తువచ్చింది.

జానకి నతను మనస్ఫూర్తిగా ప్రేమించాడు. ఆమె తలిదండ్రులు ఆమెకు ఏటూ పెళ్ళిచేయలేరు. అలా అని అడిగినంత వెంటనే తనకూ ఇచ్చి పెళ్ళిచేయరు. వాళ్ళకు కులంపట్టింపులకేం లోటులేదు. లోటు వున్నదల్లా అన్న వస్త్రాలకే!

గోపాలం వెనక్కి తిరిగి చూశాడు.

ఆమె స్ప్రింగ్ రోడ్లోకి మరలింది.

గోపాలం నిట్టూర్చి బౌడారా రోడ్ లోకి ముందుకు వెళ్ళాడు. విశాలమైన భవనంలో ప్రవేశించాడు. మెట్లు ఎక్కి రెండో అంతస్తు చేరుకున్నాడు.

కిరణ్ కమర్షియల్ సిండికేట్.

అంతస్తు మొత్తం సిండికేట్ ఆఫీసు పెట్టారు. శేట్ కిరణ్ సింగ్ దానికి అధిపతి. చురుకుగా పనిచేయగల యువకులను తనను కలుసుకోమని ప్రకటన యిచ్చాడు.

గోపాలం ప్రకటనను చాల ఆలస్యంగా చూశాడు.

తోటి నిరుద్యోగి ఒకడు సిండికేట్‌లో ఉద్యోగం సంపాదించుకున్న తర్వాత గోపాలం కళ్ళు తెరిచాడు. వెంటనే తన సర్టిఫికేట్లు తీసుకుని బయలుదేరాడు.

ఆఫీసు అని బోర్డువున్న గదిలోకి అడుగుపెట్టాడు గోపాలం.

"ఎవరు కావాలి?" అడిగాడు ప్యూన్.

గోపాలం తడబాటును కప్పిపుచ్చుకున్నాడు.

"శేట్ జీని కలుసుకోవాలి!" అన్నాడు.

"ఎందుకు?" అడిగాడు ప్యూన్ తనే వుద్యోగం యిస్తోన్నట్టు.

"సేల్స్ రిప్రజెంటేటివ్ వుద్యోగాలు ఖాళీ వున్నాయేమోనని ... వచ్చాను."

ప్యూన్ దయతల్చుతోన్నట్టు మెల్లగా లేచాడు. స్ప్రింగ్ డోర్స్ తప్పించుకొని ప్రక్క గదిలోకి వెళ్ళాడు.

నిమిషం తర్వాత గోపాలం గదిలో ప్రవేశించాడు.

నీట్‌గా అమర్చిన ఆఫీసుగది. గదిలో రోజ్ వుడ్ టేబులు. దానిమీద గాజుపలక. టేబులుమీద రెండు టెలిఫోన్లు. కాలింగ్ బెల్, టేబులుకి యిటు రెండు ఫ్రేం కుర్చీలు, అటుప్రక్క రొటేటింగ్ చెయిర్‌లో శేట్ కరణ్‌సింగ్.

"ప్లీజ్ ....కూర్చోండి...." అన్నాడు శేట్.

గోపాలం నమస్కారంపెట్టి కుర్చీలో కూర్చున్నాడు. తడబాటు తగ్గించుకోవటానికి విశ్వప్రయత్నం చేశాడు.

"మీ పేరు?"

"గోపాలం" చెప్పాడు.

"వుద్యోగాలు మొత్తం భర్తీ అయ్యాక వచ్చారు" అన్నాడు శేట్ గాజుపలకమీద దరువుచేసి.

గోపాలం హతాశుడయ్యాడు.

శేట్ కరమ్ సింగ్ అతడి మొహంలోని భావాలు చదివాడు. పెదిమలు చప్పరించాడు. కుడిచేతి వేళ్ళతో ఒత్తయిన గడ్డం దువ్వుకున్నాడు. మీసం సర్దుకుంటూ కుర్చీలో వెనక్కి వాలాడు.

"గోపాలం! మీకు వుద్యోగం అత్యవసరం కదూ!"

"అవున్సార్ ....ప్రభుత్వోద్యోగాలకు వయసు మించి పోయింది."

"నీలాంటి యువకుడిని భారతమాత వుపయోగించుకో లేకపోతోంది. ఐ పిటీ హర్!"

గోపాలం ధైర్యం చిక్కబట్టుకున్నాడు.

"నే నేకాదు సార్ ....లక్షలాది యువకుల శక్తి నిష్ఫలంగా అవుతోంది!"

"నాకే అధికారం వుంటే ఆ శక్తిని వుపయోగిస్తాను."

"ఎలా చేస్తారు సార్?"

"చెబుతాను...." బల్లమీద ముందుకు వాలాడు శేట్.

గోపాలానికి అతడిమీద గౌరవం పెరుగుతోంది.

శేట్ గంటకొట్టాడు.

ప్యూన్ వచ్చాడు.

"రెండు బ్రూ....సాల్టు బిస్కట్స్...." అన్నాడు శేట్.

క్షణాలలో ప్యూన్ వాటిని బల్లమీద అమర్చాడు.

శేట్, గోపాలం బిస్కట్సు తిని కాఫీ త్రాగారు.

"మీవంటివారు సొమ్మును బాంకులో మూలిగించ కుండా సిండికేట్సు పెట్టి... ఓహ్....థాంక్యూ సార్... ఎంతో యువశక్తిని వృధాపోకుండా కాపాడుతున్నారు" అన్నాడు గోపాలం.

శేట్ బోళాగా నవ్వాడు.

"పల్లెటూళ్ళకు తరలిస్తాను. యువతిరాన్ని నడుపుతాను. వాళ్ళ శక్తిని కాష్ చేస్తాను. ఆ కాష్‌లో ఎక్కువ భాగం యువకుల కష్టానికి చెల్లిస్తాను. నాకు నూటికి పైసా వుంటే చాలు."

"బాగుంది సార్!"

"నువ్వు వెళ్తావా?"

"వెళ్తాను సార్!"

"నీకు ఏ బిజినెస్సు యిష్టమో చెప్పు?"

గోపాలం తబ్బిబ్బు పడ్డాడు.

"మీరు ఏ బిజినెస్సు చేయమన్నా నేను సిద్ధం సార్!"

"ఫ్యాన్సీ సామానులు అమ్ముతావా?"

"అమ్ముతాను సార్!"

"గ్రామం కూడా ఎంచుకో...."

"మీ యిష్టం సార్!"

"సింహాచలం!"

"వెరీగుడ్ సార్! మంచి బిజినెస్సు జరుగుతుంది. యాత్రాస్థలం!"

"కొండమీదనా? క్రిందనా?"

"క్రిందనే సార్ ...."

"యెస్. ఈ రోజు జనవరి 4. వారం రోజులలో అంటే 11వ తారీఖున యిక్కడికిరా. అప్పాయింట్ చేసుకుంటాను. ఆ రోజు సింహాచలంలోని కరణ్ ఫ్యాన్సీ అండ్ జనరల్ స్టోర్ తాళంచెవులు నీ చేతిలో వుంటాయి."

గోపాలం గుండెల్లో సంతోషం పొరలుతోంది.

"పెట్టుబడి ఎంతో తెలుసా?" అడిగాడు శేట్ జీ.

గోపాలం ప్రశ్నార్థకంగా ముహం పెట్టాడు.

"పాతిక వేలు!"

గోపాలం తృప్తిగా చూశాడు.

"నాకు నెలకు పెట్టుబడిమీద నూటికి పైసా.... అంటే నూరు రూపాయిలకు పైసా వస్తే చాలును."

"అంతేనా సార్?"

"మీలాంటి యువకులను దోచుకోను. యువతరం బాగుంటేనే దేశం బాగుంటుంది."

"థాంక్యూ సార్!"

"వెళ్ళిరా..." శేట్ తల త్రిప్పి టెలిఫోన్ రిసీవర్ అందుకున్నాడు.

గోపాలం రెండు చేతులతో నమస్కారం పెట్టాడు.

శేట్ తలూపాడు.

గోపాలం గాలిలో తేలుతోన్నట్టుగా రోడ్డుమీదకు వచ్చాడు. సిటీ బస్సు ఎలా ఎక్కాడో తనకే తెలియదు. దొండపర్తిలో దిగేవరకూ ఊహాల పల్లకీలు ఎక్కి దిగాడు. తాను బిజినెస్‌ను డెవలప్ చేయగలడు. ఏడాదిలో తాను కమీషన్ బాగా మిగుల్చుకుంటాడు. జానకితో సింహాచలంలో కాపురం పెడతాడు. తననూ జానకినీ విడదీసే శక్తి ఎవరికీ లేదు.

గోపాలం పెంకుటింటిముందు ఆగాడు.

జానకి అరుగులు వూడ్చుతోంది.

గోపాలం చిటికెలు వేశాడు.

జానకి తిరిగి చూసింది. ఆమె కళ్ళలో జ్యోతులు వెలిగాయి చీపురుకట్ట పట్టుకునే ఇంటి వెనక్కి నడిచింది. వేపచెట్టువద్ద ఆగింది. గోపాలం చుట్టూ చూసుకుంటూ

వెళ్ళి ఆమెను సమీపించాడు.

"ఇంట్లో ఎవరూ లేరా?" అడిగాడు గోపాలం.

"లేరు. చుట్టాలింట్లో ఏదో శుభకార్యం వున్నదట! వెళ్ళారు."

"జానకీ నాకు వుద్యోగం వస్తోంది."

"ఎక్కడ?"

"సింహాచలంలో...."

"అక్కడ ఆఫీసులు ఏం వున్నాయి?"

"ఆఫీసుకాదు—ప్రైవేటుగా ఫాన్సీ స్టోర్ పెడతాడు శేట్" గోపాలం వివరంగా చెప్పుకువచ్చాడు.

జానకి అనుమానంగా చూసింది.

"నూరు రూపాయిలు మీమీద పెట్టి ఒక పైసా ఆశిస్తాడా?"

"అవును. అతడు యువశక్తిని కాష్‌చేసి ఆ సొమ్ములో...."

"ఏమండీ.... నాకు ఏదో అనుమానంగా వుంది."

"ఆడవాళ్ళు అనుమానం పుట్టలు!"

జానకి అతడిని ప్రేమగా చూసింది.

"జానకీ! మనకి శుభదినాలు వస్తున్నాయి."

## 2

బెల్ నొక్కాడు శేట్ కరటక్ సింగ్.

ప్యూన్ రాగానే, "గీతను పిలువ్!" అన్నాడు శేట్.

గోపాలం అతడినీ అతడి హుందాతనాన్ని చూస్తున్నాడు. గోపాలం కళ్ళలో ఆరాధనా భావం ప్రతిఫలిస్తోంది. శేట్ అతడిని పట్టించుకోనట్టు చూశాడు.

తలుపువద్ద చప్పుడయింది.

"రావమ్మా!" అన్నాడు శేట్.

హైహీల్స్ టకటకలు వినిపించాయి. గోపాలం తలత్రిప్పి చూశాడు.

ఆమె!

అతడి గుండెల్లో గుబులు రేగింది.

షిఫాన్ చీర యువతి! ఈ రోజు ఆలివ్ కలర్ చీర కట్టింది. మాచింగ్ బ్లవుజ్ ధరించింది. చెవులకు ముత్యాల జూకాలు! కణతల ప్రాంతంలో వెంట్రుకలు రెప రెపలాడుతున్నాయి.

ఆమె బల్లను సమీపించి కుర్చీలాక్కుంది.

"గీత.... నా కూతురు!" అన్నాడు శేట్.

గోపాలం "నమస్తే" అన్నాడు.

గీత ఒయ్యారంగా చేతులు జోడించింది.

"గోపాలం! నీతో బాటు గీత ఫాన్సీస్టోర్‌లో పని చేస్తుంది. నీకు అభ్యంతరమా?"

గోపాలం ఎగిరిగంతేశాడు.

ఇంతటి సొగసుకత్తె స్టోర్‌లో వుంటే వ్యాపారం బ్రహ్మాండంగా నడుస్తుంది. అయినా శేట్ కూతురే స్వయంగా....తనతో కలసి పని చేస్తుందా? శేట్‌కి శాయకష్టంమీద ఎంతటి మమకారం!

గీత కుర్చీలో సుతారంగా కూర్చుంది.

"గీతా! అక్కడ మానేజర్ గోపాలం. నువు కేవలం వ్యాపార పర్యవేక్షణ కోసమే....అతడి శక్తిసామర్థ్యాల మీద నాకు నమ్మకం వుంది. నీ అజమాయిషీ అక్కర లేదనుకుంటాను!"

"అలాగే డాడీ!"

"గోపాలం! తాళంచెవులు యివిగో" శేట్ తాళం చెవులను గాజుపలకమీద పెట్టాడు.

గోపాలం అందుకున్నాడు.

"గోపాలంగారికి జీతం ఎంత డాడీ?"

"కమిషన్ పద్ధతి! పాతికవేల రూపాయలు పెట్టుబడి మీద పాపు అద్దె, పన్నులూ, నిర్వహణ ఖర్చులు అదీ తీసెయ్యాలి. అంతేకాదు, ఆ పెట్టుబడిమీదనే నాకు నూరు రూపాయలకు ఒక పైసా లాభం యిచ్చినా చాలును!"

గీత నవ్వింది.

"నాకు జీతమో...."

శేట్ ఆమె చేతులమీద ఆప్యాయంగా తడిమాడు.

"నువ్వు జీవితాంతం ఎంజాయ్ చెయ్యటమే తల్లీ! నీకు జీతం యివ్వను."

"థాంక్యూ డాడీ!"

"మీ ఇద్దరూ ఎప్పుడు బయలుదేరతారు?" అడిగాడు శేట్.

గీత తలత్రిప్పి గోపాలంవైపు చూసింది.

సరిగ్గా గోపాలం కూడా అప్పుడే ఆమెను చూశాడు. ఆమె కళ్ళలో వింత ఆకర్షణ! చెంపలలో కెంపులు!!

"మీ యిష్టం!" అన్నాడు.

"ఈ సాయంకాలం బయలుదేరదాం!" అంది గీత.

"వెరీగుడ్! ఈ రోజు మీ యిద్దరూ అక్కడ చేరుకుంటే.... రేపుగానీ ఎల్లుండిగానీ ప్రారంభించవచ్చును" అన్నాడు శేట్.

గోపాలం ప్రశ్నార్థకంగా చూసి, "బస కోసం ఏదయినా యిల్లు చూసుకుంటే...." అన్నాడు.

"ఇల్లు చూసివుంచాను. నీకు యిచ్చిన తాళంచెవుల గుత్తిలో ఆ యింటి తాళంచెవి కూడా వుంటుంది."

"అడ్రసు...." అడిగింది గీత.

శేట్ కాగితంమీద రాయసాగాడు.

* * *

"వద్దు.... మీకు ఆ వుద్యోగం వద్దు. అంత లక్షాధికారి కూతురు మీతోబాటు వస్తోందా? ఎందుకు?" అడిగింది జానకి.

"ఫాన్సీస్టోర్ నిర్వహణ కోసం! వస్తే రానివ్వ మనకేం?" అన్నాడు గోపాలం.

"శేట్‌కి ఏ లాభం లేకుండా యింత పెట్టుబడి పెడుతున్నాడా? తన కూతురును ఒంటరిగా మీ వెంట పంపిస్తున్నాడా? నాకు కొరుకుడుపడని విషయాలివి!"

గోపాలం ఆమెను చిరాకుగా చూశాడు.

"జానకీ నీ అనుమానం అర్థరహితం!"

"మీరు మగాళ్ళు! ఏం అన్నా చెల్లుతుంది!"

"ఇప్పుడు నేను ఏమన్నానని?"

"గీతా మీరూ సింహాచలంలో కాపురం పెడతారు. నా గతి ఏమిటి?"

గోపాలం విసుబోయి, "అంతటి లక్షాధికారీ తన కూతురును నాకు ధారపోశాడా? నీకు మతిపోతోంది" అన్నాడు.

"నాకు కాదు మతిపోయింది! మీకు! ఆ గీత తిప్పలాడి అయివుండాలి!"

"జానకీ! నువ్వు నన్ను నమ్మలేవా?"

"నమ్ముతాను ఒక పని చేయండి!"

"ఏమిటది?"

"సింహాచలం నేనూ వస్తాను."

"మీ యింట్లో ఒప్పుకుంటారా?"

"వాళ్ళకు తెలియకుండా నే...."

"ఆఁ!"

"అవును. నాకు యిక్కడ జీవితం దుర్భరంగావుంది. నేను వచ్చేస్తాను తీసుకుపోండి!"

"లేచిపోయిన మనుషులని మనను చులకన చేస్తారు!"

"ఎవరి సంగతీ నాకు అనవసరం?"

"జానకీ ప్లీజ్ .... నా మాట విను! అక్కడ నన్ను కాలు నిలదొక్కుకోనివ్వు. త్వరలోనే మనం కాపురం పెడతాం!"

జానకి వెనక్కి తిరిగింది.

విసవిసా నడచుకుంటూ వెళ్ళిపోయింది.

## 3

నీళ్ళగదిలోంచి చప్పుడవుతోంది.

గోపాలం నీళ్ళగదివద్ద ఆగాడు.

"గోపాలంగారూ!" పిలిచింది గీత.

"ఇంకా మీ స్నానం పూర్తి కాలేదా?" అడిగాడు గోపాలం.

"ఏం యిల్లు? ఏం స్నానం? డాడీ యింత నాసిరకం యిల్లు మనకోసం కేటాయిస్తారనుకోలేదు!"

నీళ్ళచప్పుడు ఆగింది.

"ఈ యిళ్ళలో మీవంటివాళ్ళు వుండలేరు. ఆ మాట నేను ముందే చెప్పాను."

గీత తలుపు తెరుచుకొని వచ్చింది.

"కడిగిన ముత్యం!" గొణుక్కున్నాడు గోపాలం.

గోపాలం నీళ్ళగదిలోకి ప్రవేశించాడు.

ఇద్దరూ తయారై ఫాన్సీస్టోర్ చేరుకునేసరికి ఎనిమిది న్నరయింది. బస్సులు ఆగే స్థలంలో అటూ యిటూ కట్టిన షాపింగ్ సెంటర్స్‌లో ఒక చివరగా వుంది కరణ్ ఫ్యాన్సీ అండ్ జనరల్ స్టోర్స్. విశాలమైన స్థలంచుట్టూ ప్రహారీగోడ. స్థలం మధ్యలో దేవస్థానంవారి బస్సులు నిర్వహించే ఆఫీసు.

కొండమీదికి వెళ్ళే బస్సు ఆవరణలోంచి బయలు దేరుతోంది.

గోపాలం స్టోర్స్ తలుపు తెరిచాడు.

రకరకాల ప్లాస్టిక్ సామానులూ, పిల్లలకు బహుక రించే ఆటబొమ్మలూ చెక్కలమీద నీట్‌గా అమర్చి వున్నాయి. స్టోర్స్ వెనక భాగంలో వున్న గాజు అద్దాల బీరువాలలో కొయ్య బొమ్మలు అమర్చాను.

ఏటికొప్పాక కొయ్యసామగ్రి!

అమ్మలక్కలూ, పల్లె యువకులూ, రైతులూ, బుట్ట బొమ్మలూ....

గోపాలం, గీతా స్టోర్స్‌లో ప్రవేశించారు.

సేల్స్ కౌంటర్‌లో వున్న బల్లమీద రశీదులు, గల్లా పెట్టె, కర్ర చివర కట్టిన గుడ్డా పాడవుపాటి వెదురు బద్దలూ వున్నాయి. ప్లాస్టిక్ బకెట్లకూ, సంచులకూ తాళ్ళు కట్టి వున్నాయి.

స్టోర్స్ బయట ఫ్రేముకు హుక్స్ దిగగొట్టి వున్నాయి.

"మొదట ఏం చేద్దాం!" అడిగింది గీత.

ఆవరణలో ప్రయాణీకులూ, యాత్రీకులూ చేరు తున్నారు.

"రశీదుల ప్రకారంగా అన్ని వస్తువుల ధరలూ నిర్ణ యించుకోవాలి. ప్రతి వస్తువుమీద లెడ్ పెన్సిలుతో

ధర రాసుకోవాలి."

ఇద్దరూ రశీదులు పరిశీలించసాగారు.

గోపాలం నిలబడి వున్నాడు. గీత కుర్చీలో కూలబడింది. మధ్యాహ్నమయేసరికి సగం పని పూర్తయింది.

గోపాలం బయటికి వచ్చాడు.

"గోపాలంగారూ! కాంటీన్‌కి వెళ్దామా?" అడిగింది గీత.

ప్రయాణీకులలోకి గోపాలం పరీక్షగా చూడసాగాడు.

"ఏమిటలా చూస్తున్నారు? ఎవరి కోసం?" అడిగింది గీత.

'జానకి....' గొణుక్కోసాగాడు గోపాలం.

# 4

"జానకీ! ఏమిటిలా వచ్చావు?" అడిగాడు గోపాలం.

జానకి రోడ్డుమీద నడుస్తోంది. కొండమీదకి వెళ్ళే రోడ్డు. ఆమె మలుపులో ఆగింది. మలుపు ప్రక్కగా వున్న ఒక్తయిన గడ్డిలో ఇద్దరూ కూర్చున్నారు.

"ఇంట్లో నా పరిస్థితి చెడిపోయింది!" అంది జానకి.

"అదేమిటి? ఏమయింది? వివరంగా చెప్పు?" గాభరా పడ్డాడు గోపాలం.

"మా నాన్న నాకు పెళ్ళి సంబంధం తెచ్చారు."

"నిజమా?"

"అవును. రెండో పెళ్ళి సంబంధం. అతడికి ముప్ఫయి అయిదేళ్ళుంటాయి. ఇద్దరు పిల్లలను వదిలిపెట్టి చనిపోయిందిట."

గోపాలం ఆలోచనలో పడ్డాడు.

"నువ్వు యిక్కడికి పూర్తిగా వచ్చేసినట్టేనా?"

ఆడిగాడు గోపాలం.

జానకి కళ్ళల్లో నీళ్ళు నిలిచాయి.

"వచ్చేశాను. రాక ఏం చేయను?"

"సంబంధం వచ్చినంతమాత్రాన ఏమయింది?"

జానకి ఏడుస్తోంది.

"వాళ్ళంతా కలసి ఏ అర్ధరాత్రో నాకు గుడిలో ముడిపెడతారు!"

"మీ నాన్న అంతకు తెగించాడనుకోలేదు!"

"ఏం చేస్తాడు? నాకు పెళ్ళిచేయలేడు. చేయకుండా వదలలేడు. నాకు ఇరవై రెండు వచ్చేశాయి. లోకులు కాకుల్లాగా పొడుస్తున్నారు."

గోపాలం చెయ్యి చాపాడు. జానకి భుజం తట్టాడు.

"నువ్వు, వచ్చి మంచి పని చేశావు."

జానకి కళ్ళు తుడుచుకుంది.

"నువ్వు కట్టుబట్టలతోనే వచ్చేశావా?"

"అవును. పైసలు తడుముకుని సిటీబస్సెక్కాను."

"లే. యింటికి వెళ్దాం" గోపాలం లేవబోయాడు.

"ఇంట్లో గీత వుంటుందేమో!"

"లేదు. ఆమె స్టోర్‌లో అమ్మకంలో వుంది."

"రాత్రికయినా వస్తుంది కదా! ఆమెకు ఏం చెబుతావు?"

"రాత్రి విషయం చూసుకుందాం!" అతడు చెయ్యి అందించాడు.

ఇద్దరూ గోడ్డు దిగారు. కొండకింద జనం రద్దీగా వున్నారు. గోపాలం గ్రామంలోకి నడిచాడు. జానకి అతడిని అనుసరించింది.

ఇద్దరూ పెంకుటింటిముందు ఆగారు.

ఇంటి తాళం తెరచి గోపాలం లోపలకు నడిచాడు. జానకికి యింటిని చూపించాడు.

"నువ్వు యింట్లో వుండు. నేను స్టోర్స్‌కి వెళ్ళివస్తాను" అన్నాడు.

జానకి తలాడించింది.

గోపాలం వెలుపలకు వెళ్ళిపోయాడు.

స్టోర్స్‌లో గీత వుంది. కొనుగోలుదార్లు పెద్దగాలేరు. గోపాలాన్ని చూస్తూ గీత నవ్వింది.

"షికారు ముగిసిందా?" అడిగింది గీత.

"ముగిసినట్టే."

"సాయంకాలం అవుతోంది. భోజనం విషయం ఏమిటి?"

"ఏం? ఉదయం మనం తిన్న కాంటిన్‌లో నే తిందాం, బాగానే వుంది కదా!"

"బోర్ ....అదీ ఒక తిండేనా?"

"యాత్రస్థలాల్లో అంతే! గడ్డిని పచ్చడిచేసినా తిన వలసిందే!"

"మీరు తినండి బాబూ! నావల్ల కాదు."

"మరెలా?"

"వైజాగ్ పోతాను."

"ఓ. కే" నవ్వాడు గోపాలం.

ఆమె వైజాగ్ వెళ్ళిపోతే తన సమస్య తీరినట్లే!

సేల్స్‌లో ప్రవేశించాడు గోపాలం.

చీకటిపడింది.

గీత స్టోర్ తలుపు మూసింది.

ఎలక్ట్రిక్ లైట్ల కాంతిలో ఆమె మెరుస్తోంది.

గోపాలాన్ని సమీపించింది. అతడి మెడచుట్టూ

చేయి వేసింది.

గోపాలం ఉక్కిరిబిక్కిరయ్యాడు.

జానకి వూహించింది నిజమౌతోంది. శేట్ కూతురు తన వెంట పడుతోంది.

ఇప్పుడెలా?

అతడికి ఆలోచించే అవకాశం యివ్వదల్చుకోలేదు గీత. అతడి తలను గుండెలమీదకు లాక్కుంది.

అతడి కోరికలకు కొక్కాలు తగులుతున్నాయి.

రక్తం వడి హెచ్చుతోంది.

ఆమెను కావలించుకున్నాడు.

"భోజనం వద్దా?" అడిగాడు గోపాలం.

"హుష్!" అతడి పెదిమలను అందుకుంది గీత.

చెయ్యి చాపి స్విచ్ ఆర్పింది.

స్టోర్స్‌లో కటిక చీకటి!

నిముషాలు గంటల్లోకి నడుస్తున్నాయి.

"అబ్బా! తొమ్మిదయింది!" అంది గీత.

"కాంటీన్‌లో కూడా భోజనం వుండదు. వున్నా గడ్డి!"

"కాంటీన్‌కి ఎందుకు?"

"మరి?"

"జానకి చేత వండించు!" అతడి గుండెల మీది వెంట్రుకలు లాగుతోంది గీత.

"మిమ్మల్ని వెంటాడానులే...." గుసగుసలాడుతోంది.

## 5

"బిజినెస్సు ఎలావుంది?" కారు దిగుతూనే అడిగాడు శేట్.

గోపాలం అమ్మకంలో మునిగివున్నవాడల్లా గీతకు

అప్పగించి ప్రక్కకు వచ్చాడు.

"బాగా సేవుంది సార్!"

"రోజుకి అమ్మకం ఎంత వుంటోంది?"

"మొదటి రోజు ఆరువందలు. రెండో రోజునుండి వెయ్యివరకూ వెళ్తోంది."

"స్టాక్స్ వున్నాయా?"

"కొయ్యబొమ్మలు స్టాకు అయిపోయాయి సార్! వచ్చే వారం వరకూ డెలివరీ యివ్వరట!"

"అంతవరకూ వూరుకోవడమేనా?"

"లేదు సార్! ఏటికొప్పాక వెళ్ళి రావాలనుకుంటున్నాను."

"గుడ్ బిజినెస్సులో అలాంటి చురుకుతనమే అవసరం."

"థాంక్యూ సార్!"

"స్టోర్స్‌ను గీతకు ఒప్పగించి వెళ్ళు. రెండువేల రూపాయల సరకు తీసుకురా!"

"ఉదయాన్నే వెళ్ళి సాయంకాలం వస్తాను."

"గుడ్."

కస్టమర్స్ వెళ్ళిపోయారు.

"రా. డాడీ....కూర్చో" అంది గీత.

శేట్ కూర్చున్నాడు. గీత అతని వెనుక నిలబడి భుజంమీద చేతులు వేసింది. శేట్ ఆమె చేతులు తడుముతున్నాడు.

"నేను ఒకసారి యింటికి వెళ్ళివస్తాను సార్" అన్నాడు గోపాలం.

"త్వరగా వచ్చెయ్యి. అరగంటలో నేను తిరిగి వైజాగ్ బయలుదేరాలి."

గోపాలం ఇంటికి వెళ్ళాడు.

జానకి వంటపనిలో వుంది.

గోపాలాన్ని చూస్తూనే కళ్ళనీళ్ళు త్రిప్పింది.

"మీకూ ఆ సొగసుకత్తెకీ వంటపుట్టెలాగా అమిరాను" అంది జానకి.

గోపాలం ఇబ్బందిగా చూశాడు. తల విదిలించాడు.

"జానకీ! నన్ను క్షమించు. జీవితానికి ఆధారం ఒక్కటే చూసుకుంటున్నాను కానీ, ఎటు నడుస్తున్నానో నాకే తెలియడంలేదు."

"ఇక్కడినుండి వెళ్ళిపోదాం! మనకి యింతకంటె గొప్ప ఆధారం దొరక్కపోదు."

"ఎక్కడికి పోతాం జానకీ! ఈ మాత్రం స్థిరత్వం నాకు ఎక్కడా లభిస్తుందంటే నమ్మను."

"మీకు ఆ తిప్పలాడిని వదిలిరావాలంటే మనస్కరించదు. అంతేకదా" జానకి గొంతు వణికింది.

"జానకీ! నువు అ న వ స ర ం గా నన్ను అనుమానిస్తున్నావు!"

"లేదు. మగవాడి నిజస్వరూపం తెలుసుకోలేక పోయాను."

"ఛీ....ఛీ వెధవగోల...."

"నేను లేచివచ్చాననే కదా మీకు అలుసు!"

"జానకీ....ప్లీజ్ ....నన్ను విసిగించక!" తల విసిరాడు గోపాలం. "అన్నం వడ్డించు" అన్నాడు.

జానకి పాత్ర దించి స్టౌ ఆర్పింది.

"మీరు చాటున ఏం కులుకుతున్నారో నాకు అనవసరం! కనీసం నా కళ్ళముందయినా దాన్ని మీమీద పడవద్దని చెప్పండి" జానకి అతడికి అన్నం వడ్డించ

సాగింది.

గోపాలం మౌనంగా అన్నం కలుపుకొంటున్నాడు.

"ప్రయాణం! ఏటికొప్పాక వెళ్ళిరావాలి!" అన్నాడు గోపాలం.

"ఒకరా? యిద్దరా?"

"ఒకడినే!"

"అది ఏం పాపం చేసుకుంది?"

"వాళ్ళ డాడీ వచ్చాడు. ఆమెను యిక్కడే వుండమన్నాడు."

గోపాలం చెయ్యి కడుక్కున్నాడు.

జానకి టవలు అందించింది.

గోపాలం బయటకు కదలబోయాడు.

"తిరిగిరావడం ఎప్పుడు?" అడిగింది జానకి.

"ఈ సాయంకాలం!"

గోపాలం తల త్రిప్పకుండా బయటికి నడిచాడు. రోడ్డెక్కాడు.

స్టోర్స్ మూసివుంది. తలుపుల బయట తాళంలేదు. అంటే గీత స్టోర్ లోపల తలుపులు వేసుక్కూర్చుందన్న మాట.

గోపాలంగా ఆశ్చర్యంగా చూశాడు.

శేట్ వచ్చిన కారు రోడ్డుమీదనే వుంది.

గోపాలం తలుపులవద్దకు నడిచాడు.

స్టోర్స్ లోపలనుండి నిట్టూర్పులు వస్తున్నాయి. ఎవరో వగరుస్తున్నారు.

గోపాలం నిర్ఘాంతపోయాడు.

గీత పరవశంగా మూలుగుతోంది.

"ఏమంటాడు గోపాలం?" అడుగుతున్నాడు శేట్.

నగరుస్తోంది అత దే!

గీత ఏదో చెబుతోంది.

గోపాలం వినదల్చుకోలేదు.

తన జీవితంలో ఏదో నాటకం జరుగుతోంది.

శేట్ కూతురే గీతా!

అయితే తలుపులు మూసుకుని తండ్రీ కూతుళ్ళు ఏకాంతం కోరడం దేనికి?

పట్టపగలు!

గోపాలం తలలో ఆలోచనలు సుడులు తిరుగుతున్నాయి.

పావుగంట తర్వాత స్టోర్స్ తలుపులు తెరుచుకున్నాయి.

గీత కౌంటర్ లో కూర్చుంది.

శేట్ జీ బల్లమీద వాలి బదకం తీర్చుకుంటున్నాడు.

ఇద్దరి మొహాలూ ఏం జరగనట్టే వున్నాయి.

గోపాలం స్టోర్స్ లోకి నడిచాడు.

## 6

అతడు అద్దం ముందు నిలబడ్డాడు.

టాయ్ లెట్ అయాడు. సెంటు పూసుకున్నాడు.

ఖరీదయిన బట్టలు వేసుకున్నాడు. షర్టును పాంటులోకి జొనిపి టక్ చేసుకున్నాడు.

గదిలోంచి బయటికి నడిచాడు.

ఇంటికి తాళం పెట్టాడు.

కారు ఎక్కి మెయిన్ రోడ్డు వెంట పోనిచ్చాడు. రాయల్ హోటల్ ముందు కారు ఆపాడు.

కిటికీలోంచి బయటకు నడిచాడు.

హోటల్ ముందు అశోక వృక్షాలు బారులు తీరి

వున్నాయి. వాటికి యివతలగా ఐలండ్ వుంది. అటు ప్రక్కగా సిమెంట్ బెంచీలు వున్నాయి. మూడో బెంచీమీద ఆమె కూర్చుంది.

కారును పార్కింగ్ ప్లేస్‌లో ఆపాడు.

కారు దిగి ఆమెవైపుకు నడిచాడు.

అతడివెంట సెంటు వాసనలు ఆమెను సమీపించాయి.

"లక్ష్మీకాంతం మీరేనా?" అడిగాడు.

ఆమె లేచి నిలబడింది. తలూపింది.

"మీకు ఫోన్ చేసింది నేనే!" ఆమె దగ్గరగా నిలబడ్డాడు.

లక్ష్మీకాంతం అతడినే చూస్తోంది.

"రండి. కాఫీ తాగుదాం!" అన్నాడు అతడు, ఆమె కళ్ళలోకి చూసి.

లక్ష్మీకాంతం తడబడింది. అతడి కళ్ళలో సూదంటు రాళ్ళున్నాయి. ఆమెకు తలూపడం మినహా ఏమీ చేతకాలేదు.

అతడివెంట హోటల్ లోపలకు నడిచింది.

'ఫామిలీ' అన్న గదిలోకి నడిచారు యిద్దరూ.

వెయిటర్ రాగానే, "రెండు ఆమ్లెట్, రెండు స్వీట్, రెండు కూల్ డ్రింక్...." అన్నాడు అతడు.

వెయిటర్ వెళ్ళిపోయాడు.

"మీరు ఏ నాటకాలు వేశారు?" అడిగాడు అతడు.

ఆమె దండకం చదివింది.

"అబ్బో! నటనలో గొప్ప అనుభవం వుంది!" అన్నాడు అతడు.

ఆమె కళ్ళలో మెరుపులు మెరిశాయి.

"ఈ డ్రామాలన్నింటికీ మా బావే ప్రొడ్యూసర్"

అంది.

"అందుకే ఇవన్నీ స్త్రీ పాత్ర ప్రముఖంగా వున్న నాటకాలు!"

"అవును."

"బాగా సంపాదించారట!"

"ఏం లాభం? ఒకటి రెండు నెలలుగా ఒక్క ప్రోగ్రామూ లేదు."

"ఏం?"

"మా బావ తాగుడు నేర్చాడు."

"మీ బావకీ మీకూ తగాదాలు వచ్చాయట!"

"మీరు చాల విషయాలు సేకరించారు!"

"జయా!" అతడు చెయ్యి చాపి ఆమె చెయ్యి అందుకున్నాడు. "సారీ! చెప్పలేదుకదా! నువు స్టార్‌వి అవుతావు. ఈ పాత చింతకాయ పేరుతో కాదు. జయ! నీ పేరు జయ! కొత్త పేరు—కొత్త తార! తారాపథంలో నువు విజయ శంఖం పూరిస్తావు."

వెయిటర్ ట్రే పట్టుకువచ్చాడు.

ఆమె చప్పున చెయ్యి లాక్కుంది.

ప్లేట్లు సర్ది వెయిటర్ వెళ్ళిపోయాడు.

అతడు ఆత్రంగా ఆమె మీదకు ఒరిగాడు.

"మీ ప్రవర్తన అతిగా వుంది!" అందామె.

"మీ బావతో నీ ప్రవర్తన విషయం కూడా నాకు తెలుసు!"

"ఏం చేయను! నటన పేరుతో నాశనమయాను!"

అతడు పకపక నవ్వాడు.

"సినిమా తెరమీద కూడా ఈ నటనే రాణిస్తుంది."

ఆమె నుదురు చిట్లించింది.

"నేను ఏం చెప్పినా మీరు నమ్మేలాగా లేరు."

"జయా! మన ఫీల్డే అటువంటిది! సరేనా, గతంతో నాకు పనిలేదు. నువు నాతో మద్రాసు ఎప్పుడు వస్తావో తేల్చుకో!"

"సారీ రాలేను!"

"అదేమిటి?"

"నా గతం కెలికి చిత్రహింస చేయడానికి మీ అర్హత లేమిటట?"

అతడు కంగుతిని అంతలోనే తమాయించుకున్నాడు.

తను ఆమె గతాన్ని త్రవ్వి ఆమెను లొంగదీసుకోవాలనుకోవడం పొరపాటయింది.

అతడు నిట్టూర్చాడు.

"ప్లీజ్....నీ శరీరం, నీ హొయలు నన్ను మత్తెక్కించాయి. మనం మద్రాసు వెళ్ళిపోదాం! నేను రెండు లక్షల రూపాయిలు తెస్తున్నాను."

ఆమె నిజమా అన్నట్టు చూస్తోంది.

"నిజం జయా!" అతడు తన జేబులోంచి బాంక్ అక్కౌంట్ పుస్తకం తీశాడు.

ఆమె పుస్తకంలో అంకెలు చూస్తోంది.

రెండు లక్షలా వెయ్యి రూపాయిల చిల్లరవుంది.

అతడి మెడచుట్టూ చేతులు బిగించింది.

ఆమె చెవులకు వ్రేలాడే రవ్వల జూకాలు అతడి బుగ్గలను రాచుకున్నాయి.

అతడు నొప్పిని భరిస్తున్నాడు.

ఆమె అతడిని వొదిలి సర్దుకు కూర్చుంది.

ఇద్దరూ ఆత్రంగా టిఫిన్ తినసాగారు.

"మా యింటికి వెళ్దాం!" అన్నాడు అతడు.

ఆమె కొంటెగా చూసింది.

ఇద్దరినీ ఎక్కించుకుని కారు బయలుదేరింది.

"నీకు వెనకాముందూ ఎవరూ లేరు.... నా అదృష్టం!" అన్నాడతడు.

# 7

రూట్ బస్సు ఆగింది.

అనకాపల్లి బస్సు స్టాండ్.

గోపాలం అతడి వెనుక గీత బస్సు దిగారు.

గోపాలం చిరాకుగా చూశాడు.

"లోడ్ చేసుకున్న లారీ ఏటికొప్పాకలో ఆగిపోవడం కాదుగానీ....ప్చ్....ఈ రాత్రి ఇక్కడ మకాం వేయవలసివస్తోంది!" అన్నాడు గోపాలం.

గీత అతడి భుజం పట్టుకున్నది.

గోపాలం విదిలించుకున్నాడు.

"గోపాలం! నీకు ఏమయింది?" అడిగింది గీత.

ఇద్దరూ మెయిన్ రోడ్డున నడవసాగారు.

"నిన్ను నాతో బయలుదేరవద్దని బతిమాలాను. అయినా నువు నన్ను వదలవ్!"

"నామీద నీకేం కోపం?" పకపకలాడింది గీత.

"ఛీ....ఛీ.... నువ్వూ శేట్ ఆడిన నాటకం గుర్తు లేదా?"

"పొట్ట నింపుకోవడానికి నువు తాపత్రయపడటం లేదా?"

"అయితే తండ్రి కూతుళ్ళకిలాగా నాటకం ఆడి.... ఛీ....ఆ విషయం గుర్తుకొస్తేనే నాకు అసహ్యంగావుంది."

"శేట్ నన్ను అలా నాటకం ఆడమన్నాడు. అయితే

నీ దగ్గర బయటపడిపోయాడు!"

"అదే.... నాటకం ఎందుకంటాను?"

"అతడికి యింట్లో భార్యవుంది. పిల్లలులేరు. నన్ను మొదట వాత్సల్యంతో నే చేరదీశారు....

"కాని, నవు నీ హూయలతో ప్రియురాలి స్థాయికి వెళ్ళావు!"

గీత మాట్లాడలేదు.

ఆమె కళ్ళు ఎవరినో చూస్తున్నాయి. ఎవరో ఇద్దరు యువతీ యువకులు రోడ్డుమీద కనిపించారు.

రోడ్డుప్రక్కనే అజంతా లాడ్జి వుంది.

ఆ ఇద్దరూ లాడ్జివైపు వెళ్తున్నారు. ఆ యువతి తనకి తెలియదు. కాని యువకుడిని ఎక్కడో చూచినట్టుంది.

యువతి మెడలో విలువైన నగలున్నాయి. చెవులకు రవ్వల జూకాలు వ్రేలాడుతున్నాయి. ఆమె విపరీతంగా టాయ్‌లెట్ అయింది.

గీత మాట్లాడకుండా చురుకుగా అడుగులు వేసింది. గోపాలం కూడా లాడ్జివైపు నడవసాగాడు.

"మద్రాసుకి అని బయలుదేరి మధ్యలో అనకాపల్లి దింపారు. ఇదేం బావుంది?" అడుగుతోంది ఆమె.

ఆమె కంఠంలో హూయలు. సినీతార మాట్లాడినట్టు ఒంపులు!

"చెబుతాను రా!" అంటున్నాడు అతడు.

అతడు గొంతు మార్చి మాట్లాడుతున్నట్లుగా బొంగురుగావుంది. వాళ్ళు లాడ్జిలో డబల్ రూం తీసుకున్నారు. మెట్లు ఎక్కి వెళ్ళిపోయారు.

గోపాలం కౌంటర్ ముందు ఆగాడు.

"రెండు సింగిల్ రూంస్" అన్నాడు గోపాలం.

గీత అతడిని విడ్డూరంగా చూచింది.

"డబల్ రూం తీసుకో...." అంది మెల్లగా.

గోపాలం నిర్లిప్తంగా కౌంటర్‌లోని వ్యక్తిని చూడసాగాడు.

"రూం నెంబర్ 20, 21" అంటూ తాళంచెవులు తీశాడు కౌంటర్‌లోని వ్యక్తి.

"పేర్లు చెప్పండి" అన్నాడు అతడు రిజిష్టర్‌లోకి వంగి.

గోపాలం తన గది నెంబర్ 20 ముందు ఆగాడు. తాళంచెవి తీసి పట్టుకున్నాడు.

గీత 21 ముందు నిస్సహాయంగా చూస్తోంది.

"రెండు గదులూ ప్రక్కప్రక్కనే. అయితే ఏం గోడ అడ్డం" అంది గీత, ఖాళీగా వున్న వరండాలోకి చూసి.

"అవును. అదే నీకూ నాకూ సరిహద్దు" గోపాలం గదిలోకి నడిచాడు. తలుపు దగ్గరగావేసి బోల్ట్ లాగాడు.

గీత తన గది తాళం తెరవలేదు.

గది నెంబర్ 20 ముందుకు నడిచింది. దానికి అటు ప్రక్క రూం నెంబర్ 19. డబుల్ రూం అని నెంబర్ క్రింద రాసివుంది.

గీత నుదురు చిట్లించింది.

తనముందు వచ్చిన యువతీ యువకులు డబుల్ రూం కావాలని అడగడం తాను విన్నది. వాళ్ళు దిగిన రూం నెంబర్ 19 అయివుండాలి.

గీత నిశ్శబ్దంగా వరండాలోకి నడిచింది. రూం నెంబర్ 19 ముందు ఆగింది. గదిలోంచి మెల్లగా మాటలు వినిపిస్తున్నాయి.

"నగలు మొత్తం తెచ్చినట్టున్నావే?" అడుగుతున్నాడు అతడు.

అతడే! చెవులు రిక్కించి వింటోంది గీత.

గదిలో ఆమె నవ్వుతోంది. గాజులు గలగలలాడాయి.

"ఈ వివరాలతోనే ఈ రాత్రి కాలక్షేపం చేస్తారా?"

"వుహుఁ!"

"అబ్బా....అలాగేనా ప్రవర్తించేది?"

గీత తలపంకించింది.

గదిలో ఆమె నగలతో అతడివెంట పడింది. అతడు మద్రాసుకని చెప్పి ఆమెను లేవదీసుకు వచ్చాడు. వచ్చిన వాళ్ళు అనకాపల్లిలో హోటల్లుచేయడం ఏమిటి?

ఆమె వూహించని హోటల్లు యిది!

గదిలోంచి నిట్టూర్పులు వినిపిస్తున్నాయి.

గీతకు చెమటలు పట్టాయి.

రూం నెంబర్ 20 ముందుకు నడిచింది. తలుపు తట్టింది.

"రూం సర్వీస్!" అంది గొంతు బొంగరుచేసి.

తలుపు తెరచుకున్నది. గీత గదిలోకి దూసుకు వెళ్ళింది.

గోపాలం నిశ్చేష్టుడయాడు.

"నీ నాటకాలు యింకా తగ్గలేదు!" అన్నాడు గోపాలం.

"నాటకం కాదు, ప్రక్క గదిలో ఏదో జరుగుతోంది" అంది గీత.

"ఏమైతే నాకేం?"

"గోపాలం! నిదానంగా ఆలోచించు. ఒక ఆడా, ఒక మగా ఆ గదిలో దిగారు...." తనకి తెలిసింది అతడికి

చెప్పాకు వచ్చింది గీత.

"నాకు వాళ్ళ గోల అనవసరం!"

గీత అతడిని సమీపించింది. తన బాహువులతో అతడిని కావలించుకుంది.

గోపాలం ఇబ్బందిగా కదిలాడు.

గీత యవ్వనం అతడి నిర్ణయాన్ని మారుస్తోంది.

ఒంటి సెగలు అతడిని రగిలిస్తున్నాయి.

తలుపు దగ్గరగా పడేలాగా తన్నాడు. ఆమెను బెడ్ మీదకు తోశాడు.

స్విచ్ ఆర్పాడు.

## 8

గోపాలానికి అకస్మాత్తుగా మెలకువ వచ్చింది.

ప్రక్కకు తడిమాడు. గీత లేదు. చటుక్కున బెడ్ దిగాడు. తలుపు తెరచివుంది.

గోపాలం నిట్టూర్చాడు.

గీత కావాలి!

ఆమె తన గదికి వెళ్ళి పడుకుని వుంటుంది.

వరండాలో ప్రవేశించాడు గోపాలం.

రూం నెంబర్ 21కి వెళ్ళాడు. గదిలో జీరోవాట్ బల్బు వెలుగుతోంది. బెడ్ మీద గీత పడుకున్నట్టుంది. గోడప్రక్కకి తిరిగి పడుకోవడంలో ఆమె మొహం కనిపించడంలేదు.

గోపాలం బెడ్ను సమీపించాడు.

తూలిపడబోయాడు. నేలమీద ఎవరో పడివున్నారు. శరీరం మెత్తగా తగిలింది. గోపాలం వంగి చూశాడు.

గీత వెల్లకిలా పడివుంది.

గోపాలం పిచ్చిగా బెడ్ వైపు చూశాడు.

కిందపడివున్నది గీత అయితే బెడ్ మీద వున్నది ఎవరు?

గోపాలం గీతను దాటాడు. బెత్ మీదవున్న యువతిని తట్టాడు.

ఆమె శరీరం చల్లగా వుంది.

గోపాలం అసంకల్పితంగానే ఆమె భుజంపట్టి యిటు త్రిప్పాడు.

గోపాలం ప్రేతాన్ని చూసినట్టు గడగడలాడాడు.

ఆమె మొహం చెక్కివుంది. పనసకాయ తరిగినట్టుగా ఆమె మొహాన్ని తరిగారు. తరిగిన ప్రాంతాల్లో రక్తం కారి గడ్డకట్టివుంది. బెడ్ మీద రక్తం మరకలు భీభత్సంగా వుంది.

గోపాలం చటుక్కున యివతలకు గెంతాడు.

గీత చెయ్యిపట్టుకుని చూశాడు.

నాడి కొట్టుకుంటోంది.

గోపాలం ఆమెను తట్టి లేపాడు.

గీత బలహీనంగా లేచింది. గోపాలాన్ని తెల్లబోతూ చూచింది. బెడ్ వైపు తల తిప్పబోయింది.

గోపాలం ఆమె కళ్ళుమూసి. "పద, నా గదిలోకి వెళ్దాం!" అన్నాడు.

గీత శక్తిని కూడదీసుకుని లేచింది.

గోపాలం ఆమెను వెంటపెట్టుకుని బయటకు నడిచాడు. గది తలుపులు దగ్గరగా లాగాడు.

రూం నెంబర్ 20లో ప్రవేశించారు యిద్దరూ.

"ఆమె ఎవరు?" అడిగాడు గోపాలం.

గీత తల అడ్డంగా త్రిప్పింది.

ఆమె ప్రసక్తి వచ్చేసరికి గీత గడగడలాడుతోంది,

"మరి నీ గదిలోకి ఎలా వచ్చింది?"

"తెలియదు."

"గీతా! ఏం జరిగిందో చెప్పు. మనం త్వరగా లాడ్జిని వదలిపెట్టి పారిపోవాలి!"

"రాత్రి పదకొండయిందేమో—నేను నీ గదిలోంచి బయటపడాలనుకుంటున్నాను. బయట వరండాలో చప్పుడయింది. ఎవరో నడుస్తున్నారు. అతడి అడుగులు బరువుగా పడుతున్నాయి. నాకు భయంవేసింది.

అడుగుల చప్పుడు నా గది ప్రాంతంలో ఆగింది.

నాకు తలుపు తెరచి చూడాలనిపించింది! చూశాను.

నడవాలో ఎవరూ లేరు.

నడవాలో చప్పుడు చేసినవాళ్ళు ఎక్కడ వున్నారు?

నాకు భయంవేసి తలుపు మూశాను. నిన్ను లేపాలని ప్రయత్నించాను. కాని నువు మత్తుగా నిద్రపోయావు. పావుగంట గడిచింది.

ఏమయితే అయిందని నా గదివైపు వెళ్ళాను.

నా గది తలుపు తెరచి వుంది.

గదిలోపలకు వెళ్ళాను.

బెడ్ మీద ఎవరో యువతి పడుకునివుంది. ఆమె గురించే నేను నీతో ముచ్చటించబోయింది.

ఆమె నా గదిలోకి ఎలా వచ్చింది? ఎందుకు వచ్చింది? ఆమె వెంట వుండవలసిన యువకుడు ఎక్కడ వున్నాడు.

మంచంమీదుగా ఒంగి ఆమె మొహంలోకి చూశాను. అంతే నాకు మొహం తిరిగింది.

నేలమీద పడిపోవడం మాత్రం గుర్తుంది" అంది గీత, బలంగా వూపిరి పీల్చుకుంటూ.

గోపాలం తల విదిలించాడు.

శవం గీత గదిలోవుంది. హాత్య రూం నెంబర్ 19లో

జరిగివుండాలి. అందుకే గీత గదిలోని బెడ్ మీద ఎక్కువ రక్తంలేదు.

ఆమె మీద అతడికి కోపం దేనికి?

ఎంత కోపం వుంటేమటుకు అలా మొహం తరగడం దేనికి?

ఇప్పుడు ఆమె హత్య విషయంలో తాము నిర్దోషులం అనే సంగతి ఎలా నిరూపించుకోవడం?

"గీతా! మనల్ని ఏదో సైతాను వెంటాడుతోంది" గోపాలం చకచక తన వస్తువులు సర్దుకున్నాడు.

ఇద్దరూ నడవాలోంచి నడిచి లాడ్జిలోంచి బయట పడ్డారు.

## 9

"మీరు దాచకుండా అన్ని విషయాలు చెప్పినట్టేనా?" అడిగాడు డిటెక్టివ్ శిరీష్ కుర్చీలో వెనక్కివాలి.

గోపాలం తలూపాడు.

"మీ వెంట గీతను తీసుకువచ్చి వుండవలసింది!"

"నిజమే సార్! కాని ఆమె స్టోర్‌లో వుండవలసి వచ్చింది."

"గీతతో మీరు శృతిమించి వ్యవహారించడంలో అర్థం లేదు!"

గోపాలం తలొంచుకున్నాడు.

"అవతల జానకిని ఒంటరిగా వదిలిపెట్టారు. ఇటు గీతతో ప్రణయకలాపాలు సాగించారు. ఇంతకంటె నయవంచన ఏం వుంది?" అని, "గీతను కలుసుకుందాం పదండి!" శిరీష్ లేచాడు.

ఇద్దరూ ఎక్కి కూర్చున్న డాట్సన్ కారు సింహాచలం

చేరుకుంది.

"గీతా! వీరు డిటెక్టివ్ శిరీష్. మన వ్యవహారంలో డిఫెన్స్ తీసుకోమని రిక్వెస్టుచేసి తీసుకు వచ్చాను" అన్నాడు గోపాలం, గీతను, శిరీష్కు పరిచయంచేస్తూ.

గీత వులిక్కిపడింది. అన్యమనస్కంగా నమస్కారం పెట్టింది.

గీత కళ్ళలో నిస్సహాయత!

"గీతా! ఏమిటలా వున్నావు? ఏం జరిగింది?" అడిగాడు గోపాలం.

"ఏం జరిగిందో నేను చెప్పలేను క్షమించండి" అంది గీత.

గోపాలం విస్తుబోయి చూశాడు.

"గీతా! నువ్వు ఎవరితో మాట్లాడుతున్నావు? మనం ఏ కేసులోనూ ఇరుక్కోనక్కరలేదు. అందుకే...." అన్నాడు గోపాలం.

"చెబితే అతడు నన్ను చంపేస్తాడు!"

"అతడా? అంటే...!"

"అజంతా లాడ్జిలో రూం నెంబర్ 19లో దిగిన అతడు."

"మై గుడ్ నెస్! అతడు నీకు కనిపించాడా?"

"కనిపించలేదు. వుత్తరం పడేశాడు. కస్టమర్స్తో నేను వ్యవహరించేటప్పుడు అతడు వుత్తరం నా బల్లమీద పెట్టివుండాలి."

"ఉత్తరంలో ఏం వుంది?"

వుత్తరం తీసి ఇచ్చింది. శిరీష్ అందుకొని చదివాడు.

"నీ పేరు గీత అని తెలిసింది. నేను నిన్ను

కనిపెట్టే వుంటాను. నువు నా పోలికలు చెప్పావా
నీ ప్రాణాలు ఎగిరిపోతాయి.

—వెంటాడే మృత్యువు."

"కారు ఎక్కండి. ఇంటికి వెళ్దాం" అన్నాడు శిరీష్.

"శిరీష్‌గారూ! అతడు నా ప్రాణాలు తీస్తాడు. మీరు యిద్దరూ వెళ్ళండి" అంది గీత. ఆమె గొంతులో దుఃఖం పొంగింది.

"గీతా! ఆ వ్యక్తిని గోపాలం చూశాడు. నువ్వూ చూశావు. అయినప్పటికీ అతడు నిన్నే బెదిరించాడు."

"అవును. అది నా దురదృష్టం!"

"నాన్సెన్స్! దురదృష్టం అన్న ముక్కకి అర్థంలేదు. నీకు అతడు ఎక్కడో పరిచయస్తుడు. నిన్ను అతడు అజంతా లాడ్జిలో చూశాడు....తనని నువు గుర్తుపట్టినట్టు భ్రమించాడు. అందుకే నీ గదిలో శవాన్ని వుంచాడు. నిన్ను దిగ్భ్రాంతిలో ముంచాడు."

గీత ఆలోచనలో పడింది.

"మీరన్నమాట నిజమే కాబోలు! నాకు అతడు చిరపరిచయస్తుడిలాగా అనిపించాడు."

"గీతా! నువు పరిచయస్తులను వాళ్ళ ఆకారాలనూ లిస్టురాయి" అన్నాడు శిరీష్.

ముగ్గురూ డాట్సన్‌లో కూర్చున్నారు.

కారును ప్రక్క రోడ్డులోకి మళ్ళించాడు శిరీష్.

పెంకుటింటిముందు ఆగింది కారు.

ఇంటి తలుపులు బార్లా తెరచి వున్నాయి.

గోపాలం కారులోంచి దూకి లోపలకు పరుగెత్తాడు, శిరీష్, గీత అతడిని అనుసరించారు.

గోపాలం పిచ్చికేకలు వేశాడు.

శిరీష్ గుమ్మంవద్ద ఆగాడు, లోపలకు చూశాడు. గోపాలం మంచంవద్ద ఆగాడు.

జానకి మంచంమీద స్పృహతప్పి వుంది.

ఆమె ఒంటిన నూలుపోగయినాలేదు.

శిరీష్ చటుక్కున దుప్పటిలాగి ఆమెమీద కప్పాడు. చెయ్యిపట్టుకు చూశాడు. నాడి మామూలుగానే కొట్టు కుంటోంది.

"ఈమె స్పృహ తప్పింది. కేవలం భయంవలన!" అన్నాడు శిరీష్. చేతిని విడిచిపెట్టి తలవైపు చూశాడు.

తలగడమీద చిన్న చీటీ వుంది.

"గోపాలం! నీ పెళ్ళాం రేప్ అవుతుంది
జాగ్రత్త. నువ్వు నా మాట మరచిపో....గీతతో
బాటు ఖతంకాగలవు!

—వెంటాడే మృత్యువు."

చదివాడు శిరీష్.

"ఇంతవరకూ నయం! ఈమెమీద అఘాయిత్యం జరగలేదు" నిట్టూర్చాడు శిరీష్.

శిరీష్ మాట ముగియకముందే ఇంటిముందు ఏదో వాహనం ఆగినట్టయింది. శిరీష్ అటు చూశాడు.

క్రైంబ్రాంచ్ ఇన్స్పెక్టర్ కుమార్ బూట్లు టకటక లాడించుకుంటూ లోపలకు రాసాగాడు.

శిరీష్‌ను చూసి నుదురు చిట్లించాడు.

"నేరస్థులను కాపలా కాస్తున్నావన్నమాట!" అన్నాడు కుమార్, బలవంతంగా నవ్వు తెచ్చుకుని.

శిరీష్ నవ్వి, "నేరస్థులెవరు?" అన్నాడు.

"గోపాలం! ఇతడే ననుకుంటాను!" అన్నాడు కుమార్, గోపాలంవైపు లాఠీ జాడించి.

"నేరం ఏమిటి?"

"గీతను అనకాపల్లిలో అజంతా లాడ్జిలో చంపినందుకు!"

"గీతనా?" శిరీష్ ముక్కుపుటాలు బిగించాడు.

"అవును ఆమెను గుర్తుపట్టకుండా మొహం తరిగి పారేశాడు రాస్కెల్!"

"గీత చనిపోయినట్టు ఎలా తెలిసింది?"

శిరీష్‌ను పసిపిల్లవాడిని చూసినట్టు చూశాడు.

"లాడ్జి రిజిష్టర్‌లో రూం నెంబర్ 21లో వున్నది గీత. 20లో గోపాలం. గీతను ఏ కారణంతో చంపాడో" మంచంవైపు చూశాడు కుమార్.

"ఆమె ఎవరు?" అడిగాడు.

"జానకి! గోపాలం భార్య."

"జానకా? గోపాలంతో జానకి లేచివెళ్ళినట్టూ, అతడిని పట్టుకోమని మాకో కంప్లయింట్ కూడా అందింది."

గోపాలం, శిరీష్ మొహాలు చూసుకున్నారు.

# 10

"హత్య జరిగిన గదికి తాళంపెట్టారా?" అడిగాడు డిటెక్టివ్ శిరీష్.

"అవున్సార్! పోలీసులు ఆదేశించారు" అన్నాడు హోటల్ మేనేజర్.

శిరీష్ తన జేబులోంచి కాగితం తీసి చూపించాడు. ఎస్. పి. ఇచ్చిన పర్మిషన్ వుత్తరం. శిరీష్‌కి పరిశోధనలో సహాకరించమని అందులో వుంది.

"మీకు ఏం కావాలో అడగండి సార్?" అన్నాడు మేనేజర్,

"హత్య జరిగిన గదిని ఒకసారి చూపిస్తారా?"

హోటల్ మేనేజర్ మేడమీదకు దారితీశాడు. రూం నెంబర్ 21 తాళం తెరిచాడు.

శిరీష్ తల పంకించాడు.

హత్య జరిగింది రూం నెం 21లో కాదు, 19లో. రూం నెంబర్ 21లో గీత వుండవలసింది. గీత బతికే వుంది. ఆ విషయం తాను రుజువుచేస్తేకాని కుమార్ నమ్మలేదు.

"రూం నెంబర్ 19లో ఎవరున్నారు?"

"ఫామిలీ దిగారు సార్!"

"ఎప్పటినుండీ?"

మేనేజర్ గుర్తు తెచ్చుకున్నాడు. "హత్య జరిగిన నాటి రాత్రే సార్!" అన్నాడు.

"హత్య అయిన స్త్రీ ఆ ఫామలీలో స్త్రీ కదా!"

"నాకు గుర్తు లేదు సార్! రోజూ ఎందరో వస్తోంటారు. పైగా శవం మొహం చెక్కివుంది."

శిరీష్ పళ్ళు బిగించాడు.

"హంతకుడు అస్పష్టంగా కనిపిస్తున్నాడు. దొరికినట్టే దొరికి మాయమవుతున్నాడు" గొణుక్కున్నాడు. "రూం నెంబర్ 19లో దిగిన దంపతులు హత్య జరిగిన తర్వాత కనిపించారా?"

"లేదు సార్! అతడు నాకు వారంరోజుల అడ్వాన్స్ యిచ్చాడు. తాళంచెవి అతడు కౌంటర్‌లోనే వుంచి వెళ్ళాడు."

"కాని ఆ గది దంపతుల స్వాధీనంలోనే వుంది."

"అవును సార్!"

"ఆ గది తెరిపించాలి!"

"సారీ సర్! మా ప్రొప్రయిటర్ ...."

నడవాలో బూట్లు టకటకలు వినిపించాయి. ఇన్స్పెక్టర్ కుమార్ గదిలోకి వచ్చాడు.

రూం నెంబర్ 19 తెరిపించడం శిరీష్‌కి కష్టంకాలేదు. గదిలో రెండు బెడ్స్ వున్నాయి. రెండింటిలో ఒక బెడ్ మీద దుప్పటి చెదిరిపోయివుంది.

"హత్య ఎలా జరిగింది?"

"ఆమెను గొంతు నులిమి హత్య చేశాడు."

శిరీష్ దుప్పటి చెదిరిన బెడ్ మీదకు చూశాడు. దుప్పటి మీద ఎండిపోయిన రక్తం చుక్కలున్నాయి. వాటికి దూరంగా రక్తం తుడిచినట్టు పెద్ద మరకవుంది. దుప్పటి మీద మడతలలోంచి రెండు గాజుముక్కలు కనిపిస్తున్నాయి.

డిటెక్టివ్ శిరీష్ జేబురుమాలుతో గాజుముక్కలు అందుకున్నాడు.

"శవం చేతికి ఈ గాజులున్నాయి కదూ!"

"గాజులు లేవు!"

శిరీష్ నుగురు చిట్లించి గదిని పరకాయించి చూశాడు. చటుక్కున బాత్ రూంలోకి ప్రవేశించాడు. బాత్ రూంలో తరిగిన పనసపొట్టులాగా మాంసంముక్కలూ, పెచ్చులు కట్టిన రక్తమూ....పగిలిన గాజుముక్కలూ....

"కుమార్! ఈ గదిలో వ్రేలిముద్రలు దొరుకుతాయి. నేరస్తుడు మీ పోలీసు రికార్డ్సుకి కొత్త అయివుంటే...."

"పోలీస్ డాగ్స్ వున్నాయి కదా!"

"ఆల్ రైట్! దుప్పటిమీద తుడిచిన రక్తం మరక వుంది. హతురాలి రక్తం మరకను తుడిచే అవసరం

వుండదు.... బహుశా.... ఆ మరక...."

"స్పెసిమన్ ఎనలైజ్ చేయిస్తాను!"

## 11

బల్లమీది టెలిఫోన్ గణగణలాడింది.

శేట్ కరణ్ సింగ్ రిసీవర్ ఎత్తాడు.

"సార్! నేను గోపాలాన్ని మాట్లాడుతున్నాను."

"చెప్పు. ఎక్కడినుండి మాట్లాడుతున్నావు?"

"సింహాచలం పోస్టాఫీసునుండి సార్! గీతను ఎవరో చంపేశారు."

"ఆఁ! నిజమేనా? ఎక్కడ? ఎప్పుడు? ఎందుకు?"

"ఆ విషయం నేను చెబుతాను!"

శేట్ కరణ్ సింగ్ వులిక్కిపడి వెనక్కి చూశాడు.

డిటెక్టివ్ శిరీష్ చేతిలో పిస్తోలు నల్లగా నిగనిగలాడుతోంది.

"ఎవరు నువ్వు? ఏమిటిది?" అన్నాడు కరణ్ సింగ్, రిసీవర్ ని క్రెడిల్ చేయబోతూ.

"రిసీవర్ క్రెడిల్ చేయక! అలాగే చేతులు ఎత్తి వుంచు!"

"నా లాయర్ ను పిలుస్తాను. నా ఆఫీసులో దౌర్జన్యం ఏమిటి? అందులోనూ నా మీద నే?"

"నువ్వు అజంతా లాడ్జిలో పేరు తెలియని యువతిని చంపావు. నీ వ్రేలిముద్రలూ, రక్తం గ్రూపూ సరిపోయాయి. రెండు రోజులుగా నిన్ను వెంటాడాను. నీ వ్రేలిముద్రలు సేకరించాను. లాడ్జిలోని దుప్పటి మీది రక్తపు మరక నీ రక్తం గ్రూపుది. యీ విధంగా నే ఇప్పటికి పదిమంది అమ్మాయిలను వివిధ పట్టణాలలో చంపి తప్పించుకు తిరుగుతున్నావు—"

"డామె నాన్సెన్స్! అదంతా నాకు తెలియదు. ఇపుడే గీత చనిపోయినట్లు వార్త వచ్చింది. హంతకు డెవడో తెలివిగా నా మీదకు...."

"గీతను హత్యచేసే నువు సులువుగా దొరికావు. గీత నిన్ను గుర్తుపట్టింది. ఆమె నిన్ను బ్లాక్ మెయిలు చేయ బోయింది!"

"నాన్సెన్స్! గీత నన్ను బ్లాక్ మెయిల్ చేయడం ఏమిటి?"

శిరీష్ వ్యంగ్యంగా నవ్వి, జేబులోంచి కాగితం తీశాడు. ఫొటో స్టాట్ కాగితం అది!

శేట్ కి అందించాడు. శేట్ చదువుతున్నాడు.

"ప్రియమైన శేట్,
నిన్ను గుర్తు పట్టాను. నాకు లక్షరూపాయిలు యివ్వు. అజంతాలాడ్జి విషయం మరచిపోతాను!
—నీ ప్రియురాలు గీత."

"ఈ వుత్తరం ఆమె హాండ్ బాగ్ లో దొరికింది. ఆమెను గొంతుపిసికి చంపావు. గొంతుమీద నీ వ్రేలి ముద్రలున్నాయి. అజంతా లాడ్జిలో ఆమె గాజులు తెగి నీకు గాయమయింది. రక్తం స్పెసిమన్ దొరికింది. గీతకు నీవు వ్రాసిన బెదిరింపు వుత్తరంలో కూడా నీ వ్రేలి ముద్రలు దొరికాయి" ముగించాడు. డిటెక్టివ్ శిరీష్ శేట్ గడ్డంపట్టి లాగాడు. అది చేతిలోకి వూడివచ్చింది.

శేట్ చేతిలోని రిసీవర్ జారి పడిపోయింది.

—:అయిపోయింది:—

సీరియల్

# రక్తం త్రాగే పిశాచం

వసుంధర




(గత సంచిక తరువాయి)

దురదృష్టమేమిటంటే ఆ మిశ్రమం హడావుడిగా తయారుచేశాడాయన. పాళ్ళు గుర్తులేవు. తయారీకి ఏమి

వాడాడో మాత్రం గుర్తుంది.

ఆ రోజునుంచి ఈ రోజువరకూ కొన్ని వందల ప్రయోగాలు చేయాల్సి వచ్చింది. ఇన్నాళ్ళకు ఈ రోజు శ్రమ ఫలించింది.

"లింగం—నేను చేసిన ఒక చిన్న పొరపాటు ఇంత కష్టానికి దారితీసింది. ప్రయోగాలు చేయడంలో హడావుడి పనికిరాదు. అప్పుడే నేను తాపీగా వుండి ప్రయోగానికి సంబంధించిన అన్ని వివరాలూ రాసి పెట్టుకుని వుంటే ఇన్నాళ్ళ శ్రమ తప్పేది! ఏమైతే నేం నీ కృషితో ఫలితం సాధించావు. ఎటొచ్చీ ఈ మందు విషయమై మనం మరికొన్ని నిర్ధారణలు చేయాల్సివుంది-" అన్నాడు మహదేవుడు.

అప్పుడు ప్రొఫెసర్ చెప్పిన పరీక్షలన్నీ ఓపికగా చేశాడు లింగం.

రాత్రి మూడు గంటలకు అన్నీ ముగిశాక ఇద్దరూ పడుకున్నారు. పడుకునేముందు ప్రొఫెసర్ లింగంతో అన్నాడు—"రేపు నువ్వు సెంట్రల్ లాబరేటరీకి వెళ్ళి మన శాంపుల్ ఇన్‌స్ట్రుమెంటల్ అనాలిసిస్ చేయించాలి" అన్నాడు.

ఏడయ్యేసరికల్లా లింగం లేచిపోయాడు. ప్రొఫెసర్ కంటె ఎక్కువ ఆతురతగా ఉందతనికి. పైగు తొమ్మిదయ్యేలోగా అతను రాత్రి చేసిన శాంపుల్ లాంటివి మరికొన్ని తయారుచేసి—సెంట్రల్ లాబరేటరీకి ప్రయాణమయ్యాడు.

ఈలోగా ప్రొఫెసర్ సెంట్రల్ లాబరేటరీకి ఫోన్ చేసి—తన అసిస్టెంటును పంపిస్తున్నాననీ, అర్జంటుగా అనాలిసిస్ కావాలని చెప్పాడు. అవతలి సమాధానం

విని సంతృప్తిగా ఫోన్ పెట్టేశాడు.

లింగం తిరిగివచ్చేలోగా మహాదేవుడు శరీర నిర్మాణానికి సంబంధించిన విషయాల గురించి చదువుతూ కూర్చున్నాడు. అలా చదువుతూ ఆయన ఎన్నో పాయింట్లు నోట్ చేసుకున్నాడు.

లింగం సరిగ్గా పన్నెండింటికి తిరిగివచ్చాడు. ప్రొఫెసర్ ఆత్రుతగా—"అనాలిసిస్ వాల్యూస్ ఏవివీ" అనడిగాడు. లింగం ఆయనకా కాగితా లందించాడు.

మహాదేవుడు శ్రద్ధగా వాటిని పరీక్షించి తృప్తిగా తల తాటించాడు.

"లింగం! ఎలుకలకూ, మనిషికీ శరీర నిర్మాణంలో భేదాన్నాధారంగా చేసుకుని ఇప్పుడు నేను కొన్ని లెక్కలు తయారుచేస్తాను. ఈ మందు నుపయోగించి ఇంజక్షన్ ఎలా చేయాలో ఫార్ములా వేస్తాను. అదయ్యాకే భోజనం—ఈలోగా నువ్వు భోజనం చేసిరా!" అన్నాడు మహాదేవుడు.

ఆయన ఆ లెక్కల్లోంచి బయటపడేసరికి మూడయింది. ఓ కాగితాన్ని లింగానికిచ్చి ఆయన భోజనానికి వెళ్ళాడు. లింగం ఆ కాగితాన్ని ఆత్రుతగా చూశాడు.

• ఆ ఫార్ములా అతడికర్థంకాలేదు. ఇంతవరకూ ఎన్నడూ చూడని కొత్తరకంగా ఉందది.

మహాదేవుడు భోంచేసి వచ్చాక—"ఇది నాకర్థం కావడంలేదు సార్!" అన్నాడు లింగం.

"అందులో ఆశ్చర్యమేమీ లేదు. ఈ ఫార్ములాను నేను ఎలా తయారుచేశానో నాకు తెలియడంలేదు. నా ఎదురుగావున్న పుస్తకాలుకానీ, మనంచేసిన ప్రయోగాలు కానీ ఈ ఫార్ములాకు ఆధారంకాదు. మనం తయారు

చేసిన ద్రావకం మాత్రం ఈ ఫార్ములాలో కీల
స్థానాన్ని పొందింది. ఐన్‌స్టీన్‌కు $E = mc^2$ అని ఎలా
తట్టిందో నాకూ ఇది అలాగే తట్టింది. కానీ ఈ కాగిత
చాలా ముఖ్యం. ఇది పోతే నేను మళ్ళీ ఇలాంటి
తయారుచేయగలనో లేదో—" అన్నాడు మహాదేవుడు.

"ఇదంతా నాకు చాలా థ్రిల్లింగ్‌గా ఉందండి. మ
మొదటి ప్రయోగం ఎప్పుడు చేస్తామో తెలియదు—
శుభ క్షణంకోసం నేను ఆత్రుతగా ఎదురు చూ
న్నాను—" అన్నాడు లింగం.

"కంగారుపడకు. ఆ శుభదినం త్వరలోనే రానున్నది
ఎటొచ్చీ అందుకు మనకొక శవం కావాలి— ...
అన్నాడు మహాదేవుడు.

"శవమా?" అని ఉలిక్కిపడ్డాడు లింగం. అందుల
ఆశ్చర్యమేమున్నది? చచ్చిన మనిషిని బ్రతికిం
ప్రయోగం శవంలేనిదే ఎలా ముందుకు సాగుతుంది?

"శవమంటే మామూలు శవం కాదు. తాజా శవం'
అన్నాడు మహాదేవుడు.

"తాజా శవం ఎలా దొరుకుతుంది సార్! ఈ ఊళ
జబ్బుతో వున్నవాళ్ళ లిస్టులన్నీ సంపాదించాలి మనం

"అంత కంగారుపడకు నాయనా!" అని నవ్వ
మహాదేవుడు—"ప్రతిరోజూ శవాల్ని ఉత్పత్తిచే
కర్మాగారం ఒకట ఈ ఊళ్ళో వుంది. దాని
ధర్మాసుపత్రి—"

"మీ అయిడియా బాగానే ఉంది సార్! 
ధర్మాసుపత్రికి వచ్చేమనుషులే కుళ్ళిన శవాల్లా వుంటా
అక్కడ తాజా శవాలు దొరుకుతాయంటారా?" అంట
ధర్మసందేహం వెలిబుచ్చాడు లింగం.

"అంతగా తాజా శవం దొరక్కపోతే—ప్రయోగం మానుతామా? హత్యచేసైనా తాజా శవాన్ని తయారు చేస్తాం?" అన్నాడు మహాదేవుడు.

లింగం ఉలిక్కిపడి—"హత్యా? ఎవర్ని" అన్నాడు.

"ఎవడో ఒకడు ఆ సమయానికి దొరక్కపోడులే-" అన్నాడు మహాదేవుడు.

## 9

అమావాశ్య ఇంక రెండు రోజులే ఉంది. వకుళ మధుతో తన స్నేహాన్ని పునరుద్ధరించడానికి ఆత్రపడు తోంది. ఆమెకు అవకాశం రావడంలేదు. ఆ రోజున ఆమె తెగించింది.

ముందుగానే సీటుగా ముస్తాబయింది. మధు వీధిలోంచి ఎప్పుడు వెడతాడా అని ఎదురు చూస్తోంది. అతనలా వెళ్ళడం చూడగానే—కాస్త దూరం వెళ్ళనిచ్చి తనూ వీధిలోకి వెళ్ళింది.

ఆమె వీధిలోకి వెళ్ళడం శారద చూడలేదు.

వకుళ త్వరత్వరగా అడుగులువేసి అవతల వీధిలో మధును కలుసుకుని—"మధూ!" అంది.

మధు ఆశ్చర్యంగా ఆమెను చూసి—"నువ్వా?" అన్నాడు.

"నీతో మాట్లాడాలి. అలా పార్కుకి వెడదామా?" అడిగింది వకుళ.

మధు వెంటనే అంగీకరించాడు. ఇద్దరూ దగ్గర్లోనే ఉన్న పార్కుకి వెళ్లారు.

"నువ్వు మళ్ళీ నన్ను కలుసుకుందుకు రాలేదు—" నిష్ఠూరంగా అంది వకుళ.

"మీ పిన్ని చేసిన గొడవ మామూలుగా. అందులోంచి

బైటపడ్డానికి నోటికొచ్చిన అబద్ధమాడేశాను. ఆ తర్వాత నువ్వు నన్ను అసహ్యించుకుంటావేమోనని భయంవేసింది. నిజం చెప్పొద్దూ—కాస్త సిగ్గేసింది కూడా!" అన్నాడు మధు దీనంగా ముఖంపెట్టి.

"మధూ—నేను నిన్ను ఎంతగా ప్రేమిస్తున్నానంటే—నువ్వెంత తప్పుచేసినా క్షమించేయగలను. నీ రాకకోసం నేనెంత తపించిపోతున్నానో నీకు తెలియదు. నీకోసం ఇటీవల మా పిన్నిని కూడా ఎదిరిస్తున్నాను. ఎవర్నీ లెక్కచేయడం మానేశాను. ఇది కనిపెట్టే మా పిన్ని తన తమ్ముడు కోదండాన్ని రప్పించింది. వాణ్ని నన్ను లొంగదీసుకోమని ఉసిగొల్పింది కూడా. కోదండానికి నేను స్పష్టంగా చెప్పాను—నా హృదయం మధుకే అంకితమైపోయిందని. కోదండం తన ప్రయత్నాలు మానలేదు. ఆఖరికి ఓ రోజున వాడు చాలా దూరంవెళ్ళి నన్ను బలవంతం చేయబోయాడు. అందుకు అవసరమైన పరిస్థితులు పిన్ని కల్పించింది—"

"అప్పుడేం జరిగింది?" ఆత్రుతగా అడిగాడు మధు.

"కోదండం బుర్ర రామకీర్తన పాడించాను. ఇప్పుడు హాస్పిటల్లో వున్నాడు—" అంది వకుళ.

మధు ఉలిక్కిపడి అప్రయత్నంగా తన తల తడుముకున్నాడు.

వకుళ నవ్వి—"ఇప్పుడు నేను కష్టపడి నీ వెనకాలే ఎందుకొచ్చానో తెలుసా? కోదండం మళ్ళీ మనుషుల్లో తిరిగేలోగా—నేను నీదాన్ని కావాలనుకుంటున్నాను. అందుకు పెళ్ళి చేసుకోవాలన్న ఆంక్ష కూడా విధించను. ఒక్కసారి మనం కలిసి గడిపితే—మనిద్దరికీ వివాహమైపోయిందనే భావిస్తాను నేను. ఆ తర్వాత అంతా నీ

నిజాయితీకే విడిచిపెడుతున్నాను—" అంది.

మధు శరీరంలో సంచలనం కలిగింది. మనసుకు త్సాహం కలిగింది. కానీ అతను అంతా దాచుకుందుకు ప్రయత్నిస్తూ- "అయితే ముహూర్తం ఎప్పుడు?" అన్నాడు.

"ముహూర్తమే అది—నాకు బాగా అచ్చివచ్చిన రోజు. ఎల్లుండి రాత్రి పన్నెండు గంటలకు నువ్వు మామూలుగా గోడ మీదకి రా. నీ కోసం ఎదురు చూస్తూంటాను—" అంది వకుళ.

మధు తల ఊపాక వకుళ అక్కణ్ణించి లేచి ఇంటికి వెళ్ళిపోయింది. ఆమె ఇంట్లో అడుగుపెడుతూండగానే—"ఎక్కడికెళ్ళావ్?" అనడిగింది శారద.

"ఎక్కడికో అక్కడికి—" అంది వకుళ నిర్లక్ష్యంగా.

"వయసొచ్చిన పిల్లవు. సిగ్గులేదూ — ఇష్టమొచ్చినట్లు తిరగడానికి ...."

"వయసొచ్చిన పిల్లనని తెలిసేకదా—నీ తమ్ముణ్ణి నామీద కుసిగొల్పావు. అంతకంటే ఎక్కువగా నేనేం చెడిపోలేదులే—" అంది వకుళ నిర్లక్ష్యంగా.

ఏం మాట్లాడాలో శారదకు తెలియలేదు. పిల్లిలా పడుండే వకుళ ఏం చూసుకుని తన్నిలా ఎదిరిస్తోందో ఆమెకు అర్థంకావడంలేదు. కానీ ఆమెలో ఉక్రోషం పెరిగిపోతోంది.

వకుళ తెగించింది. ఇంట్లో ఎవర్నీ లక్ష్యపెట్టడం లేదు సరిగదా—చంపుతానని బెదిరించింది కూడా! దాని బ్రతుకేమిటో దానికి తెలియాలంటే ఒక్కటే మార్గం....

శారద ఆ సాయంత్రం హాస్పిటల్ కు వెళ్ళి కోదండంతో మంతనాలాడింది.

"ఆ వళుళ నువ్వు చావలేదని బాధపడుతుందిరా! ఈసారి నిన్ను చంపేస్తానని కూడా అంది. దానికి గర్వం బాగా పెరిగిపోయింది. ఎలాగో దానికి బుద్ధి చెప్పాలి!" అంది శారద.

కోదండం పళ్ళు పటపట లాడించాలనుకున్నాడు గానీ తలమీది గాయం అందుకు సహకరించలేదు.

"దానికి నిజంగానే బుద్ధి చెప్పాలే! ఒక్కటే ఉపాయం కనబడుతోంది నాకు ...." అన్నాడు కోదండం.

"ఏమిటది?"

"నా స్నేహితుడొకడున్నాడు. ఫోన్ నంబరిస్తాను. అతడికి ఫోన్ చేసి నా దగ్గరకు పంపించు. అన్ని ఏర్పాట్లూ జరిగిపోతాయి—" అన్నాడు కోదండం.

"ఎలా—?"

"ఆడవాళ్ళను క్రూరంగా హింసించగల వాడొకడున్నాడు. వాడి పేరు జగ్గు. జగ్గును ఒక రాత్రి వళుళ మీదకు వదిలిపెడతాను. అందుకు నీ సహకారం అవసరం—"

"అదేమిట్రా—దాన్ని నువ్వు పెళ్ళిచేసుకోవూ?" అంది శారద.

"పెళ్ళా? దాని బ్రతుకు కుక్కలు చింపిన విస్తరి చేయడమే నా ధ్యేయమిప్పుడు!" అన్నాడు కోదండం.

శారద హాస్పిటల్లోని ఫోన్ ఉపయోగించి కోదండం చెప్పిన నంబరుకు అతడు కోరిన సందేశాన్నందించింది—

"నన్ను మళ్ళీ ఎప్పుడు రమ్మంటావురా?" అడిగిందామె.

"రేపుదయం వచ్చావంటే ముహూర్తం చెబుతాను-" అన్నాడు కోదండం.

లాబొరేటరీలో ఇంజక్షన్ ముందు తయారుచేస్తున్నాడు లింగం.

మహాదేవుడు డ్రాయింగ్ రూంలో కూర్చున్నాడు. సరిగ్గా అప్పుడే కాలింగ్ బెల్ మ్రోగింది. కాసేపటికి ఒక మధ్య వయస్కుడు గదిలో అడుగు పెట్టాడు.

"అరే — అన్నయ్యా!" అన్నాడు మహాదేవుడు ఆశ్చర్యంగా.

మహాదేవుడి అన్నయ్య శివశంకరం అక్కడే ఓ కుర్చీలో కూలబడి—"నీ దగ్గరకు రావాలని చాలా కాలంనుంచి అనుకుంటున్నాను. కానీ ఇలా వస్తానని ఎప్పుడూ అనుకోలేదు—" అన్నాడు.

"ఏమయిందన్నయ్యా?" అనడిగాడు మహాదేవుడు.

"మృతసంజీవనీ మూలిక గురించి పుస్తకాలు తిరగేస్తూండగా ఓ విచిత్రమైన విషయం బయటపడింది. ఇంతవరకూ ఎవ్వరూ దాన్ని గమనించినట్లు లేదు-" అన్నాడు శివశంకరం.

"ఏమిటది?"

"ఒక శ్లోకం భావం నాకు సరిగ్గా అర్థంకాలేదు. నిఘంటువు దగ్గర పెట్టుకుని దానికి ఎన్ని రకాల అర్థాలు సాధ్యపడతాయో విచారించాను. ఆ ప్రకారం ఒక విచిత్రమైన శక్తి గురించి తెలిసింది. అది మానవ మేధకు అందని శక్తి. అత్యంత బలవత్తరమైన శక్తి. కానీ అది దుష్టశక్తి! ఆ దుష్టశక్తిని పూర్వం భద్రుడనేవాడు వశపర్చుకుని—ప్రపంచాన్ని అట్టుడికించాడు—" ఆగాడు శివశంకరం.

"ఇలాంటి మాంత్రికుల కథలు మన గ్రంథాల్లో చాలా

చదివాం కదా!" అన్నాడు మహదేవుడు.

"ఇది మాంత్రికుడి కథ కాదు. దుష్టశక్తి మంత్రాలతో కాదు తయారుచేస్త - మందులతో! ఆ మందులుపయోగిస్తే ఎవరైనా ఆ దుష్టశక్తిని తయారు చేయవచ్చు—" అన్నాడు శివశంకరం.

"ఆ వివరాలన్నీ నీ దగ్గరున్నాయా?"

"లేవు. కానీ దుష్టశక్తిని తయారుచేయడానికి శవాల్నుపయోగిస్తారని మాత్రం ఆ శ్లోకంలో రాసివుంది. వివరాలను సదానందుడనే రచయిత శక్త్యోపాఖ్యానం అనే గ్రంథంలో పొందుపరిచినట్లు కూడా అక్కడ తెలుపబడింది—"

"శక్త్యోపాఖ్యానం నా దగ్గర ఉండాలనుకుంటూనే?" అన్నాడు మహదేవుడు.

"అందుకే నీ దగ్గరకు వచ్చాను. ఒక్కసారి ఆ గ్రంథం చూసేవరకూ నాకు మనశ్శిమితం లేదు—" అన్నాడు శివశంకరం.

అన్నదమ్ముద్దరూ లేచి పుస్తకాల బీరువా దగ్గరకు వెళ్ళారు. అందులోని పుస్తకాలన్నీ అక్షరక్రమంలో సర్ది వున్నాయి. అందువల్ల వెతకడం సులభంగానేవుంది. శక్త్యోపాఖ్యానం ఆ బీరువాలో లేదు.

"ఏమయింది చెప్మా?" అనుకుంటూ మహదేవుడు అక్కడున్న చిట్టా తీశాడు. ఇంట్లోని పుస్తకాలను బయటివారి కివ్వడం ఆ చిట్టాలో నోట్ చేసుకున్నాకనే జరుగుతుంది. అయితే ఈ పుస్తకం ఎవరికి ఇచ్చినట్టులేదు.

"పుస్తకం ఏమవుతుంది?" అని ఆలోచిస్తూ ఆఖరికి లింగాన్ని పిలిచాడు మహదేవుడు.

"సార్!" అంటూ పరుగున వచ్చాడు లింగం.

"బీరువాలో కొన్ని పుస్తకాలు లేవు. వాటి పేర్లు చిట్టాలోనూ లేవు. ఏమయ్యాయంటావు?"

లింగం తడుముకోకుండా జవాబిచ్చాడు—"మనం నాలుగు పుస్తకాలను బైండింగు కిచ్చాం. అందులో శక్త్యోపాఖ్యానం ఉన్నదో లేదో డైరీ చూసి చెబుతాను" అంటూ పదినిముషాల్లో తిరిగివచ్చి - "రెండు నెలల క్రితం మనం మొత్తం నాలుగు పుస్తకాలు బైండింగు కిచ్చాం. వాటిలో శక్త్యోపాఖ్యానం ఉంది. బైండరు దగ్గర్నుంచి మనకు మూడు పుస్తకాలే తిరిగొచ్చాయి. వాటిలో శక్త్యోపాఖ్యానం లేదు—" అన్నాడు.

"అందుకు బైండరేమన్నాడు?" ఆత్రుతగా అడిగాడు మహాదేవుడు.

"ఆ పుస్తకం పొరపాటున మరో కస్టమరుకు వెళ్ళిపోయిందట. ఆయనేమో ఊరికిపోయాడట. ఆయన తిరిగిరాగానే అడిగి తీసుకుని ఇస్తానన్నాడు—" అన్నాడు లింగం.

"ఆ తర్వాత మనకివ్వడం మరిచిపోయుంటాడు. వెళ్ళి నువ్వా పుస్తకం తీసుకునిరా—" అన్నాడు మహాదేవుడు.

"మరో పది నిముషాల్లో నా ప్రయోగం పూర్తవుతుంది. అప్పుడు వెడతాను—" అన్నాడు లింగం.

"నాకు మళ్ళీ చెప్పక్కర్లేదు. ప్రయోగం పూర్తి చేసుకుని అలా వెళ్ళిరా—" అన్నాడు మహాదేవుడు.

లింగం వెళ్ళిపోయాడు.

"నాకు చాలా అనుమానంగా ఉంది. ఎవరో ఆ పుస్తకాన్ని చదివి అందులోని విశేషాన్ని గ్రహించారు. అందుకే ఆ పుస్తకం మాయమయింది—" అన్నాడు శివశంకరం.

"పరిస్థితుల్నిబట్టి అలా అనుకోవలసొస్తోంది. కానీ నాకు మాత్రం నీ అనుమానం సరైనదికాదనిపిస్తోంది—"

"మహాదేవుడూ—నా బాధ నీకు తెలియదురా— దుష్టశక్తిని తయారుచేసే అత్యంత సులభ పద్ధతి అందులో నిక్షిప్తమై ఉందని నా అనుమానం. మానవుడెదిరించలేని దుష్టశక్తి మానవుడిచేతనే తయారయిందంటే — అది మానవజాతికి ఎంత అనర్ధదాయకమో—నీకు నేను వేరే చెప్పాలా?" అన్నాడు శివశంకరం.

"బాధపడకు అన్నయ్యా—దుష్టశక్తులు తయారైతే వాటికి విరుగుడు కనిపెట్టడంలో నా సర్వస్వం ధార పోస్తాను తప్పితే చూస్తూ ఊరుకోను. అయినా మన పుస్తకం పరాయివాడి చేతిలో పడిందనీ, అందులోని విషయాలు ఇతరులెవరో గ్రహించారని నేను నమ్మడంలేదు. కాసేపు వేచి చూద్దాం—" అన్నాడు మహాదేవుడు.

ఓ గంటపోయాక లింగంవచ్చాడు. బైండర్ ఆయన్ని పుస్తకం అడగడం మర్చిపోయాడు. ప్రస్తుతం ఆయన మళ్ళీ ఊళ్ళో లేడుట. వారం రోజుల్లో రావచ్చునట.

"మీ పుస్తకానికేం ఢోకాలేదుసార్ —తిరిగి యిచ్చే పూచీ నాది—" అన్నాడట బైండర్.

"సరేలే — ఇక్కడుండి నేనేం చేస్తాను? వారం రోజులు పోయాకే వస్తాను. ఈలోగా పుస్తకం సిద్ధం చేసివుంచు. నువ్వు మర్చిపోకు సుమా?" అన్నాడు శివ శంకరం.

"లింగం! మా అన్నయ్యకు శక్త్యోపాఖ్యానం పుస్తకం అందించే బాధ్యత నీది!" అన్నాడు మహాదేవుడు.

లింగం తలాడించి లాబరేటరీకి వెళ్ళిపోయాడు.

శారద, నాగేశ్వరావు, పిల్లలు సినిమాకు బయల్దేరారు.

"సిటీమధ్య తిరుగుళ్ళు ఎక్కువయ్యాయి. అందువల్ల ఈ జాగ్రత్త తీసుకోక తప్పడంలేదు—" అంటూ శారద వకుళను ఓ గదిలో ఉంచి గొళ్ళెంవేసి—వీధి తలుపు తాళంవేసి వెళ్ళిపోయింది.

"వెళ్ళు—ఇంకెన్నాళ్ళు? నా పగ తీరే రోజు దగ్గర పడింది. రేపే అమావాస్య!" అనుకుంది వకుళ.

ఆమెకు మనసులో రవంత విచారం కూడా లేదు. పైపెచ్చు మనిషి ఎంతో ఉత్సాహంగా కూడా ఉంది.

రేపు అమావాస్య రాత్రి తన దగ్గరకు మధు వస్తాడు. మొదటి ప్రయోగం అతడిమీద నే చేస్తుంది. ఆ తర్వాత తను పిన్నినీ, తండ్రినీ ...పగబట్టిన వారందరినీ.... ఈ యావత్ప్రపంచాన్నీ ఒక ఆట ఆడిస్తుంది.

"అమ్మా—నా కోరిక ఈడేరుతోంది. నేను ఇంత కాలం బ్రతికున్నదిందుకేనమ్మా-" అంది వకుళ మనసులో తల్లిని తలచుకుంటూ. తర్వాత ఉత్సాహం పెచ్చు మీరగా కాసేపు ఆడి పాడింది. ఆఖరికి అలసిపోలసి—గదిలో నేలమీద నిద్రపోయింది. నిద్ర సుఖమెరుగదు అన్నదానికి సూచనగా ఆమెకు గాఢనిద్రపట్టింది.

వీధి తాళం ఎవరో తీస్తున్న చప్పుడామెకు వినబడలేదు. తన గదిగొళ్ళెం ఎవరో తీస్తున్న చప్పుడామెకు వినపించలేదు. ఆఖరికి గదిలో ఎవరో ప్రవేశించి తన్ను కదుపుతూంటే కూడా వెంటనే ఆమెకు తెలియలేదు. అంతా తెలిసి ఆమెకు తెలివి వచ్చేసరికి ఆమె చేతులు కట్టేసి వున్నాయి. ఆమె నోట్లో గుడ్డలు కుక్కబడి వున్నాయి. కళ్ళకు ఒకే ఒక్క ఆకారం కనబడింది.

ఆరడుగుల ఎత్తు. ఎత్తుకు తగ్గ లావు. కండలు తిరిగిన వళ్ళు. ఆ వంటిని ప్రదర్శించే బట్టలు. నున్నగా గీసిన గుండు మెలితిరిగిన మీసాలు!

తన ఎదుట ఒక రాక్షసుడు నిలబడ్డాడా అనుకున్నది వకుళ. అది కలా, నిజమా? అని తటాపటాయించింది. అయినా అది అమావాస్యకాదే—అప్పుడే పిశాచాలు తన ఆధీనంలోకి వస్తున్నాయా? తన ఆధీనంలోకి వచ్చిన పిశాచమే అయితే అది తననెందుకు బంధిస్తుంది? తన నోట్లో గుడ్డలెందుకు కుక్కుతుంది?

"నా పేరు జగ్గు. కోదండం నా స్నేహితుడు. నువ్వు వాడి బుర్ర పగలగొట్టావు. నేను పగతీర్చుకుందుకు వచ్చాను...." అన్నాడా మనిషి.

అప్పటికి వకుళ వాస్తవంలోకి వచ్చింది. వీడు—ఈ ఇంట్లోకి ఎలా రాగలిగాడు? సవతితల్లి వీడికి మారు తాళాలిచ్చి ఉంటుంది. ఇదంతా ఆమెచేసిన ఏర్పాటే అయ్యుంటుంది. వకుళకు ఆవేశం వచ్చింది. కానీ అది జగ్గు నవ్వుతో భయంగా మారిపోయింది.

జగ్గు పిశాచాలకంటే భయంకరంగా నవ్వాడు. నవ్వుతూ ఆమెను సమీపించాడు.

"నేనిప్పుడు నిన్ను అనుభవిస్తాను. మనిషిలాకాదు—పిశాచంలా!" అన్నాడు జగ్గు.

వకుళ మనసులోనే భగవంతుణ్ని ప్రార్థించింది. తల్లిని వేడుకుంది తను నమ్ముకున్న పిశాచాలకు మొర పెట్టుకుంది.

"రేపు వచ్చి నాకు సహకరించవలసిన మీరు ఈ రోజే వచ్చి నన్ను బాధలు పెడతారా?" అని వాపోయింది.

ఆమె ప్రార్థనలు ఫలించలేదు. జగ్గు ఆమె వంటిమీద చేయి వేశాడు. దగ్గరగా లాక్కున్నాడు.

వకుళ ప్రతిఘటించాలనుకుంది. ఏమీ చేయలేక పోయింది.

జగ్గు అన్నమాట నిలబెట్టుకున్నాడు. వాడు పూవు మీద వాలిన తుమ్మెదలాకాక — పుష్పాన్ని నలిపే కాలులా ప్రవర్తించాడు. వకుళకు పురుషుడితో అదే ప్రథమానుభవం. అదింత భయంకరంగా వుంటుందని ఆమె కలలో కూడా ఊహించి వుండదు. జగ్గు వదిలేసరికి ఆమెకు ఇంచుమించు స్పృహ తప్పింది.

"అప్పుడే కళ్ళు మూస్తే ఎలా? అటు చూడు—" అన్నాడు జగ్గు.

నీరసంగా అటు చూసింది వకుళ. అంతే—ఆమె పై ప్రాణాలు పైనే పోయాయి. అక్కడ ఇంచుమించు జగ్గులాగే ఉన్నవాళ్ళు నలుగురున్నారు.

"నా స్నేహితులకు అన్యాయం చేయకు. నన్ను సుఖ పెట్టినట్లే వాళ్ళనూ సుఖపెట్టు—" అన్నాడు జగ్గు. తర్వాత వాళ్ళవైపు తిరిగి—"ఒరేయ్-మీరేం చేసినాసరే దీని వంటిమీద గాయం మాత్రం కాకూడదు. తెలి సిందా?" అన్నాడు.

వాళ్ళుత్సాహంగా వకుళ వైపు నడిచారు. వకుళ ఏమీ చేయలేక తీవ్రంగా వాళ్ళందరి ముఖాలు చూసింది. ఆ తర్వాత ఆమెకు ఆమాత్రం చూసే ఓపిక కూడా లేదు.

కొస ప్రాణాలతో వున్న వకుళ కట్లు విప్పి—నోట్లో గుడ్డలుతీసి — యథాప్రకారం గుడ్డలు కట్టాడు జగ్గు. తర్వాత గదంతా శుభ్రంచేసి ఆమెనక్కడే పడుకో బెట్టి-గది బయట గొళ్ళెం పెట్టాడు. తర్వాత వచ్చినవాళ్ళయి

దుగురూ ఇంటికి తాళంవేసి బయటకు పోయారు.

వకుళ చావుబ్రతుకుల మధ్య కొట్టుమిట్టాడుతూ అలాగే పడివుంది. అలా ఎంతసేపయిందో ఆమెకే తెలియదు. ఓ సమయంలో ఎవరో గదిలోకి వచ్చి వకుళా అని పిలవడం ఆమెకు గుర్తుంది. అది పిన్ని కంఠమని కూడా ఆమె గుర్తుపట్టింది. అయితే ఆమెకు పలికే ఓపికలేదు. ఊఁ అని కూడా మూలగలేదు.

"ఏమయిందే నీకు—మొద్దు నిద్దరోతున్నావు—" అంటూ శారద విసురుగా వచ్చి వకుళను తట్టి లేపబోయి ఉలిక్కిపడి—"అరే—దీని వళ్ళు జ్వరంతో కాలిపోతోంది. వెళ్ళేటప్పుడు నిక్షేపంలాగుందే—" అంది.

"ఒక్కర్తినీ వదిలేసి వెళ్ళాం. జడుసుకుందో ఏమో" అన్నాడు జోగారావు.

"ఒక్కర్తినీ వదలడం కొత్తేంకాదు. అయినా జడుసుకుందుకు దానికేమైనా భయమా ఏమన్నానా? పైగా పిశాచాలే తన స్నేహితులని అంటూంటుంది కూడా!" అంది శారద.

"డాక్టర్ని పిల్చుకొని రానా?" అడిగాడు జోగారావు. శారద అనుమతిస్తే డాక్టర్ని పిలవాలనే వుందతడికి.

"వద్దండీ—మన డాక్టరుకిటీవల డబ్బు ధ్యాస ఎక్కువైంది. మాట్లాడితే డబ్బంటున్నాడు. మనకు ధర్మాసుపత్రి దగ్గరేకదా—నేనే వెళ్ళి జేర్పించి వస్తాను—" అంది శారద.

"ధర్మాసుపత్రిలో జేర్పడమెందుకూ?" అన్నాడు జోగారావు ఆశ్చర్యంగా.

"అయితే రేపు ప్రయాణం మాటే మర్చిపోయారా?"

అంది శారద.

జోగారావు నుర్చిపోలేదు. ఆ ప్రయాణం మరీ అంత ముఖ్యమైనదికాదు. శారద అక్కయ్యకు లేక లేక కొడుకు పుట్టాడు. బారసాలకు రమ్మనమని మామగారు ఉత్తరం రాశాడు. సరే వెడదామనే అనుకున్నాడు. వకుళ వళ్ళు జ్వరంతో కాలిపోతోందనగానే ప్రయాణం మానేస్తాం కాబోలునని జోగారావు అనుకున్నాడు.

"అవునవును. రేపు ప్రయాణం కదూ—మరి దీన్ని ధర్మాసుపత్రిలోనే జేర్చాలి. తప్పదు. పద నీతో నేనూ వస్తాను—" అన్నాడు జోగారావు.

"మీరెందుకండీ — ఇంట్లో పిల్లలొక్కళ్ళూ వుంటే జడుసుకుంటారు—" అంది శారద.

"పోనీ—వాళ్ళనీ తీసుకు వెడదాం—"

"వద్దండీ—ఆ వెధవ ఆసుపత్రికి వీళ్ళను తీసుకు వెళ్ళడం నాకిష్టంలేదు—" అంది శారద.

శారద ఇష్టం ప్రకారం మాత్రమే నడుచుకోగల జోగారావు ఇంట్లో వుండిపోయాడు.

శారద వకుళను తట్టిలేపి—"వకుళా—నడవగలవా అమ్మా!" అని ఆప్యాయంగా అడిగింది. వకుళ అతి కష్టంమీద తన అశక్తతను తెలియజేస్తూ తల అడ్డంగా ఊపింది.

"ఏమండీ—రిక్షాను పిల్చుకునిరండి!" అంది శారద.

జోగారావు క్షణాలమీద రిక్షా తీసుకొని వచ్చాడు.

శారద రిక్షా ఎక్కింది. వకుళను జోగారావే మోసుకొని రిక్షాలో వేశాడు. కాలిపోతున్న ఆ శరీరం జోగారావు పితృ హృదయాన్ని కదిలించింది. రిక్షా

కదలగానే అతను ఒక్క వుదుటున లోపలకు వచ్చి—బావురుమని ఏడ్చేశాడు.

పిల్లలిద్దరూ తెల్లబోయి తండ్రివంక చూసి—"నువ్వెందుకు ఏడుస్తున్నావు నాన్నా?" అడిగారు.

జోగారావు తడబడి—కళ్ళు తుడుచుకొని—"నేను ఏడ్చినట్లు మీరు అమ్మకు చెప్పకండి!" అన్నాడు.

ఒకరోజు కన్నకూతురు తన్ను జోగారావ్ అని పేరుపెట్టి పిలిచేవరకూ అతడు తన తప్పు గ్రహించలేక పోయాడు. ఆ తర్వాతనుంచి అతడు కూతురి జీవితాన్ని మరింత శ్రద్ధగా గమనించసాగాడు. తండ్రిగా తను చేస్తున్న అన్యాయం అతడికి పూర్తిగా గ్రహింపయింది. కానీ అతడు శారదనేమీ చేయలేడు! ఎప్పుడూ దేనికీ అతనామెను ఆపలేక పోయాడు. ఇప్పుడు కూతుర్ని రిక్షాలో ధర్మాసుపత్రికి తీసుకువెడుతున్నా ఆపలేక పోతున్నాడు.

శారద అనుకున్న పని సాధిస్తుంది! ఆమె వకుళను ధర్మాసుపత్రిలో జేర్చింది.

అక్కడ రోగుల సంఖ్య చాలా ఎక్కువగా వుంది. అయినా ఆమె ఎలాగో శారదను జనరల్ వార్డులో జేర్పించగలిగింది. అక్కడ కనపడ్డ డాక్టరుకూ, నర్సుకూ వకుళ పరిస్థితి వివరించి—ఆమెను జాగ్రత్తగా చూడమని మరీమరీ చెప్పింది.

అక్కడున్న ప్రతిరోగికీ దగ్గరుండడానికి బంధువులున్నారు. వకుళకూ్కడా తనవాళ్ళన్నవారెవరైనా వుంటే బాగుంటుందని డాక్టర్ సూచించాడు.

"దానికి నా అన్నవాళ్ళెవ్వరూ లేరు. మేము చేరదీసి తిండీ, బట్టా పెడుతున్నాం. మేంకాబట్టి ఈమాత్రం

శ్రద్ధతీసుకుని ఇక్కడ చేర్చాం. ఊరి ప్రయాణం రాకపోతే మేమే ఎవళ్ళమో దగ్గరుండేవాళ్ళం. మీరే దానికి అన్నీ అయి జాగ్రత్తగా చూడండి—" అంది శారద.

మర్నాడు ప్రయాణమయ్యే ముందు రిక్షాల్ని ధర్మాసుపత్రి మీదనుంచి పోనిమ్మంది శారద. భర్తను లోపలకు రావద్దని తనే లోపలకు వెళ్ళి వకుళ పరిస్థితి విచారించింది.

వకుళ అక్కడ వళ్ళు తెలియకుండా పడివుంది. ఆమె నెవరూ పట్టించుకోవడంలేదు. బంధువులున్న వారికే అక్కడెవరూ సరిగా చూడడంలేదు. ఎవరూలేని వకుళ నెవరు పట్టించుకుంటారు?

శారద బయటకు వచ్చి—"నిక్షేపంలా వుందది. రేపు డిశ్చార్జి చేసేస్తారట. ఎదురింట్లో తాళమిచ్చేంగదా-అడిగితీసుకోమని చెప్పాను—" అంది. అబద్ధమాడుతున్నపుడు శారద కంఠం కాస్త వణికింది. కొంపదీసి వకుళకేమైనా అయితే?

"అ॰ ఎందుకవుతుంది. అసలే మొండి ప్రాణం దానిది—" అనుకుంది శారద.

జోగారావు మాత్రం ఆమె చెప్పింది మౌనంగా విన్నాడు. రిక్షాలు కదిలిపోయాయి.

## 12

"సార్! ఈ ఇంజక్షన్ చూస్తూంటే నాకు చాలా థ్రిల్లింగావుంది. పోయిన ప్రాణం తాత్కాలికంగానైతేనేం తిరిగి రప్పించడం మాటలా?" అన్నాడు లింగం.

"మన ఇంజక్షన్ పుచ్చుకున్న మొదటి శవం ఏం

మాట్లాడుతుందో వినాలన్నది నా కుతూహలం-" అన్నాడు మహాదేవుడు.

"అవును నిజమే—శవం మాట్లాడితే తమాషాగానే వుంటుంది. కానీ ఒక్క సందేహం—మనం మొట్టమొదటి సారిగా ఆడదాన్ని బ్రతికిద్దామా, మగశవాన్ని బ్రతికిద్దామా!" అన్నాడు లింగం.

"మనకంత ఛాయిస్ లేదు. ఏది దొరికితే అదే! ఎటొచ్చీ శవం తాజాగా వుండాలి—"

"సార్!" అన్నాడు లింగం—"చచ్చిపోయినవాళ్ళ వళ్ళు చల్లబడిపోతుందనీ—గట్టిపడిపోతుందనీ అంటారు. మరి ఇంజక్షన్ ఇవ్వడం సాధ్యపడుతుందంటారా?"

"అందుకే మనం తాజా శవాన్ని ఎన్నుకున్నాం. తాజా శవానికి ఇంజక్షన్ చేయడం పెద్ద కష్టంకాదు. అదీకాక ఈ ఇంజక్షన్ సూది శవాలకోసం ప్రత్యేకంగా తయారు చేయబడింది. అంచేత నీకా బెంగలేమీ అక్కర్లేదు. మనం శవానికి ఇంజక్షనివ్వగలగడం ఖాయం!" అన్నాడు మహాదేవుడు.

"సార్—మరో చిన్న విన్నపం. మొదటి ఇంజక్షన్ నా చేతులమీదుగానే జరగాలి—" అన్నాడు లింగం.

"సరే—" అన్నాడు మహాదేవుడు—"అవును—శక్త్యోపాఖ్యానం సంగతేమయింది?" అనడిగాడు.

"అదింకా అప్పుడే ఎక్కడండీ—దాని గురించి మొన్న నేకదా—వారం రోజులని చెప్పాడు వాడు—" అన్నాడు లింగం. అతడికా టాపిక్ మీద అంత ఆసక్తి ఉన్నట్లులేదు.

మహాదేవుడు మాత్రం ఏదో ఆలోచిస్తూ—"వాటం చూస్తే శక్త్యోపాఖ్యానం కూడా మన పరిశోధనలకు

సంబంధించినదే ననిపిస్తోంది. మనం శవాల్ని బ్రతికించడం అంటూంటే—మా అన్నయ్య శవాన్ని దుష్టశక్తిగా మార్చడం అంటున్నాడు. ప్రాణం పోయి కూడా శవం దుష్టశక్తిగా ఎలా మారగల్గుతుంది?" అన్నాడు.

"అంటే?"

"శవాల్ని బ్రతికించే ప్రయోగాలు మనదేశంలో పూర్వం కూడా ఎవరో చేసివుంటారు. సదానందుడు వాటిని శక్త్యోపాఖ్యానంలో వివరించివుంటాడు. సామాన్య జనులకోసం శవం దుష్టశక్తిగా మారిన కథ వెలసి ఉంటుంది—"

లింగం ఉత్సాహంగా తల ఊపి—"అదే నిజమైతే చాలా తమాషాగా వుంటుంది. మనం ఇంత కష్టపడి కనిపెట్టిన మందు గురించి వివరాలు అందులో రాసి వుండాలిట. అప్పుడు అంతా మనమూ పుస్తకంలో చదివే ప్రయోగాలు చేశామని అనుకుంటారు—" అన్నాడు.

"అనుకుంటే అనుకోనీ—కానీ నిజం తెలుసుకోవాలి" అన్నాడు మహాదేవుడు.

"మనమా నిజం తెలుసుకునే లోగానే మనప్రయోగం చేసేస్తాం కదండీ—" అన్నాడు లింగం.

"అవును" అన్నాడు మహాదేవుడు గంభీరంగా.

"మీ అన్నదమ్ములు నాకు నచ్చారండీ — అన్న ఆయుర్వేద వైద్యుడు. తమ్ముడు ఆధునిక శాస్త్రజ్ఞుడు. ఇద్దరికీ పరిశోధనలే ప్రాణం. మీరిద్దరూ చేతులు కలిపితే పాతకొత్తల మేలుకలయికే అవుతుంది—" అన్నాడు లింగం.

"అదిసరే-మరి ఇంజక్షన్‌కు ముహూర్తం పెట్టొద్దా."

"మీరే చెప్పారుగా—అమావాస్యనాడని!"

"మరి ఈ రోజే అమావాస్య—కార్యక్రమం తయారు చేయొద్దూ—"

"అదీ—మీరే చెప్పారు. శవం ధర్మాసుపత్రిలో దొరుకుతుందని—" అన్నాడు లింగం.

"మరి తెలుసుకున్నావా?"

"ఇప్పుడే ఫోన్ చేసి కనుక్కుంటాను. ధర్మాసుపత్రిలో శవాలేమైనా తాజాగా ఉన్నాయేమోనని—"

"నువ్విలా ఫోన్ చేస్తే బాగుండదు. అదీకాక మనిషి పోయిన వెంటనే ఆ విషయం తెలుసుకునే ఓపికగల వైద్యులుంటే అది ధర్మాసుపత్రి ఎందుకవుతుందీ? తాజా శవాలు కావాలంటే మనమే వెతుక్కుంటూ పోవాలి-" అన్నాడు మహాదేవుడు.

"అంటే మన కళ్ళముందే ఎవరైనా శవాలుగా మారతారంటూరా?"

"నేనేమీ అనను. ముహూర్తం రాత్రి పన్నెండింటికి. అన్నీ సిద్ధం చెయ్యి. ఎవరికీ అనుమానం రాకుండా వుండడం కోసం మనం డాక్టర్స్ ఆప్రాన్స్‌లో అక్కడకు వెడతాం. ఇంపోస్టర్ అని కూడా ఎవ్వరూ అనరు. మనం సైంటిస్టులం కదా — పొరపాటున ఆప్రాన్స్‌తో బయటకు వచ్చేశామని చెప్పుకోవచ్చు—" అన్నాడు మహాదేవుడు.

ఉత్సుకతతో లింగం వళ్ళు వేడెక్కింది.

# 13

అపస్మారక స్థితిలో పడివున్న వకుళను మధ్యలోవచ్చి ఒక డాక్టరు చూశాడు. ఆమెను చూడగానే కంగారు పుట్టింది. ఏం చేయాలా అని ఆలోచిస్తూండగా ఉన్న

ట్నుండి వకుళ కళ్ళు తెరిచింది.

"డాక్టర్!" అందామె.

డాక్టర్ ఆశ్చర్యంగా ఆమెవంక చూసి—"ఎలా వుంది?" అనడిగాడు.

"నాకేదో భయంగా వుంది డాక్టర్—కానీ మీరు నన్ను రక్షించాలి. నా జీవితమంతా ఈ ఒక్కరోజు కోసమే బ్రతికాను నేను. నాకు చావాలనిలేదు. ఈ రోజు రాత్రి పన్నెండుగంటలకు చాలా ముఖ్యమైన పని సాధించాలి. నన్ను బ్రతికించండి డాక్టర్. నాకు చావాలనిలేదు. నన్ను బ్రతికించండి డాక్టర్!" అందామె.

డాక్టర్ ఆమెవంక జాలిగా చూసి—"నీకేం భయం లేదు—" అన్నాడు. ఇలాంటి కేసులు ఎన్నో చూసి చూసి ఆయన అనుభవం పండిపోయింది. చావుబ్రతుకులపట్ల నిర్లిప్తత నానాటికీ పెరిగిపోయిందాయనకు. వకుళ లాంటి కేసులు చాలా చూడవలసివుందాయన షిఫ్టులో...

"మీరామాటంటే చాలు నాకు డాక్టర్! నేను తప్పక బ్రతుకుతాను. నన్ను మీరే బ్రతికిస్తారు. బ్రతికించకపోతే నేను మిమ్మల్ని చంపేస్తాను—" అంది వకుళ.

ఆఖరి మాటలకు డాక్టర్ ఉలిక్కిపడి ఆమెవంక చూశాడు. ఆమె కళ్ళు విచిత్రంగా కదులుతున్నాయి. ఆమెను చూస్తూంటే ఆరిపోబోయే ముందరి దీపం గుర్తొచ్చింది డాక్టర్కు.

"అలా చూస్తారేం డాక్టర్—నేను నిక్షేపంలా వున్నాను. నేను గనక చస్తే అది అర్థాంతరపు చావు అవుతుంది. దుర్మార్గులకు ఆటవస్తువునై చచ్చిపోతున్నాను నేను. సరైన వైద్యం లభించక చచ్చిపో

తున్నాను నేను. కానీ నాకు చావాలనిలేదు. బ్రతుకు తాను. బ్రతికి మొత్తం ఈ ప్రపంచంమీద కక్ష తీర్చు కుంటాను. అందుకైనా బ్రతకాలి నేను. డాక్టర్ .... నన్ను బ్రతికించరూ .... చావాలనిలేదు నాకు .... నన్ను బ్రతికించరూ ..” ఈసారి దీనంగా అంది వకుళ.

“అలాగేనమ్మా—మరి నేను వెళ్ళాలి!” అన్నాడు డాక్టర్. ఆమెను చూస్తూంటే యమపాశాన్ని చూసి శివుణ్ని వేడుకుంటున్న మార్కండేయుడు గుర్తుకు వచ్చాడు డాక్టర్‌కి. “తను చనిపోతానని ఈమెకు తెలుస్తోందా?” అని ఆశ్చర్యపడ్డాడు డాక్టర్. అయితే ఆయన ఇంకా చాలామందిని చూడాలి. అందుకని ముందడుగు వేశాడు డాక్టర్.

“డాక్టర్-కాస్త టైమెంతయిందో చెప్పి వెళ్ళండి-” అంది వకుళ.

“పదకొండూ నలభై—” అన్నాడు డాక్టర్.

“పగలా, రాత్రా—”

“రాత్రే—”

“ఈ రోజు తేదీ—....”

అదీ చెప్పాడు డాక్టర్.

“అహహ హావా ....ఇదే అమావాస్య. సరిగ్గా పన్నెండు గంటలకు నా ప్రయాణం....” అంది వకుళ.

డాక్టర్ ముందుకు వెళ్ళబోతూ ఒక్క క్షణం ఆగాడు.

“డాక్టర్—ఎవరామె?” అని అడిగాడు లింగం.

“తెలియదు. బహుశా అనాథ అనుకుంటాను—” డాక్టర్ నిట్టూర్చాడు.

“ఆమె ఆరోగ్యం ఎలా వుంది?”

"బహుశా బ్రతకదనుకుంటాను —" అన్నాడు డాక్టర్.

లింగం ఇంకా ఏమో అడగబోగా డాక్టర్ విసుక్కుని ముందుకు వెళ్ళిపోయాడు.

లింగం, మహాదేవుడు చాలా సేపట్నించి వకుళను గమనిస్తున్నారు. డాక్టర్‌కీ, వకుళకూ మధ్య జరిగిన సంభాషణ వారిద్దర్నీ ఆకర్షించింది.

మహాదేవుడు వకుళ దగ్గర్లో నిలబడి వున్నాడు. డాక్టర్‌తో మాట్లాడి లింగం రాగానే—"ఈమె ఎంతోసేపు బ్రతకదు. ముఖంలోకి మృత్యుకళ వచ్చేసింది—" అన్నాడు.

"అంటే?" అన్నాడు లింగం.

"అటు చూడు—" అన్నాడు మహాదేవుడు.

వకుళ ఏదో మాట్లాడాలని నోరు తెరిచింది. తెరిచిన నోరు అలాగే వుండిపోయింది. అతికష్టంమీద ఊపిరి పీలుస్తోందామె. కనుగుడ్లు తేలిపోతున్నాయి.

లింగం అప్రయత్నంగా—"పరుగున వెళ్ళి డాక్టర్ని పిల్చుకు వస్తాను—" అన్నాడు.

"పిచ్చివాడా-ఆమె బ్రతకదు. ఆ విషయం డాక్టర్‌కి తెలుసుననుకుంటాను—" అన్నాడు మహాదేవుడు.

"అయితే మాత్రం—అలా వదిలేస్తామా?" అన్నాడు లింగం. అప్పుడతను తాజా శవం సంగతే మర్చిపోయాడు.

"ఆగు. తొందరపడకు. ఆమె చావు తథ్యం. ఆమెది అకాలాంతర మరణం అయితే మనం ప్రయోగించే మందు ఆమెకు పూర్ణాయుర్దాయాన్నివ్వవచ్చు. చివరి క్షణాల్లో ఆమె కోరిక ఏమిటో తెలుసుకోవచ్చు—ముందు అటు పద—" అన్నాడు మహాదేవుడు. అతను వకుళను సమీ

పించి—"అమ్మా—నీ కోరిక ఏమిటో చెప్పు..." అంటూ ఆమె చేయి పట్టుకున్నాడు.

అతి కష్టంమీద—"అమావాస్య....పన్నెండుగంటలు మొదటి ప్రయోగం...." అంది వకుళ. మహాదేవుడికి ఆమె చేతిలో నాడి దొరకలేదు. ఆయన కంగారుగా శ్వాస చూశాడు. శ్వాస ఆడుతున్నట్లులేదు. అప్పు డాయన వకుళ గుండెలపైన చేయివేశాడు. గుండె కొట్టు కోవడంలేదు.

"ఆమె చనిపోయింది—" అన్నాడు మహాదేవుడు నిశ్చలంగా—"కేవలం మనకో తాజా శవాన్నివ్వడం కోసమే భగవంతుడామెను చంపేశా డనిపిస్తోంది—"

తాజా శవం అన్నమాట వినగానే లింగం ఉలిక్కి పడ్డాడు. ఒకసారి మహాదేవుడన్న మాటలతడికి గుర్తుకు వచ్చాయి. అవసరమైతే హత్యచేసైనా తాజా శవాన్ని తయారు చేద్దామన్నాడు మహాదేవుడు.

"సార్! తాజా శవం కోసం మనంగానీ ఈమెను హత్యచేయలేదుగదా అనిపిస్తోంది—" అన్నాడు లింగం దీనంగా. అతడి కళ్ళు చెమ్మగిల్లాయి.

"నాకు చావాలనిలేదు. నన్ను బ్రతికించండి—" అని ఆక్రోశిస్తున్న వకుళ మాటలు అతడి చెవుల్లో గింగురు మంటున్నాయి. పట్టుమని పదహారేళ్ళు లేనిపిల్ల—నిండు యౌవనంలోని పిల్ల—బ్రతుకుమీద ఎన్నో ఆశలున్న పిల్ల—చచ్చిపోయింది.

"లింగం—దేవుడు ఎప్పుడు ఏమి ఎందుకు చేస్తాడో మనకే తెలియదు. ఆమెకు కాలం తీరిపోయింది. ప్రాణం పోయింది. మనం మన ప్రయోగాన్ని తొలిసారిగా ఉప యోగించటానికి ముహూర్తం ఎప్పుడు పెట్టాం.

అమావాస్య — పన్నెండుగంటలు! చనిపోతూ ఆమె అన్న దేమిటో తెలుసా? అమావాస్య—పన్నెండుగంటలు మొదటి ప్రయోగం....! ఇది విచిత్రంగాలేదూ? కేవలం మన తొలి ప్రయోగం కోసమే తను చనిపోతున్నానని చెబుతోందామె! ఇది కాకతాళీయమనుకోవడానికి మన సొప్పడంలేదు. కాకతాళీయం కాకపోతే ఆమెకు మన విషయం ఎలా తెలిసింది? కాకతాళీయమే అయితే అదెలాంటి కాకతాళీయం? అన్నీ విచిత్రంగానే వున్నాయి నాకు—" అన్నాడు మహాదేవుడు.

లింగం చటుక్కున టైముచూసి—"సార్! సరిగ్గా పన్నెండు కావస్తోంది—" అన్నాడు.

"తొలి ఇంజక్షన్ నువ్వే చేస్తానన్నావుగా—నీ చేతుల్తో నీవే చేయి" అన్నాడు మహాదేవుడు.

లింగం వెంటనే జేబులోంచి సిరంజి తీశాడు. వేరే బాటిల్ తీసి అందులోని మందును ఇంజక్షన్‌లోకి ఎక్కించాడు. అది తీసుకుని వకుళ మీదకు వంగేసరికి అతడి చేతులు వణికాయి.

ఇప్పుడేం జరుగుతుంది?

ఆ క్షణంలో లింగానికి వకుళ విషాద మరణం విషయం గుర్తులేదు. అది ఒక తాజా శవం. దానిపై తానొక వినూత్న ప్రయోగం చేయనున్నాడు. ఎంతో కాలంగా ఎదురుచూసిన ప్రయోగమది!

లింగం వకుళ జబ్బకు సిరంజి సూది గుచ్చాడు. అతడనుకున్నకంటె సులభంగానే ఇంజక్షన్ ఇవ్వగలిగాడు.

ఇంజక్షన్ ఇవ్వడం పూర్తయ్యాక మహాదేవుడు,లింగం కూడా ఆత్రుతగా వకుళవంక చూస్తున్నారు.

అప్పుడేం జరుగుతుంది? తమ ప్రయోగం సఫలమవు

తుందా? లేక అసలేమీ జరుగదా?

ఇద్దరూ ఆత్రుతగా వకుళ వంక చూస్తున్నారు.

ఉన్నట్లుండి వకుళ నోరు మూతపడింది. కళ్ళు తెరుచు కున్నాయి. ఆ తెరుచుకోవడం కూడా చాలా విచిత్రంగా వుంది. బిగుసుకుపోయిన పెట్టెమూత హఠాత్తుగా విడివడినట్లు మూసివున్న తలుపులు తటాలున తెరుచుకున్నట్లు ఆమె కనులు తెరుచుకున్నాయి. కనుగుడ్లు గుండ్రంగా తిరిగాయి. ఆమె ఎవరినైనా చూస్తోందో లేదో తెలియలేదు.

మహదేవుడికి చాలా ఆనందంగావుంది—"లింగం! మన ప్రయోగం ఫలించింది—" అన్నాడాయన.

వున్నట్లుండి వకుళ పెదవులు కదిలాయి-"ప్రయోగం!" అందామె.

"అమావాస్య .... పన్నెండు గంటలు .... మొదటి ప్రయోగం...." అని ఆగిందామె.

మహదేవుడాత్రుతగా ఆమె మీదకు వంగి-"నువ్వేదో చెప్పాలనుకుంటున్నావు—చెప్పమ్మా!" అన్నాడు.

"దృశ్యం దృశ్యం అదృశ్యం మస్తం సమస్తం అదృశ్యం—" అని ఆగింది వకుళ.

"నీకేమైనా అర్థమయిందా?" అన్నాడు మహదేవుడు అయోమయంగా.

"భగభగ హర భగభగ హరి హింస బేతాళో హరహరి!" అంది వకుళ మళ్ళీ.

"సార్—ఏవో మంత్రాలు చదువుతున్నట్లుంది—" అన్నాడు లింగం.

మహదేవుడు ఏదో చెప్పబోయాడు. వున్నట్లుండి దీపాలారిపోయాయి. అక్కడ చిమ్మచీకటి ఆవరించుకుంది,

కన్ను పొడుచుకున్నా ఏమీ కనపడడంలేదు.

"లింగం—ఏమయింది?" అన్నాడు ప్రొఫెసర్.

"కరెంట్ పోయినట్లుంది సార్!" అన్నాడు లింగం.

"అయ్యయ్యో — సమయానికి పోయిందీ పాడు కరెంటు. ఎంతో కష్టపడి సాధించాం—ఈమె ఎంతసేపు బ్రతుకుతుందో ఏమో—" అన్నాడు మహాదేవుడు.

"సార్—ఎవరినైనా అడిగి టార్చిలైటైనా కొవ్వొత్తి అయినా తెస్తాను—" అన్నాడు లింగం.

"త్వరగా తీసుకురా-ఆమెలోని ప్రతిభావాన్ని మనం గమనించాలి. ఆమె చెప్పే ప్రతిమాటనీ శ్రద్ధగా వినాలి. ఆమె అన్నమాటలన్నీ గుర్తున్నాయా నీకు—" అన్నాడు మహాదేవుడు.

"ఉన్నాయి సార్—" అని లింగం అనేటంతలో దీపాలు వెలిగాయి.

మహాదేవుడు, లింగం కళ్ళు నులుముకున్నారు. మంచం వైపు చూసి ఉలిక్కిపడ్డారు.

అక్కడ వకుళ శవంలేదు.

"సార్!" అన్నాడు లింగం—"నాకిక్కడ ఏమీ కనబడ్డంలేదు. శవం ఎలా మాయమయిందంటారు?"

"శవం మాయం కాలేదు. లేచి వెళ్ళిపోయింది—" అన్నాడు మహాదేవుడు.

"మనమిప్పుడేం చేయాలి?" అన్నాడు లింగం నిస్పృహగా.

"ఆమె ఎవరో తెలుసుకుని—ఆమె ఇంటికి వెళ్ళాలి!" అన్నాడు మహాదేవుడు—"ఎక్కడా పొరపాటున కూడా మన ప్రయోగం గురించి చెప్పకూడదు. ఇక్కడున్న వారెవ్వరికీ ఆమె చనిపోయినట్లూ, తిరిగి బ్రతికినట్లూ

కూడా తెలియదు—"

లింగం వకుళ గురించి వాకబు చేశాడు. హాస్పిటల్లో ఆమె గురించి వివరాలేమీ లభించలేదు.

"మనం ఆమె ఫోటో అయినా తీసుకుని వుండాల్సింది—" అన్నాడు మహాదేవుడు.

"ధర్మాసుపత్రిలో శవాలు దొరుకుతాయనే అనుకున్నాం తప్ప శవం తాలూకు వివరాలు కూడా తెలియకుండా పోతాయని అనుకోలేదు—" అన్నాడు లింగం.

"ఆమె ఎంత సేపు బ్రతుకుతుందో తెలియదు మనకు. ఒకవేళ దారిలో ఎక్కడైనా కొలాప్సయినా కావచ్చు. బయట వెతుకుదాం—పద!" అన్నాడు మహాదేవుడు.

రాత్రి తెల్లవార్లూ వాళ్ళిద్దరూ రోడ్లు కాపలా కాశారు. వాళ్ళకు వకుళ కనబడలేదు.

# 14

మంచంమీద పడుకుని వున్నాడు మధు. నిద్రపట్టక అటూ ఇటూ దొర్లుతున్నాడు.

సరిగ్గా ఈ రాత్రి తనను కలుసుకోమంది వకుళ. కానీ వాళ్ళంతా ఈ రోజు ఉదయమే ఊరికి వెళ్ళిపోయారు.

వకుళ తనను కలుసుకునివుంటే ఆ అనుభవం ఎంత మధురంగా వుండేది?

నిద్రపడితే బాగుండును—కలలైనా వస్తాయి. ఆ కలలోనైనా....

"మధూ...." గాలిలో తేల్తూ వచ్చినట్లుగా ఓ పిలుపు. ఆ కంఠం వకుళదిలాగే వుంది.

మధు ఉలిక్కిపడి మంచంమీద లేచికూర్చున్నాడు. గది తలుపులు వేసి ఉన్నాయి. తన గదిలోకి ఎవరు

వస్తారు? అంతా తన భ్రమ! తన శరీరం వకుళను కోరు తోంది. అందుకే మనసు అలా భ్రమిస్తోంది.

మధు మళ్ళీ పడుకున్నాడు.

"మధూ...." అదే పిలుపు. గాలిలో తేలుతూ వచ్చి నట్లుంది. గొంతు వకుళదిలాగుంది.

"ఎవరు?" అన్నాడు మధు లేవకుండానే.

"నేను మధూ .... నీకోసం వచ్చిన వకుళని...." గాలిలో తేల్తూ వచ్చినట్లుగానే ఉందా గొంతు.

మధు చటుక్కున ఆ పిలుపు వచ్చినవైపు తిరిగాడు.

అక్కడ కిటికీ వుంది. కిటికీ వెనుక ఒక ఆకారం. అది స్త్రీ అని తెలుస్తూనేవుంది.

"వకుళా!" అంటూ లేచాడు మధు.

"ఉష్! నెమ్మది—" అంది వకుళ గుసగుసలాడు తున్నట్లు.

మధు కిటికీని సమీపించాడు.

"ఓహ్! ఎంత సమ్మోహనగా వుంది వకుళ...." అనుకున్నాడు-"ఎలా వచ్చావ్?" అన్నాడు నెమ్మదిగా.

"అన్నీ చెబుతాను. వస్తావా?" అంది వకుళ.

"ఎక్కడికి?"

"మా యింట్లో ఇప్పుడెవరూలేరు. అక్కడికే—" అంది వకుళ.

"వస్తాను—" అన్నాడు మధు. అతడి శరీరం ఉత్సాహంతో నిండిపోయింది. కోరుకున్న అనుభవం కొద్ది క్షణాల్లో లభించనుంది. త్వరత్వరగా లేచి చప్పుడు కాకుండా ఇంట్లోంచి బయటకు వచ్చాడు. వకుళను తీసుకుని వీధిలోకి వచ్చాడు.

వీధి నిర్మానుష్యంగా వుంది. ఇద్దరూ త్వరగా వకుళ

ఇల్లు చేరుకున్నారు.

మధు అప్పుడు వకుళ చేయిపట్టుకుని షాక్ తిన్నట్లు ఉలిక్కిపడ్డాడు. ఆ చేయి మంచుకంటె చల్లగావుంది—

"బాప్ రే—అయిసులా వుంది—" అన్నాడు అప్రయత్నంగా.

వకుళ మృదువుగా అతడి చేయి విదిలించుకుని—

"నీకోసం ఎంత సేపట్నించో మంచులో తడిసి ముద్దయ్యాను. నా శరీరంలో నువ్విప్పుడు వెచ్చదనం పుట్టించాలి—" అంది.

అలాంటి చల్లదనం ఎన్నడూ అనుభూతికిరాని మధు మాట్లాడకుండా ఊరుకున్నాడు. కానీ వకుళ మాటలతడికి కొంత ఉత్సాహాన్ని కలిగించాయి.

వకుళ గుమ్మం దగ్గరకు వెళ్ళి వేలితో తాళంకప్ప మధ్య పెట్టి లాగింది. తాళం ఊడివచ్చింది. మధు ఈ విషయాన్ని గమనించలేదు. తలుపులు తెరుచుకోగానే ఇద్దరూ లోపలకు వెళ్ళారు. మధు లోపలకు రాగానే వకుళ తలుపులు వేసి — "ఇంట్లో ఎవరూలేరు. నువ్వు మంచంమీద పక్కవేయి మధూ!" అంది.

మధు మంత్రముగ్ధుడిలా వెళ్ళి ఆమె చెప్పిన పని చేశాడు.

"మధూ—ఎన్నాళ్ళకు?" అంటూ ఆమె అతణ్ని కౌగలించుకుంది. మధుకు మొదట బాగానేవుంది. కానీ అతడి చేతులు ఆమె నడుంకి తాకినపుడు చలికి కొంకర్లు పోయాయి. ఏమిటోలా అనిపించిందతనికి.

"నన్ను వదులు వకుళా—చలివేస్తోంది!" అన్నాడు మధు.

వకుళ నవ్వింది. ఆ నవ్వు మనిషి నవ్వులాలేదు. ఏదోలా

వుంది. మధుకు రవంత భయం వేసింది.

"నన్ను వదులు వకుళా—ఏమయింది నీకు?" అన్నా డతను కంగారుగా.

వకుళ పట్టునుంచి తనకుతానై అతను బైటపడలే కున్నాడు. ఆమె కౌగిలి బిగుస్తోంది. అతడు ఉక్కిరి బిక్కిరై పోతూ—"నన్ను వదులు వకుళా! నేను చచ్చి పోతాను—" అన్నాడు.

"నువ్వు చచ్చిపోతానని భయపడుతున్నావు. కానీ నేను ఏనాడో చచ్చిపోయాను...." అంది వకుళ.

"ఏమిటి వకుళా—నువ్వనేది?" అన్నాడు మధు.

వకుళ నవ్వి-"అనడానికేమీ లేదు. ఒకప్పుడు నాపైన నీది పైచేయి. ఇప్పుడు నీపైన నాది పైచేయి—" అంది.

"అంటే?"

"చెబుతాను-" అంటూ వకుళ అతణ్ని వదిలిపెట్టింది.

ఇప్పుడు మధు వంట్లో ఒక్కడుగు కూడా వేసే శక్తి లేదు. అతను ఉన్నపళంగా కూలబడ్డాడు.

వకుళ అతడిపక్కనే కూర్చుని మధు కళ్ళలోకి చూసింది. మధు కూడా ఆమెవైపు చూశాడు.

ఆ చూపు మామూలుగాలేదు. మేకవైపు చూసే తోడేలులా చూస్తోందామె.

మధు కంగారుగా వెనక్కు జరగడానికి ప్రయత్నిస్తూ "నువ్వు....నువ్వు....మనిషివి కాదు...." అన్నాడు.

సమాధానంగా వకుళ నవ్వింది. భయంకరంగా నవ్వింది. ఇల్లదిరిపోయేలా నవ్వివుంటే ఇంకా బాగుండేది. కానీ ఆమె గుసగుసలాడుతున్నట్లు, గదిదాటి శబ్దం బయటకు వెళ్ళకూడదన్నట్లుగా అదోరకంగా నవ్వింది.

అలా చేయడంవల్ల ఆ నవ్వు ఇంకా భయంకరంగా వుంది.

"నువ్వు....మనిషివి కాదు...." అన్నాడు మధు.

వకుళ తాపీగా మధు చేయి అందుకుంది. ఆమె సర్శ అతడికి చాలా ఘోరంగా వుంది. కానీ విదిలించుకునే శక్తి కూడా లేకుండా పోయిందతనికి. వకుళ నాలిక బైటపెట్టి అతడి చేయి నాకసాగింది. ఆమె అలా చేస్తూంటే మృదువుగా స్పృశిస్తున్నట్లుగా అనిపించింది మధుకి.

"ప్లీజ్ — నన్ను వదులు—" అన్నాడు మధు భయంగా.

అతడామాట అనగానే చటుక్కున వకుళ అతడి చేతిని కొరికింది. ఆమె ఏం చేస్తోందో అతడికి తెలియదు. ముందు మాత్రం బాధ భరించలేక కెవ్వుమని అరిచాడు. రెండు పదునైన కత్తుల్ని భుజంలోకి దింపినట్లయిందతడికి. కానీ తర్వాత బాధ తెలియలేదు. అలా రెండు మూడు నిముషాలుండి ఆమె అతడి చేతిని వదిలి—గాయం మీద మృదువుగా రాసింది.

మధు జాలిగా వకుళ కళ్లలోకి చూసి—"వకుళా— నాదో చిన్న కోరిక—" అన్నాడు.

"చెప్పు—" అంది వకుళ.

"ప్లీజ్—నా రక్తం తాగవూ?" అన్నాడు మధు.

వకుళ ఇందాకటిలాగే తక్కువ శబ్దంలో భయంకరంగా నవ్వింది. "అలాగే మధూ! కానీ ఈ రోజు కాదు. రేపు—సరేనా?" అంది.

"అయితే రేపు ఎప్పుడు వస్తుందా అని ఎదురుచూస్తూ కూర్చుంటాను నేను—" అన్నాడు మధు.

"వద్దు మధూ! నీతో నాకింకా చాలా పనులున్నాయి.

నేను చెప్పినవన్నీ నువ్వు చేసిపెట్టాలి—" అంది వకుళ.

"వకుళా—నేను నీకు దాసుణ్ని. నువ్వేం చెబితే అది చేస్తాను—" అన్నాడు మధు.

"అయితే విను—" అంటూ చెప్పడం ప్రారంభించింది వకుళ. మధు శ్రద్ధగా వింటున్నాడు.

## 15

మధు ఎప్పటికీ నిద్ర లేవకపోయేసరికి అతడి తల్లి గదిలోకి వెళ్ళి కుదిపి లేపింది. మధు నీరసంగా మూలుగుతున్నాడు. ఆమె కంగారుపడి వంటిమీద చేయివేసి చూసింది. జ్వరమున్నట్లులేదు.

మధు మాత్రం నీరసంగా మూలుగుతూనే వున్నాడు. ఏమీ మాట్లాడ్డంలేదు.

మధు తల్లి కంగారుగా వెళ్ళి డాక్టర్ని పిల్చుకుని వచ్చింది.

డాక్టరు మధుని పరీక్షచేసి—"వంట్లో అనారోగ్యం ఏమీ లేదు. రక్తహీనత ఏమో అనిపిస్తోంది. అదైనా పెద్ద సీరియస్ కాదు. ఎప్పుడైనా ఎవరికైనా రక్తదానం ఇస్తే—ఓ రోజు కాస్త నీరసంగా వుంటుంది. సరైన ఆహారం పడితే వెంటనే అంతా సద్దుకుంటుంది. మీవాడు కానీ ఎవరికైనా రక్తదానం ఇచ్చాడా?" అన్నాడు.

"అదేం—అలా అడుగుతున్నారు?" అంది మధు తల్లి.

"వంటిమీద దెబ్బలు కనబడ్డంలేదు. ముచ్చుకైనా ఎక్కడా గాయంలేదు. శరీరంలో హఠాత్తుగా రక్తహీనత ఎలా ఏర్పడిందా అని ఆలోచిస్తున్నాను—" అన్నాడు డాక్టర్—"లేకపోతే ఇదేదో కొత్తరకం జబ్బు అనుకోవాలి."

"అలా అనుకోవద్దు. మీరు చెప్పిన మందులు

వాడతాను—" అంది మధు తల్లి.

"పెద్దగా మందులేం అవసరంలేదు. ఆహారం విష యంలో శ్రద్ధ అవసరం—" అంటూ డాక్టర్ ఏదో టానిక్కూ, కొన్ని మందులూ రాసి—పెట్టవలసిన పళ్ళు, ఆహారం గురించి ఆమెను మరీ మరీ హెచ్చరించాడు.

డాక్టర్ ఇచ్చిన ఇంజక్షన్ తర్వాత మధు కాస్త పుంజుకున్నాడు. అతను లేచి త్వరత్వరగా కాలకృత్యాలు తీర్చుకున్నాడు. టైము పదయ్యేసరికి తల్లితో "నేను బైటకు వెళ్ళాలమ్మా!" అన్నాడు.

"ఎక్కడికి వెడతావురా—నీ వంట్లో అసలే బాగో లేదు. డాక్టరు నీకు విశ్రాంతి కావాలన్నాడు—" అంది తల్లి.

"లేదమ్మా—నేనిప్పుడు బాగానే వున్నాను. బయటకు వెళ్ళకపోతేనే నా ఆరోగ్యం పాడవుతుంది. నన్ను వెళ్ళనీ!" అన్నాడు మధు.

"ఒరేయ్—నిన్నగానీ నువ్వెవ్వరికైనా రక్తదానం చేశావా?" అనడిగింది తల్లి.

ఒక్క క్షణం ఆలోచించి—"చేశానమ్మా!" అన్నాడు మధు.

"ఎవరికి?"

"అలాంటి ప్రశ్నలు నన్నడగొద్దు—నా రక్తం—నా యిష్టం—" అన్నాడు మధు చిరాగ్గా.

"అవేం మాటల్రా — పొద్దున్న ఎంత భయపడి పోయానో నీ పరిసితి చూసి. నువ్వు రక్తదానం ఇవ్వడం వల్లనే అలా నీరసపడిపోయావన్నాడు డాక్టర్—ఇంకెప్పుడూ అలాంటి పన్లు చేయకు—" అంది తల్లి.

(ఇంకా వుంది)

# "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల 7 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి. సభ్యులు కానివారు తమ వ్యాఖ్యలతో 50 పైసల స్టాంపులు పంపాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 25/- లు నగదు బహుమతి పంపుతాము.

# "హోమ్ డెలివరీ"

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెం నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 10/- లకే మా ఏజెంట్ ద్వారా గాని, వి.పి. ద్వారాగాని మీ యింటి దగ్గర అందజేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీలకోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరగాల్సిన అవసరం వుండదు. కాపీలు దొరకలేదనే నిరాశ, పోస్టులో పోయే సమస్య, ఎంతమాత్రం లేదు.

నెల నెలా వి పి. తీసుకోవటం కష్టమనుకునేవారు ఏడాది పైకము రు. 120/-లు ముందుగా పంపవచ్చును.



# క్రైమ్‌లో తమాషాలు

(ఈ శీర్షికలో ప్రచురితమయ్యే ప్రతిరచనకూ రూ. 5 పారితోషకం ఇవ్వబడును.)

## "దోపిడి వాదం"

హైద్రాబాద్ సిటీబస్సులో చోటులేక నుంచున్న పరశురామ్ కుర్చున్నవాళ్ళను చూసి "సమానత్వం" మీద ఉపన్యాసం దంచేడు—నిలబడినవారు కూర్చున్న వాళ్ళదృష్టిలో మనుషులు కారని కూర్చున్న వాళ్ళంతా కేపిటలిస్టులనీ ఏదేదో మాట్లాడేసరికి కూర్చున్న వారిలో ఒకడు కంగారుపడి లేచిపోయాడు.

పరశురామ్ కూర్చున్నాడు.

మరొకడు అనారోగ్యంతో బాధపడుతూ చోటు అడిగాడు. పరశురామ్‌కి మండింది. "సభ్యత" మీద ఉపన్యాసం సాగించాడు. నిలబడినవారికి సభ్యత ఉండదనీ, కూర్చున్నవారిపట్ల కొంచెమైనా గౌరవభావం చూపించరని ఏదేదో మాట్లాడేసరికి ఇదంతా గమనిస్తున్న దాదా "దోపిడీ" గురించి మాట్లాడి పరశురామ్‌ని క్రిందకి విసిరి కొట్టాడు.

—ఇమంది లక్ష్మీదేవి, మద్రాసు-24

## "దాడి"

ఓ రిటైర్డ్ మిలిటరీ ఆఫీసర్ ఆ రోజు మొహమంతా పట్టీలతో చేతికి కట్టుతో వచ్చాడు క్లబ్‌కి.

"ఏమైంది?" ఆత్రంగా అడిగారు మిత్రులు.

భారంగా నిట్టూర్చి అన్నాడు మిలిటరీ ఆఫీసర్. "ఈ రోజు బాత్‌రూంలో నామీద దండయాత్ర జరిగింది. నిరాయుధుణ్ణి చేపి ఎదుర్కోబడ్డాను. నిస్సహాయుణ్ణయి హింసించబడ్డాను."

"ఎవరు! ఎవరు మీమీద ఈ దాడి జరిపింది?"

"మా పెంపుడు పిల్లి" తల వంచుకుని విచారంగా అన్నాడు. "స్నానం చేయించడానికి దాన్ని బాత్‌రూంలోకి తీసుకెళ్ళాను."

—ఎస్. వాహీద్, బొంబాయి-22.

## 'పాపం పిచ్చోళ్లు'

ఒక గజదొంగ, ఒక హంతకుడు మంచిచోటు చూసుకొని దారికాచారు. అల్లంతదూరంలో ఒక లావుపాటి మనిషి కాళ్ళీడ్చుకొంటూ వస్తున్నాడు.

అది చూసి "హ....హ....హ! నేను గజదొంగని! డబ్బు తీయ్!" అన్నాడు గజదొంగ!

"హ....హ ...హ! నేను హంతకుడ్ని. హత్య చేస్తాను!" అంటూ బెదిరించాడు హంతకుడు.

"పొండి మీ రిద్దరూ పిచ్చోళ్ళు!" అని యిద్దరికంటే భయంకరంగా నవ్వాడు. ఇద్దరూ ఆశ్చర్యంగా తల పైకెత్తి

చూశారు. అపుడు తెలిసింది వారు కాపు కాసింది పిచ్చాసుపత్రి దగ్గరని. వెంటనే కాళ్ళకు బుద్ధి చెప్పారు.

"పాపం పిచ్చోళ్ళు!" అంటూ తనలో తనే నవ్వుకున్నాడు బరువయిన శరీరం కదిలేలా ముందుకు సాగిపోతూ.

—ఇమంది లక్ష్మీదేవి, మద్రాసు-24.

# ట్రాఫిక్ రూల్స్

ట్రాఫిక్ పోలీస్ జోరుగా వెళుతూన్న ఓ కారును సిగ్నల్ ఇచ్చి ఆపివేశాడు.

"ట్రాఫిక్ రూల్స్ ప్రకారం ఇంత వేగంగా పోరాదు. పైగా మీ కారుకు లైట్లు కూడా లేవు—" అన్నాడు ట్రాఫిక్ పోలీస్.

"కారులో కూడా లైట్లు లేవుసార్. అందుకే వేగంగా వెళుతున్నట్లు నాక్కనిపించలేదు."

"మీ కారు బ్రేక్‌లు బాగున్నాయా?"

"ఊహుం. అవి కూడా పన్చెయ్యవు...."

"డ్రైవింగ్ లైసెన్స్ ఉందా?"

"లేదు. నే నెప్పుడు దాన్ని తీసుకోనేలేదు."

"నాలుగు నియమాలను ఉల్లంఘించావ్. చాలాన్ చేయాల్సి ఉంటుంది మీ పేరుపైన—"

అంతలో కారులో వున్న ఆమె ఇలా అంది. "అతనితో ఏం మాట్లాడుతూ నిల్చున్నారండి. అయ్యో పోలీసుగారూ! మా వారు తాగినప్పుడు ఇలా తలా తోకాలేని మాటలు మాట్లాడుతుంటారు. పోనీండి" అంది.

—చాగాపురం నాగేశ్వరరావు, గద్వాల.

